" తనది యనక యేమి ధనమునఁ బ్రియమందు,
నెద్ది తుడువకుండ నెసఁగుఁ దృప్తి,
యిచ్చుఁ బొందులేక యెయ్యది బలమిచ్చు
దానిఁ గనుట శ్రుతుల తలఁపుఁ గనుట. "

" ఒరులేయవి యొనరించిన
నరవర! యప్రియము తనమనంబునకగుఁ దా
నొరులకు నవిసేయ కునికి
పరాయణము పరమ ధర్మపథములకెల్లన్. "

( శ్రీమదాంధ్రమహాభారతము )

శ్రీ సమర్థ సచ్చిదానంద సద్గురు
శ్రీ సాయీబాబా మహారాజు.



కర్మధూమ పత్రంబులఁ గాల్చు 'చిలము'
శత్రుషట్క భయం బేపఁ జాలు 'సటక'
అక్షయార్థసిద్ధిని గూర్చు 'భిక్షపాత్ర'
శరణమిడు 'పాదుకల' నెంతు- సాయిదేవ!

ఓం

శ్రీ సాయీ సద్గురవేనమః

# ప్రార్థన

సాకారుండవొ, లేక, ని
రాకారుఁడవో, ఋజువు సేయఁగుదువొ తెలియఁగన్
నాకగునె? శ్రితుఁడ, జడుఁడను,
సాకవె! నీ కరుణఁ బఱపి సాయీనాథా!

సందేహము లడఁపవె! నీ
యందున నేకాంత భక్తి నందింపవె! ని
న్నెం దేమఱ నీకవె! యఘ
సందోహముఁ బాపఁగదవె! సాయీనాథా!

చేయఁదగని పనులు చేసితి నెన్నియో
చేయఁదగినవాని జేయనైతిఁ;
కృపణుఁడైన నాకు నిఁక వేఱుగతిలేదు
కరుణఁ బఱపి బ్రోవఁగదవె! సాయి!





OM SRI SAI

All India Sai Samaj.
126, Brodies Road,
Mylapore.
3-2-'46.

President,
B. V. Narasimhaswami.

Dear Hanumantha Rao,

Your letter dated 2-2-'46 to hand very good to hear the news. The name "Sri Sai Karuna" is very good, you proceed with the work.

* * *

The more we work for others the greater is our punya and the greater the love Sai Baba has for us.

With all blessings for your success and happiness,

I am yours sincerely,
B. V. Narasimhaswami.

# పోషకులు

శ్రీ పాదిల విశ్వనాథ శర్మ గారు. S. ఇల్లిందలపర్రు. 116-0-0

,, బాపట్ల వేంకట పార్థసారథి గారు, చెరువుగ్రామము. 80-0.0

,, కర్రి పెదమునిరెడ్డి గారు. S ఇల్లిందలపర్రు. 50-0 .0

,, కొప్పరపు రామారావుగారు. (శ్రీరామసాయినిలయము)
కానూరు, 25-0-0

Dr. R. శ్రీనివాసరావు గారు. జగ్గయ్యపేట. 25-0-0

శ్రీమతి K. సరోజిని గారు c/o శ్రీ K. సుబ్బయ్యగారు
B.E., M Sc. కోయంబత్తూరు 25 0-0

శ్రీ G. విశ్వనాథంచెట్టి గారు Registrar
Co-op Societies. హైదరాబాద్. 20-0-0

,, మామిడి వెంకటరమణ గారు. తుని. 20 0.0

,, రామాయణము లోవరాజు గారు.
మార్కెట్ సాయిసమాజము, తుని 20-0-0

,, P V. రమణయ్యగారు. Forest Range Officer.
కురుపం, 20-0-0

,, పాన్యం వేంకటసుబ్బయ్యగారు.
Rly. Station Master. చిన్నగంజాము. 20-0-0

,, ఒక భక్తుడు. బొబ్బిలి. 20-0-0

,, R.S సోమయాజులు గారు. I.L.T.D. Co. గుంటూరు 20-0-0

,, యార్లగడ్డ దశరథరామయ్య గారు నాగాయతిప్ప. 20-0-0

,, నోరి వెంకటేశ్వర్లుగారు. I.L.T.D Co. చీరాల. 20-0-0

,, సింగనమల శ్రీనివాసులు గారు. (advocate) అనంతపురం. 15-0-0

,, D. రామచంద్రారెడ్డి గారు. Manager,
B. S. Mica Mines. తలుపూరు 15-0-0

,, P. సుందరరామశాస్త్రి గారు. I.L.T.D. Co. చీరాల. 15-0-0

,, చివుకుల వీరరాఘవయ్యగారు. (Retired teacher ,, 15-0-0

శ్రీమతి గరిమెళ్ళ కామేశ్వరమ్మ గారు. వెదురుపాక. 14-0-0

శ్రీ G.B.V జోగారావుగారు.
భార్య- శ్రీమతి వెంకట సుబ్బలక్ష్మి గారు } తుని 12-0-0

# 10 రూపాయలు యిచ్చినవారు

శ్రీ G.B.V. జోగారావుగారి తల్లి శ్రీమతి సీతమ్మగారు. తుని.
,, నందనవనం వెంకట కృష్ణారావుగారు. Teacher. టంగుటూరు.
,, పాదరం సూరయ్య నాయుడుగారు. అనకాపల్లి.
,, కోణతల రామలింగస్వామి నాయుడుగారు ,,
,, కోటపర్తి వరహాలుగారు. ,,
,, పాగోలు నారాయణరావుగారు. మచిలీబందరు.
,, బచ్చు రామచంద్రరావుగారు. S/O సత్యనారాయణగారు. ,,
,, చింతల సూర్యనారాయణుడుగారు. డొంకినవలస.
,, Dr. V. సుబ్బరామారావు గారు. భీమడోలు.
శ్రీమతి కమలా వెంకటరత్నమ్మ గారు. కాకినాడ.
(శ్రీసాయిమందిర ప్రతిష్ఠాపకురాలు)
శ్రీ కాపూరి కోదండరామయ్య గారు. రావివారిపాలెము
,, రాళ్ళబండి సత్యనారాయణ గారు. H. M. B. H. School. పెనమలూరు.
,, కంటమనేని సుబ్బయ్యగారు. నాగాయతిప్ప.
,, కంటమనేని రాజేంద్రరావుగారు. ,,
,, కంటమనేని పిచ్చయ్య చౌదరిగారు. B.A., ,,
Dr. N.V.R. సాంబశివరావుగారు. నాగులవరం.
శ్రీ లింగం నారాయణదాసుగారు. ఇచ్ఛాపురం.
Dr. D.V. రమణయ్యగారు. పాలకొండ.
శ్రీ గంగరాజు మార్కండేయశర్మగారు. I.L.T.D. Co కొమ్మూరు నాగులపాడు.
,, కొలను లక్ష్మీకాంతరావుగారు. B.A., B.Ed. పాతపొన్నూరు.
,, Y.V. కుటుంబరావుగారు. J.S.C Majistrate. మడకశిర.
,, Ch. సాంబశివరావుగారు. Manager, Co-op. Urban Bank పర్లాకిమిడి.
,, K.N. గుండయ్యగారు. మల్లేశ్వరము (బెంగుళూరు)
,, అద్దంకి వెంకట కృష్ణయ్యపంతులుగారు. ఒంగోలు.
,, శివర లక్ష్మీనరసయ్యగారు (Bus owner) బొబ్బిలి.
,, పిడ్డా నారాయణస్వామిగారు. ,, ,,
,, Ch. కుటుంబరావుగారు. అవనిగడ్డ.
,, అత్తిలి వెంకట కనకరాజుగారు. హైదరాబాద్

,, బాలకృష్ణ గారు Prop. Narendra Fancy House. హైదరాబాద్.
,, రాంపల్లి అగ్నిహోత్రుడు గారు, అత్తిలి
,, కర్రి వెంకట రత్నారెడ్డిగారు. S. ఇల్లిందలపర్రు.
,, పెనుమాళ్ళ సత్యనారాయణమూర్తి గారు. ,,
,, గుడిమెట్ల నారాయణరెడ్డిగారి భార్య
శ్రీమతి చెల్లమ్మ గారు. ,,
,, పునులూరి రామమూర్తి గారు, T. కొత్తపల్లి.
,, పమిడిముక్కల శివరామయ్య చౌదరిగారు. వెల్లటూరు.
,, పొన్నగారి వీరరాఘవయ్యగారు s/o సూరయ్యగారు కొప్పెరపాడు
,, బొమ్మిశెట్టి సత్యనారాయణగుప్త గారు. చిన్నగంజాము.
,, భైరవపట్ల వీరభద్రరావుగారు. పైడికొండ.
,, సంగాపు సుబ్బారావుగారు. గుంటూరు.
,, వంగిపురపు శేషగిరిరావుగారు- వారి భార్య
శ్రీమతి హేమలత గారు చీరాల.
,, Ch. వీరరాఘవులుగారు- వారి భార్య
శ్రీమతి జానకమ్మ గారు. మోరి.
,, గిట్టల నరసింహామూర్తి గారు. ,,
శ్రీమతి కోడూరు అప్పల నరసమ్మ గారు శృంగవరపుకోట.
c/o అప్పలస్వామిగారు Sub-Registrar.
శ్రీ గట్టా వెంకటరత్నంగారు. కానూరు.
,, కోవెలమూడి రామబ్రహ్మంగారు. ,,
,, గట్టా శివరామకృష్ణయ్యగారు ,,
,, L. శోభనరామసింగ్ గారు. Sub Past master, వీరంకిలాల్.
,, గ్రంధి సుందరరావుగారు. హైదరాబాద్.
,, D. రామమూర్తిగారు. (Co-op. Sub Registrar. బాపట్ల.
,, K. కోటయ్య ఆచారిగారు. (Retired Tahsildar) బాపట్ల
,, C. నారాయణస్వామిగారు. Sub Inspector of Police, వెదుళ్ళపల్లి.
,, కోటూరు వెంకటరాయలుగారు, (జవులివ్యాపారం) నాయుడుపేట.
,, చేజెర్ల సుబ్రహ్మణ్యశ్రేష్ఠిగారు. నాయుడుపేట.
,, D. రాజగోపాల్ గారు. M.I. Overseer: గూడూరు
,, S.V. చలపతిరావుగారు. నెల్లూరు.
,, D. హనుమంతరావుగారు. Inspector C.E. కోయంబత్తూరు.

,, కుప్పం చిన నారాయణప్ప గారు. గుత్తి.
,, K S.N. పాట్నాయక్ గారు. విజయనగరము.
Dr. N రామారావుగారు. గొల్లపల్లి.
శ్రీ A.V. నరసింహారావు గారు. మారీస్ పేట, తెనాలి.
,, సేగు రామయ్యసెట్టి గారు. కర్నూలు.
,, G. రాఘవులు గారు. ,,
,, A. చెంచిరెడ్డి గారు. కడప.
,, V. శంకరరెడ్డి గారు ఊటుకూరు (నెల్లూరు జిల్లా)
,, బొడ్డపాడు శ్రీరాములు గారు. బెజవాడ.
,, D.V. రావుగారు. R.A. (Naval Base) విశాఖపట్టణము.
శ్రీమతి N. దమయంతీదేవి గారు. c/o శ్రీ N.V. నారాయణరావు గారు.
విశాఖపట్టణము.
,, Dr. D.V. రమణి గారు. L.M.P. ,,
శ్రీ P.L. నారాయణ గారు (Kartic Tea Estate) హాటిపోత.
,, L. అప్పారావు గారు. కోరాడ. హీరమండలము.
,, M.S. మాధవరావు గారు. కత్రిగుడ. హైదరాబాద్.
,, రాజుపాలెము శ్రీరామమూర్తి గారు. Teacher, చీరాల.
,, ములుకుట్ల లక్ష్మీనారాయణ గారు. చీరాల.
,, వెల్లంకి లింగమూర్తి గారు. (Andhra Photo Studio)
రాజమహేంద్రవరము.
,, రావినూతల శ్రీరాములు గారు. Head-master,
B.H. School, దుద్దుకూరు.
,, రావినూతల సత్యనారాయణ గారు. Govt. Hospital,
గుంటూరు.
,, పసుమర్తి సూర్యప్రకాశరావు గారు. తెనాలి.
,, మామిళ్ళపల్లి పార్వతీశ్వరరావు గారు. Teacher. దొప్పలపూడి.
,, K.V. శాస్త్రి గారు. I.L.T.D. Co చీరాల.
,, ధేనువకొండ రాధాకృష్ణయ్య గారు, ఒంగోలు.
,, B V.R. శర్మ గారు. Sub Post master, గుడదల.
,, K.M. రామచంద్రచెట్టి గారు. B.A., Spl Dt. Tahsildar
పుత్తూరు.
,, గుండి విశ్వనాధం గారు. Advocate, నెల్లూరు.
,, S.K.D. ప్రసాదలింగం గారు. తెనాలి.

# శ్రీ సాయీ కరుణ

## -: విషయ సూచిక :-


| విషయము | పుటసంఖ్య |
| --- | --- |
| విజ్ఞప్తి etc | |
| శ్రీ సాయీనాథాష్టకము. | |
| **ఉపక్రమణిక.** | |
| మేలుకొలుపు | 1- 2 |
| స్వప్నవృత్తాంతము | 3- 4 |
| వినతి | 5 |
| జయనమోవాకములు | 6 |
| నిర్వేదము-ప్రార్థన | 7 |
| అపాంతరాత్మ | 7- 8 |
| శ్రీ సాయీప్రభువునకు వినతి | 8 |
| శ్రీ సాయీప్రభువు | 9-10-11 |
| శ్రీ సాయీప్రభువు-చరమసూక్తులు | 11- 12 |
| [illegible] | 12 |
| శ్రీ సాయీబాబా ఏకాదశసూక్తులు | 13 |
| **శ్రీ సాయీకరుణ- ప్రథమలహరి.** | |
| ద్వారకామాయి-అభయములు | 14- 16 |
| శ్రీ సాయీబాబా-అభయప్రదానములు | 16- 26 |
| బాబా సందేశములు | 27- 28 |
| శ్రీ సాయీబాబా-స్వభావము-మనోగతి-శక్తి | 29- 31 |
| బాబా సర్వవ్యాపకత్వము | 31- 38 |
| **శ్రీ సాయీకరుణ- ద్వితీయలహరి.** | |
| శ్రీ సాయీబాబా-విధులు | 39- 40 |
| సాయి దెబ్బలుతినియె మార్జాలమగుచు | 41- 42 |

## సాధనలు.


| | |
|---|---|
| సద్గ్రంథపఠనము | 91- 92 |
| బాబా సర్వాంతర్యామిగ ధ్యానింపుము- పూజింపుము | 93- 94 |
| ప్రకృతి దృశ్యములు | 94 |
| సంగీతము | 95 |


## నైతికబోధ.


| | |
|---|---|
| చక్కదిద్దుట | 95 |
| i కామము | 95 |
| ii క్రోధము | 95- 97 |
| iii గర్వము | 97- 98 |
| iv మాత్సర్యము- ఈర్ష్య | 98- 99 |
| v లోభము- అత్యాశ | |
| సాధుభయ్యా- బడేబాబా | 99- 100 |
| ధనము- (అ) దక్షిణ | 100- 102 |
| ఆస్తులు- (గడ్డివాము) | 102 |
| ఆవు | 103 |
| పేదరికము | 103 |
| ఈశ్వరుని శ్రద్ధ | 104 |
| (నైతికబోధ) సంతృప్తి- శరణాగతి | 105- 106 |
| భూతదయ | 106 |
| అలసత | 107 |
| సంశయమువిడచి విశ్వాసము వహింపుము | 107- 108 |
| అమితత్వము తగనిది | 108 |
| యోగము- ఉల్లిభక్షణము | 108 |
| బోధ- గమనిక | 109 |
| బాబా- అడఁకువ | 109- 111 |
| పూర్వకర్మ- దేహప్రారబ్ధము | 111- 112 |
| సత్సంగము- యమనియమాదులు | 112- 113 |
| మరణము | 114- 115 |
| జననము | 116- 117 |

## శ్రీ సాయీకరుణ- చతుర్థలహరి


| | |
|---|---|
| బాబా ఇతరసాధువులుగ దర్శనమిచ్చుట | 118. 120 |
| ,, శరణాగతుల కర్మవిమోచనము | 121- 124 |
| ,, ఇతరుల మనస్సులను చక్కదిద్దుట | 125- 127 |
| ,, ఋతంభరప్రజ్ఞ- (అంతర్జ్ఞానము) | 128- 140 |
| ,, భక్తులయెడ ప్రేమ | 140- 145 |
| ,, కుష్టురోగులయెడ దయ | 146- 147 |
| నిర్మలమనస్సుతో నొసగు కానుకలు | 147 |
| సంకుచితబుద్ధితో నొసగు కానుకలు | 148- 149 |
| తనభక్తులకొఱకు బాబా స్వార్థత్యాగము | 149- 150 |
| బాబా- భక్తులప్రార్థనల మన్నించుట | 151- 155 |
| బాబా- ప్రేమతో తనబిడ్డలనుకనిపెట్టి రక్షించుట | 156 157 |
| బాబా- తనభక్తులకు సంతతి ననుగ్రహించుట | 159. 163 |
| భక్తులప్రేమకు బద్ధుడై బాబా తనపూజకు సమ్మతించుట | 163. 164 |
| బాబా- భక్తులయెడ శ్రద్ధ | 165- 166 |
| బాబా- సర్వసమత్వము | 167- 173 |
| వినతి- శరణాగతి | 174 |
| హారతి | 175 |
| స్వబోధ | 176 |




ఓమ్
శ్రీ వేంకటేశాయనమః
శ్రీ సాయీ సద్గురవేనమః

# విజ్ఞప్తి

భక్తులారా!

దైవానుగ్రహమున సాధు సజ్జనుల ఆశీః ప్రభావము వలన, సుదాతలు వదాన్యులగు భక్త సోదరీ సోదరుల సహాయమున నేటికి- శ్రీ సాయీలీలా ప్రచురణములలోని పంచమ ప్రచురణము శ్రీ సాయీకరుణ- ఆంధ్రలోకమున వెలువడు భాగ్యము గలిగినది.

వచ్చియు రాని పలుకులతో "శ్రీ సాయీకరుణ" వివరింప సాహసించుట కాగడాతో సూర్యుని నిర్దేశించినట్లగును. శ్రీ సాయీభగవానుని ఆశ్రయ మహత్త్వమున కృతిరూపమగు నీ చిన్న దివ్వటీ యేమనక వెలుఁగునేని ప్రసరించి, సంసార నిబిడాంధకార గుహనుండి యీజీవి వెలువడుటకు దారిఁజూపి, శ్రీ సాయీకరుణా భాస్కర ప్రభాదీపిత ధామమున సచ్చిదానంద సుఖము ప్రసాదింప సమర్థమగునని ఆసించువాఁడను.

శ్రీ సాయీ ప్రభువు-ఆశ్రయము.

ఎందుకుఁగాఁఆగాని యీ జీవిని శ్రీ సాయీప్రభువు అనుగ్రహించిన విషయమునుగూర్చి శ్రీ సాయీమననము 'విజ్ఞప్తి' యందుఁ దెలిపియుంటిని. ఈకృతియందు 'ఉపక్రమణిక' లో 'స్వప్నవృత్తాంతము' అను శీర్షికక్రింద సంక్షిప్త ఫణితిని

విన్నవించినాఁడను. ఈశ్వరానుగ్రహము లేనిదే మనమేపనిఁ గావించుటకు సమర్థులముకాము. ఆ దైవ మెవరెవరిచే నేమి చేయింపఁదలఁచునో వానినిఁ జేయించును. వానికివలయు సకల సాధనోపకరణములను సమకూర్చును. అంతయు ఆతండ్రిలీల!

*శ్రీ సాయీకరుణ–గ్రంథ నామకరణము.*

1944 సంవత్సరము డిసెంబరు 27 తేదీన అఖిలభారత సాయీ సంఘాధ్యక్షుఁడు పూజ్య శ్రీ B. V. నరసింహస్వామి గారు తెనుఁగునఁ బలుకఁదగిన శబ్దములఁగూర్చి వివరముగఁ దెలిపిరి. ఆదినము మొదలు బాబా పలికించినవిధమునఁ బలికి 1 (శ్రీ) సాయిబాబా పూజాస్తవములు 2 (శ్రీ) సాయీమననము అను కృతులు సోదరభక్తుల కందించియుంటిని. శ్రీ నరసింహ స్వామిగారు రచించిన 'Charters and Sayings of Sri Sai Baba' అను గ్రంథమును 1945లోనే తెనిఁగింపఁదొడఁగితిని. దీని కేమిపేరు పెట్టుదువా!– అని సందేహించితిని. నా యీ జీవితమున ఆధ్యాత్మికముగ మేలుకొలుపుఁ గూర్చిన నా బాల్యమిత్రుఁడు (శ్రీ) బందా ఆదినారాయణగారు (చీరాల) 1946 లో నొక దినమున స్వప్నమునం దొక మహనీయుఁడు "KARUNA"–అను ఆంగ్లాక్షరములు ముఖపత్రమునఁగల ఒకగ్రంథమును నా కనుగ్రహించినట్లును– 'నాకును ఈయ రేమి?' అని నామిత్రుఁడడుగఁగా– "నీ కిదివరకే యిచ్చియుంటిని– ఇది వీనికి నిచ్చుచున్నాఁడను" అని ఆమహాత్ముఁడు చెప్పినట్లు ఆస్వప్నవృత్తాంతము నాకుఁ దెలిపిరి. బాబా యీ గ్రంథమునకు "కరుణ" అను పేరుపెట్టుమని నిర్దేశించినాఁడని గ్రహించి

"శ్రీసాయీకరుణ" అని యీ గ్రంథనామము నిర్ణయించితిని. ఈవిషయము పూజ్యశ్రీ నరసింహస్వామి గారికి ఉత్తరము రూపమున విన్నవించితిని. వారును తమ సమ్మతిఁ దెలుపుచు ఆశీర్వదించి వ్రాసిన 3-2-1946 ఉత్తరము నిందు ప్రచురించి నాఁడను.

ఈ దక్షిణభారతమున శ్రీ సాయీప్రభు భక్తిభిక్షను ప్రసాదించి, వేలు లక్షలకొలఁది సోదరభక్తులను సముద్ధరించిన పూజ్యశ్రీ B. V. నరసింహస్వామి గారు- "అభినవ- నానా సాహెబ్ చందోర్కరు-" శ్రీ సాయీభక్తి ప్రతిష్ఠాపనాచార్యులు- సాధువరేణ్యుఁడు మన కెల్లరకును చిరస్మరణీయుఁడు. వారు కావించిన స్వార్థరహిత శ్రీ సాయీప్రభుసేవ పలుకుల వివరింప నలవికానిది. దక్షిణభారతమేకాక యావద్భారత దేశము వారిని ప్రశంసించినది. వారికి మనమెల్లరము నెంతయు ఋణపడి యున్నారము. వారికీర్తి దిగంత విశ్రాంతమై చిర కాలము వర్ధిల్లుగాత!

శ్రీసాయీబాబా :-

మన దేశమున శ్రీ సాయీప్రభుభక్తి దినదినాభివృద్ధి నొందుచున్నది. లక్షలకొలఁది జనులు శ్రీసాయీ నామ మహాత్మ్యమును దెలిసికొనఁజాలిరి. పూజామందిరములు- భక్త సమాజములు విరివిగ వ్యాపించినవి. బాబానుగూర్చిన కృతులు పలువురు వారివారి శక్తులకొలఁది పలుకుచున్నారు. కొందఱు (జిజ్ఞాసువులే అనుకొందము) "సాయీబాబా ఎవరు?" అని ప్రశ్నించుచున్నారు. మఱికొందఱు "సాయీబాబా కూడా

దేవుఁడేనా?- ఉన్న దేవుళ్ళు చాలకనా?" అని అధిక్షేపించు చున్నారు. ఇట్లు నన్నొక మిత్రుడు ప్రశ్నించియున్నాఁడు. ఎవరేని మనల నేవిషయమునుగూర్చి ప్రశ్నించినను మనశ్శాంతి గోల్పోవరాదు. సౌమ్యముగ సమాధానము చెప్పుటయో లేక మౌనముగ మనదారిని తొలఁగి చనుటయో చేయఁదగిన పని. ఈవిషయమునుగూర్చి చీరాలనుండి వెలువడిన 'సాయిలీల' 1953 ఏప్రియల్ నెల పత్రికయందు, 1957 సంవత్సరమున వెలువడిన 'సాయిసుధ' పత్రికలందు (All India Sai Samaj - Mylapore- Madras- 4) వివరింపబడినది. "సాయిబాబాకూడ దేవుఁడేనా?- ఉన్న దేవుళ్ళు చాలకనా?- సందేహనివృత్తి"- అను గ్రంథమును బాబా అనుగ్రహించిన త్వరలో ప్రచురించి సోదరభక్తుల కందింపఁగలను ఒకటిరెండు విషయములుమాత్రి మిచటఁ దెలుపువాఁడను.

దైవము :-

సర్వజ్ఞుఁడు- సర్వసమర్థుఁడు- సర్వవ్యాపకుఁడు- నిరాకారుఁడు- నిరంజనుఁడు- నిర్గుణుఁడగు దైవము ఒకఁడే కాని పలువురులేరు. "ఉన్న దేవుళ్ళు చాలకనా?" అనుప్రశ్న అర్థములేనిది. ఆపృచ్ఛకుని భావమున 'దైవము'- అని చెప్పఁబడు వస్తువు యొక్క- వివిధ నామములుగల మూర్తులై యుండవచ్చును. ఆ దైవమునకు అనంతనామములు అనంతరూపములు కలవు. సర్వజ్ఞత్వాది విభూతులుగల దైవమును ఏనామమున నేభావమున సేవించినను ఫలము సమానమే. ఆ మూర్తియే (ఆరూపచిహ్నమే) దైవమని తలంపుగూడదు. ప్రపంచమునఁ

గల వివిధమతములవారు ధ్యానించు దైవమొక్కడే కాని పలువురు 'దేవుళ్ళు' కలరనుకొనుట తగదు. ఆ దైవమును- శివ- విష్ణు- శ్రీరామ- శ్రీకృష్ణ- విఠల్- దత్త- ఖండోబ- దేవి- అల్లా- ఖుదా- హరి- మొదలగు నేపేరులఁబిలిచినను దోసము లేదు. రోజాపుష్పమున కేపేరు పెట్టినను అది చక్కని పరిమళమిచ్చుచుండును. భగవంతుని మనసార ప్రేమించి యేపేరున ధ్యానించినను, అనుగ్రహించును.

"ఏకో దేవస్సర్వ భూతేషుగూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా
కర్మాధ్యక్షస్సర్వ భూతాధివాస స్సాక్షీచేతా కేవలోనిర్గుణశ్చ"

"ఒక్కఁడే యైనవాఁడు; సకల జీవములందును గూఢమైయుండువాడును, సర్వవ్యాపియు, సకల భూతాంతరాత్మగా నుండువాఁడును, సకలకర్మముల ఫలమొసంగువాఁడును, సకలవస్తువులందసు వసించువాఁడును, సాక్షియు, జ్ఞానసహితుఁడు; గుణరహితుఁడునై భగవంతుఁడున్నాఁడు."

శ్వేతాశ్వతరోపనిషత్తు. 6- ౧౧

దైవమును ఉపనిషత్తులు "బ్రహ్మము" అని నిర్దేశించుచున్నవి.

" యచ్చక్షుషానపశ్యతి - యేన చక్షూంషి పశ్యతి
తదేవబ్రహ్మత్వం విద్ధి - నేదం యదిదముపాసతే."

"ఏది నేత్రముతో చూచుటకుఁగాదో, దేనిచేత నేత్రము చూడఁబడుచున్నదో (విషయాకరింపబడుచున్నదో) అదే బ్రహ్మము- అని ఎఱుంగుము. తక్కినది బ్రహ్మముకాదు.

కేనోపనిషత్తు. 1- ౬

"యతో వా ఇమాని భూతాని జాయంతే. యేన జాతాని జీవంతి
యత్ప్రయన్త్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి-
సతపోఽతపస్యత- సతపస్తప్త్వా."

ఈసకల భూతములు దేనినుండి కలిగినవో- కలిగినవి దేనిచే జీవించుచున్నవో- నశించునపుడు దేనియందు లయమగునో అదియే బ్రహ్మము. అట్టి బ్రహ్మము నెఱుఁగుట కభిలషింపఁ దగును. (ఇట్టి బ్రహ్మము శరీరాముల మూలముగా నెఱుఁగ వలయునని తాత్పర్యము. దానిని తపస్సుచే తెలిసికొనఁదగును.)
తైత్తరీయోపనిషత్తు. 3- ౧

'జన్మాద్యస్య యతః'
'దేనినుండి యీ సకలము జనించి, వృద్ధినొంది లయమగుచున్నదో అది బ్రహ్మము. (బ్రహ్మసూత్రములు. 1- ౨
ఇట్టిప్రమాణము లసంఖ్యాకములు గలవు.

'సర్వం ఖల్విదం బ్రహ్మ' మని చెప్పఁబడుటచే వ్యక్తము- అవ్యక్తము అను సకలము బ్రహ్మము. కావున 'దైవము' ఒకఁడేకాని వేఱువురు లేరు. సాధకుఁడు ఈ వ్యక్తమునకు అవ్యక్తమే కారణమని గ్రహించనగును. ఛందోగ్యోపనిషత్తునందు ఋషి శ్వేతకేతువునకు 16 ఉపమానములు తెలిపెను. నేత్రములకు గోచరమగు లవణము నీటియందు గలసిన కంటికి అగోచరమైనది, కాని అది ఉన్నదే. నేత్రేంద్రియమునకుఁ గాన రాకున్నను, దాని యునికిని జిహ్వేంద్రియముచే తెలిసికొనఁ గలుగుచున్నాము.

ఈ విషయము భగవద్గీతలందు శ్రీకృష్ణుఁ డిట్లనెను.

"అవ్యక్తాదీని భూతాని - వ్యక్తమధ్యాని భారత!
అవ్యక్త నిధనాన్యేవ - తత్ర కా పరివేదనా?"
అరయ నవ్యక్తమైనట్టి యాదికలవి
వ్యక్తమౌ మధ్యఁగలవి, యవ్యక్తమగుచుఁ
దనరు నంత్యంబుగలవి భూతములు గాన
వానికై సేపు ఫల్గునా! వగవనేల?

భగవద్గీతామృతము. ౨- ౨౮

వ్యక్తము- అవ్యక్తము- ఒకేవస్తువు వేఱువిధముల నుండును అను భావము రూఢియగుచున్నది.

ఏకో వశీ సర్వభూతాంతరాత్మా - ఏకం రూపం బహుధా యః కరోతి
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా- స్తేషాం సుఖం శాశ్వతీ నేతరేషామ్.

ఒక్కఁడును- ఎల్లఱ వశము చేసికొనువాఁడును- సకలభూతముల అంతరాత్మయైనవాఁడును- ఏకమైయుండు తనను పలువిధములుగ కావించువాడును- ఆత్మస్థుడగు (పురుషుని) వానిని ఏధీరులు తెలిసికొందురో వారికిమాత్రమే శాశ్వత సుఖము కలుగును. ఇతరులకు లేదు.

నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్
తమాత్మస్థం యేను పశ్యంతి ధీరాః తేషాం శాంతిశ్శాశ్వతీ నేతరేషామ్.

ఎవడు అనిత్యములందు నిత్యవస్తువైయుండువాఁడో - చేతనము గలవారికి చేతనమునిచ్చువాఁడో- ఒక్కఁడుగనుండి పెక్కండ్రకు (వారివారికి దగినట్లు) కోర్కెల నొసంగుచున్నాఁడో- అట్టి ఆత్మస్థుని ఏధీరులనుసరించి తెలిసికొందురో వారికి శాశ్వతమైన శాంతి కలదు. (సంసారనివృత్తి కలదు. ఇతరులకు లేదు.

కఠోపనిషత్తు. ౨— ౧౨.౧౩

అట్టి దైవముయొక్క సగుణరూపము అవతారము. అవతారము- బ్రహ్మవిదుఁడు- సమర్థసద్గురువు- ఇవి పర్యాయ పదములు. వీరిలో తారతమ్యప్రశంసలేదు. అందఱు సమర్థులే. ఆశ్రియణీయులే. ఆశ్రితులను సురక్షితముగ గమ్యమును జేర్పఁజాలినవారే.

గురుమిలా తబజానియే - మిటేమోహతనుతాప్
హర్షశోకవ్యాపై నహీఁ - తబగురు ఆపై ఆప్.

తను తాపములు మోహతమసంబడంచి
ఘనభయహర్ష శోకములఁ దూలించి,
సమచిత్తవృత్తి నొసంగు వేద్యుండు
నమల బోధానందుఁ డతఁడే గురుండు.

( శ్రీసాయీకబీరు సూక్తులు )

అట్టి సమర్థుఁడగు సద్గురువునందు గాఢమగు విశ్వాసము- నిష్ఠ- అనుసరించుటకు ధైర్యముతోఁ గూడిన ఓర్పు- సబూరి; ఈ రెండును కలిగి ఆశ్రయింపవలయును. జీవి తనకు గలవనుకొను తెలివితేటలావలఁ గట్టిపెట్టి సంపూర్ణ శరణాగతి చేయవలయును. స్వార్థపరతకూడదు. గురువునాశ్రయించి అనుగ్రహము పొందవలసిన విధము బాబా వివరించినాఁడు.

(చూడుడు పుటలు 80- 85)

సమర్థ సద్గురువు

సమర్థ సద్గురువులను గూర్చి చింతించుట- పలుకుట- రచించుట- వారి లీలలను స్మరించుట జీవిని క్రమముగ నున్నత పదవి నందించుచుండును, వారి కరుణకు పాత్రులను గావించును. అవి సాధనచతుష్టయము లనబడు శ్రవణ మనన నిధిధ్యాసలగు చున్నవి. అవి మెదడునకుమాత్రమే ఆహారముకావు. హృదయములకు నాహారశక్తుల ప్రసాదించి యైహికాముష్మిక లాభముల గూర్పఁగలవు. భక్తి విశ్వాసములఁ బాదుకొలప సమర్థములు.

సాధువుల జీవితములు త్యాగసేవా మయములు. ఏ యవతారముఁ పరిశీలించిన, ఏ సమర్థ సద్గురువు జీవిత గాథలు తిలకించినను త్యాగసేవలు వారి జీవితాదర్శములనక తప్పదు. వానివలననే వారు విశ్వవ్యాప్తి నొందఁగలిగిరి. మహోత్తమమగు పరా వైరాగ్యము- మహాత్యాగమువలన మనుష్య జీవితమునందలి అస్థిరత్వమును బోధించి ప్రాపంచక వస్తువుల నపేక్షించుట నిష్ప్రయోజనమని నిరూపించి, కేవలము ప్రేయ వస్తువులకై భ్రమించి పరువులెత్తు తన బిడ్డలను క్రమముగ మరల్చి పరమ శ్రేయవస్తువునకు- ఆత్మసాక్షాత్కారమునకు- శ్రీ సాయిప్రభువు దారిఁ జూపినాఁడు.

భౌతికశరీరమున శిర్డియందున్నప్పుడు బాబా ఎక్కడ నుండెనో యిప్పుడు నక్కడే యున్నాఁడు. బాబా ఎక్కడకుఁ బోలేదు. త్రికాలములందున్నవాఁడే. నేటికిని సమర్థ సద్గురువే. ఊహకాదు. సత్యవస్తువై- సర్వాంతర్యామియై భౌతికతనువు

నందున్నప్పటికంటె నత్యధికముగ నీనాడును తన చైతన్యశక్తి ద్వారా తనబిడ్డల నడిపించుచున్నాఁడు. ఆసక్తితో శ్రీసాయీ ప్రభువు నెఱుఁగదలచినవారు ఈక్షణమున- నిప్పుడే తెలిసి కొనఁగలరు. పొందఁగలరు. దానికి కావలసినవి 1. నిష్ఠ (విశ్వాసము) 2. సబూరి (ధైర్యముతో గూడిన ఓర్పు).

బాబా అన్నిజాతులవారికి- అన్నిమతములవారికి గురుదేవుఁడైనాఁడు. తన అంకితసంతతి నెల్లవిధముల కాపాడువాఁడు. తన్ను ఆశ్రయించిన జీవికి ఆధ్యాత్మికముగ ఉత్కృష్టస్థితిని క్రమముగ ప్రసాదించును. ఈ జీవితమునఁ దనవాఁడెంతవరకు ఆధ్యాత్మికమార్గమునఁ బోఁగలఁడో అంతవరకుఁ గొంపోవును. జనానాంతరమునకైనను విడువఁడు. అట్టి సమర్థ సద్గురువు ఆ జీవికి ఐహికముగ నెట్టికొఱతలు లేకుండచేయును. బాబా యందుఁగల విశేషమిది. శ్రీ సాయీప్రభువు సర్వసంగ పరిత్యాగియయ్యును ప్రేమస్వరూపుఁడు. తన అంకితసంతతియందు అపార ప్రేమ వహించువాఁడు. శిర్డియందుండి తన బిడ్డలతో సరససల్లాపములు సలుపుచున్నను విశ్వమయుఁడు విశ్వవ్యాపకుఁడై సర్వజ్ఞుఁడై యున్నవాఁడు. ప్రాపంచక విషయములఁ బాల్గొనుచుండియు బ్రహ్మనిష్ఠనుండి అణుమాత్రమైన తొలఁగి యెఱుఁగడు. ఇక బాబాసంసారము అపారము. ఈవిశ్వమంతయు బాబాసంసారమే.

పరిణయము లేక సహచరి తరుణిలేక
చేనవేలుగ బిడ్డలఁ బెంపసేర్చె;
అరయఁ గాసేనిలేక గృహంబులేక
ఏలికల కేలికయ్యె సాయీప్రభుండు.

(శ్రీ సాయీవచనము- ద్వితీయసర్గము, ౯)

బ్రహ్మవిదులగు యోగివరులు పూర్ణలయయందు నానందించుచుందురు. బాబా అట్లుకాదు. సంఘమును త్యజించి యేకాంతమున నిర్వికల్పసమాధియందుండ లేదు. తానుగావింప నవతరించిన పనిని పూర్తిచేయుటకై తనవారితోఁ గలసిమెలసి యుండువాఁడు. అంతమాత్రమున బాబా బ్రహ్మనిష్ఠ కెట్టి కొఱఁతలేదు. తానెట్లు ఋణానుబంధమునఁ దనబిడ్డల నాదరించుచున్నాఁడో తనబిడ్డలనుగూడ ఆ ఋణానుబంధ రహస్యమును గమనింపుఁడని పలుమారులు హెచ్చరించినాఁడు. (అన్నా సాహెబ్ దభోల్కరునకు- హేమాద్రిపంతునకు- చేసిన బోధ గమనింపుడు. పుటలు 84- 85)

*బాబా మంత్రతంత్రోపదేశములను జేసియెఱుఁగఁడు.*

"చిత్రం వట తరోర్మూలే వృద్ధా శ్శిష్యా గురుర్యువా
గురోస్తుమౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః"

అని దక్షిణామూర్తి అవతారమునుగూర్చి చెప్పఁబడినటుల నొకపలుకేనియుఁ బలుకకయే తనబిడ్డల హృదయములఁబరివర్తనముచేయుశక్తి (శ్రీ) సాయీప్రభువునకుఁ గలదు. తన ప్రేమ తరంగములందుఁ దనవారినిఁ దేల్పఁగలఁడు. మహాసిద్ధపురుషులు- సమర్థ సద్గురువులు కటాక్షవీక్షణముమాత్రముననే తమఆశ్రితులందు జ్ఞానాగ్నినిఁ బ్రజ్వలింపఁ జేయఁగలరు. ఈ కనఁబడు జీవములందు భేదమసత్యమని- అన్నిటను ఒకే సత్యవస్తువు వరలుచున్నదనియు, ఈ సకలము ఆ సత్యవస్తువునందే 'సూత్రే మణిగణాఇవ'- సూత్రమునందు మణుల సమూహమువలె- కూర్పఁబడినదని తానువచింపకయే అట్టి యెఱుకను తనబిడ్డలకు బాబా ప్రసాదించువాఁడు.

దైవసాక్షాత్కారము స్వానుభవవేద్యము. శాస్త్రప్రవచనములచే బోధపడదు. సకల మతములు దైవసాక్షాత్కృతికి గురువు అవసరమనియే తెలుపుచున్నవి. ఆ గురువు సమర్థ సద్గురువై యుండవలయును. అట్లుకానినాడు "అంధేనైవనీయమానా యథాంధాః"

గ్రుడ్డివానిచే నడిపింపఁబడు గ్రుడ్డివారలగుదురు.
అవతారము.. సమర్థ సద్గురువు- అన నొకటే. వీరు దైవము యొక్క సాకారమే. "సంత్ తోచ్ దేవ్- దేవ్ తోచ్ సంత్"- 'సాధువే దైవము- దైవమే సాధువు'-అని తుకారాం పలికినాఁడు. పైతోడుగు వారికున్నను లేనిదియే. బాబాను ప్రత్యక్షముగ జూచిన మహనీయులు "బోల్తే- చల్తే- దేవ్"- 'పలుకుచు- నడచు దేవుఁడు'- అనిరి. జస్టిస్ రేగే- ప్రొఫెసర్ నార్కే- మొదలగు బాబాభక్తులు శ్రీసాయినాథుని ప్రత్యక్ష దైవమని ఉద్ఘాటించిరి. దాస్‌గణూ మహరాజు (96 సంవత్సరములు. ఇప్పటికిని సజీవుఁడై పండరియందు గలఁడు.)

"నరరూపుఁడగు జగన్నాథుఁడీతండు
చరియించు పలుకు చిత్సాక్షియీతండు
అనతభక్తకష్టార్తి హారకుఁడు
ఆనంద సుఖధాముఁడగు సాయివిభుఁడు.

*　　　*　　　*

సకలావతారముల్ సకల సాధువులు
అకలంక! నీవ; లేదయ్యా! భేదములు"

అని వివరించినాఁడు. (శ్రీ సాయీలీలామృతము. తృతీయబిందువు)

సమర్థ సద్గురువులు - శిష్యులు.

శిష్యుఁడును సద్గురువువలె స్వతస్సిద్ధముగ జ్ఞానస్వరూపుఁడే. భావమున మాత్రమే భేదము. సద్గురువు సంపూర్ణజ్ఞత అద్భుతామానుష సత్త్వము. సర్వసమర్థత- యోగైశ్వర్యము కలిగినవాఁడు. సద్గురువు నిర్గుణుఁడు. సచ్చిదానందుఁడు. లోకమును మానవసంఘమును ఉద్ధరించుటకు సాకారుఁడై- మనుష్యరూపము ధరించిన దైవము. అట్లు మనుష్యునివలె గోచరించినను నిర్గుణతత్త్వము లేశమేనియు కొఱత పడదు. సత్యస్థితి- చైతన్యశక్తి- సంపూర్ణ జ్ఞానము ఏమాత్రము కుంటుపడదు. శిష్యుఁడు వాస్తవముగ జ్ఞానస్వరూపుఁడే. అజ్ఞాన కలితములగు అనేకజన్మల సంస్కారములు అతని సచ్చిదానంద స్వరూపుఁడను ఎఱుకను మాటుపఱచును.

"అజ్ఞానేనావృతం జ్ఞానం - తేనముహ్యంతి జంతవః"

.... .... .... "అజ్ఞానమునను
జ్ఞానమావృతమగు, దానఁ బ్రాణులెల్ల
మోహమును బొందుచున్నారు పుణ్యచరిత!"

(భగవద్గీతామృతము. ౫. ౧౫)

అజ్ఞానమున "నేను జీవిని- అల్పుఁడను- బద్ధుఁడను" అను మొదలగు భావములు స్ఫురింపఁజేయును. సద్గురువు ఈవిధమగు నజ్ఞానమును సమూలముగ పెకలించును. బహువిధజన్మవాసనారూపమగు అజ్ఞానమును దొలఁగఁజేయుచు గురువు తనశిష్యున కెఱుక గలిగించును. తాను- ప్రపంచము- దైవము- వేఱను బుద్ధి సద్గురు కరుణవలన క్రమముగ తొలఁగి యాతని నిజస్థితి

యాతనికిఁ దోఁచును. స్వప్నము- నిద్ర తొలఁగిన మనుష్యుఁడు తననిజస్థితిని తాను తెలిసికొనఁ గలఁడు. చీకటి తొలఁగుటయే వెలుతురు. ద్వైతభావము లేకపోవుటయే అద్వైతస్థితి. ద్వైత తత్త్వమునుండి మనము అద్వైతమునుగూర్చి పలుకలేము. ఆస్థితిలేనివాఁడెవఁడేని చెప్పినదానిని వినినవానికి ఆ అద్వైతస్థితి గలుగుట దుర్లభము. అది అనుభవైకవేద్యము.

నేను జీవిని- జంతువును- శరీరమే నేను. దైవము- ప్రపంచము- జీవి- వేఱు- అని తలంచుటయే అజ్ఞానము. జ్ఞాన స్వరూపుఁడగు జీవికి జ్ఞానోపదేశము చేయవలసిన పనిలేదు. అజ్ఞానమును దొలఁగించిన శేషించునది జ్ఞానమే యగును. (చూడుడు పుటలు 88- 90) సద్భక్తుఁడు సకలమును వాసు దేవుఁడుగనే భావించును. భక్తునకు ఏగురువైనను శ్రీకృష్ణుఁడే. గురువు శిష్యుని వాసుదేవునిగనే భావించును. శ్రీకృష్ణున కా యిరువురు ప్రాణము- ఆత్మయు నగుచున్నారు.

“ జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ”

“జ్ఞాని యన నాత్మయే యని నామతము”

(భగవద్గీతామృతము. ౭- ౧౮)

భగవానుని నిరాకారునిగ ధ్యానింప సమర్థతగలవారట్లు చేయనగును. అట్లు చేయజాలనివారు వారివారి అభిరుచుల కొలఁది అవతార రూపములుగాని- సమర్థ సద్గురువును గాని ధ్యానింపనగును. తొలుత మూర్తి పూజనము కొంతకాలము సలిపినగాని ఆమూర్తియందు ప్రేమ అంకురింపదు. భగవంతుని యందు ప్రేమ హెచ్చినకొలఁది స్వార్థపరత మొదలగునవి

సన్నగిల్లును. తనగురుదేవుని స్వరూపము తనయందు- సకల భూతములందుఁ జూడ నేర్వవలయును. అట్లభ్యసించినకొలఁది భగవానుని సర్వవ్యాపకత్వము స్వానుభవమువలన గ్రహింపఁ గలడు. ద్వేషింపఁదగినవస్తువు విశ్వమున గోచరింపదు. దైవము ప్రేమస్వరూపుడు. భగవాను నందనన్యప్రేమయే భక్తి.

సాపరమప్రేమరూపా — నా. భ సూ. ౨

అదియొ. ఈశ్వరునెడ గాఢమైనప్రేమ — (ప్రేమామృతము)
(చూడుడు పుటలు 59-61 దైవమెవరు?)

ప్రేమ దైవంబు దైవమే ప్రేమయగును;
అది యుదయమొంద సకలంబుఁ బ్రాప్తమగును.

నానాబోధలలోని రహస్యమిదియే. "నిన్నుజేరు ఏ ప్రాణినైనను నన్నుఁగాభావింపుము"- అనినాఁడు. హన్సిరాజు-పిల్లి వృత్తాంతము.పుట 41; ఉపాసనీబాబా- నల్లకుక్క; రోగియగు సూద్రుడు. వృత్తమునుగమనింపుడు. (పుటలు 42-43) మఱియు బాబాసర్వవ్యాపకత్వము (చూడుడు పుటలు 31-32) లక్ష్మీబాయి సిందేతో చెప్పినమాటలు; కపర్దిసతి కుక్క-వృత్తాంతము- (పుట 121) పరిశీలింపుడు. కావున దైవమెల్లెడల ప్రతి జీవియందుఁ గలఁడను విషయము స్వానుభవమునఁ దెలిసికొనఁ గలిగిననాడే (పుస్తకములందుఁ జదువుటకాదు) సాధకునకు నిజమగు 'ఎఱుక' గలిగినదని మనము భావింపవలయును. అట్టి ఎఱుక పెక్కు-జన్మముల సుకృతమున- సమర్థ సద్గురు సాధు సేవల వలనఁగాని లభ్యము కాదు.

"బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వమితి సమహాత్మా సుదుర్లభః"

"పెక్కుజన్మంబులెత్తిన పిదప జ్ఞాన
వంతుఁడై 'యీసమస్తము వాసుదేవుఁ
డొక్కఁడే' యనుచు నరసి నన్నొందఁగలుగు
నా మహాత్ముఁడు దుర్లభుఁ డనఘచరిత!"

(భగవద్గీతామృతము. ౭-౧౯)

ఎన్నిజన్మలకైనను జ్ఞానసిద్ధికలుగు పర్యంతము సద్గురువు తనవాసని విడువఁడు. బాబా తన అంకిత సంతతిని ఎన్నెన్ని జన్మలనుండి కనిపెట్టియుండినది తెలిపినాఁడు. (పుటలు 18, 40) జీవి సద్గురువు నాశ్రయించి ప్రేమమార్గమునఁ జరించుచు తన విధ్యుక్తములను నెఱవేర్చుచున్న ఆజన్మమున సిద్ధిపొందజాలక పోయినను మఱుజన్మముననేని తప్పక సిద్ధిపడయఁ గలఁడు. చేసిన మంచిపని యెన్నటికిని వ్యర్థముకాదు.

"నహి కల్యాణ కృత్కశ్చిత్ దుర్గతింతాత! గచ్ఛతి"
.... .... నాయనా! పుణ్యకర్మంబు లాచ
రించునాతఁడు దుర్గతిఁ గాంచఁడెవఁడు?"

(భగవద్గీతామృతము. ౬.౪౦)

సమర్థ సద్గురువు కరుణకు జీవి పాత్రుఁడుకావలయును. అట్టివాఁడు ధన్యుఁడు. అట్టివానికి ఎఱుక (జ్ఞానము) తనంతట తానే అనుభూతమగును. నారదుడు భక్తిసూత్రముల దెలిపిన విధము గమనింపుడు.

"ముఖ్యతస్తు మహత్కృపయైవ
భగవత్కృపా లేశా ద్వా"
పరమ సాధుమహాత్ముల కరుణయేని
హరికృపా లేశమేని ముఖ్యమగు- దీన.

"మహత్సంగస్తు దుర్లభోఽ గమ్యోఽ మోఘశ్చ"
ఆమహాత్ముల సాంగత్య మనిన దుర్ల
భంబగమ్య మమోఘమై పఱగుచుండు. ౩౯

"లభ్యతేఽపి తత్కృపయైవ"
ప్రాప్తమగుటయు నా పరాత్పరుని కృపయ. ౪౦

"తస్మింస్తజ్జనే భేదాఽభావాత్"
స్వామికిం దదీయునకు భేదమేమిలేమి. ౪౧

"తదేవ సాధ్యతాం తదేవ సాధ్యతామ్"
ఇదియ సాధింపు డిదియ సాధింపుం డెపుడు. ౪౨

(నారద భక్తిసూత్రములు) (ప్రేమామృతము)

సమర్థుఁడు మహాత్ముఁడగు సద్గురువునందు జీవికి పూర్ణ విశ్వాసముండవలయును. విశ్వాసమున సకలము స్వాధీనమగును. స్వానుభవముచే విశ్వాసము స్థిరపడును. నిత్యానుభవముల వలన ప్రత్యక్ష ప్రమాణముల వలన నమ్మకము పెంపొందును. అట్టి విశ్వాసము కలిగించుటకు అవతారములు-సమర్థ సద్గురువులు తమ ఆశ్రితులకు హితములగు కోర్కెలు ప్రసాదింతురు. అట్టి కామితప్రదానములే దైవము తన ప్రపన్నునియెడ వినియోగించు ఉపకరణము.

భక్తుఁడు తన దైహిక భౌతిక సుఖముల కొఱకెంతెంత ఉపేక్ష వహించునో అంతంత ఆధ్యాత్మిక మార్గమున నిశ్చింతగ పయనింపఁ గలఁడు. విధ్యుక్తముల నెఱవేర్పఁ గలఁడు. శ్రీ సాయీప్రభువు తన బిడ్డల సకల భారముల నిర్వహించి వారిని నిశ్చింతగ తాను నిర్దేశించిన మార్గమున నడిపించువాఁడు.

బాబాను తెలిసికొని సమాశ్రయించిన హిందువులు- మహమ్మదీయులు- క్రైస్తవులు మొదలగువారు సంపూర్ణ భగవచ్ఛక్తి సామర్థ్యములుగల పరమ సద్గురువునెదుట నుంటిమనియు, తదనుగ్రహ లేశమున భగవత్ప్రాప్తి సిద్ధమని బాబాను తమతమ గురుదేవుడుగ భావించిరి.

'సాయిభక్తి'- అనఁగా ఎల్లరయెడ సమాదరణము. భగవంతునియందు విశ్వాసము గలిగి, (శ్రీ) సాయిప్రభువును పరమగురుఁడని- రక్షకుఁడని నమ్ముట. అన్ని మతములందు సమానముగ ప్రతిపాదింపఁబడిన ధర్మముల ననుష్ఠించుట యగును. ఎల్లరు బాబాను సత్యశౌచ దయాస్వరూపునిగ అనంతమగు దైవశక్తి గలవానిగ సర్వవ్యాపిగ- సర్వజ్ఞుఁడుగ, సర్వసమర్థుఁడుగ గ్రహించిరి. "నేను మీయందఱ నెట్లు ప్రేమించుచున్నాఁడనో మీరొండొరుల నట్లు ప్రేమించుకొనుఁడు. ఏమతమువా రామత సాంప్రదాయముల ననుసరించ్చినదువుఁడు. మతమును మార్చుకొనుటతగదు. అన్ని మతములు ఈశ్వరునకు సమ్మతములు"- అని బాబా తనవారికి బోధించువాఁడు. బాబాసమక్షమున నేవిధములగు మతనిర్బంధములులేవు. వివిధ మతములకుఁ జెందిన బాబాభక్తులు 'సర్వజ్ఞుఁడై, సర్వనియంతయై, అఘటిత ఘటనాసామర్థ్యములు గలిగి తమ్ము కంటికి ఱెప్పవలె ఎల్లవేళల నెల్లగతుల పరిరక్షించు బాబాను సర్వ విధములఁ ప్రేమించుటయే సర్వార్థసిద్ధికి ఉపాయోపేయములుగ నెఱుఁగజాలిరి. కష్టనాశకము అభీష్టదాయకమగు ప్రేమనే ప్రతిజీవియు నాసించును. అట్టిప్రేమను బాబాపాదములమ్రోల

ప్రతిజీవియు పొందఁజాలును. వివిధ మతములకుఁ జెందిన వారయ్యు గురుదైవమగు బాబాను మనసార ప్రేమించుటయే బాబాభక్తులకు సమాన ధర్మమైనది. అటుల నాప్రభువును ప్రేమించి సేవించు విషయమున వారివారి మతము లెందును ప్రతిబంధకములు కావయ్యెను.

'ఏకం సద్విప్రా బహుధా వదంతి'

సత్యవస్తువు ఒకటే. దానినిపండితులు పలువిధములుగఁ బలుకుదురు. 'అంగాన్యన్య దేవతాః'- ఇతర దేవతలు ఆ పరవస్తువు యొక్క- అంగములు- అని శాస్త్రములు పలుకుచున్నవి. సకల నామములు తనకే అన్వయించునని- సకల రూపములు తానే అని బాబా సిద్ధాంతీకరించినాఁడు. బాబాను సమాశ్రయించిన ప్రతి భక్తుఁడు ఏ మతము- ఏ సాంప్రదాయమునకుఁ జెందిన వాఁడైనను తన యిష్టదైవమును శ్రీసాయీప్రభువునందుఁ జూడఁజాలినాఁడు. దక్షిణాఫ్రికానుండి వచ్చిన డాక్టరునకు ఆతని యిష్టదైవమగు శ్రీరాముఁడుగ, M. S. నిమోన్కరునకు హనుమంతుఁడుగ, N G. చందోర్కరుబంధువు 'బిన్నివల్లా' అనునతనికిదత్తాత్రేయుఁడుగ, మేఘుఁడు అనుభక్తునకు శివుడుగ, ప్రధాన్ కుటుంబమునకు పాండురంగ విఠల్‌మూర్తిగ దర్శనమిచ్చెను. మూలేశాస్త్రికి ఆతనిగురువగు 'ధోలప్‌మహారాజు'గ దర్శన మొసఁగెను.

'యే యథా మాంప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్'

ఇంద్రనందన! యెటులెట్టు లెవ్వరెవ్వ
రాశ్రయింతురో నన్ను నేనట్టు లటుల
వారివారిఁ గైకొందు"... ... (భగవద్గీతామృతము. ౪-౧౧)

అను నుడి సార్థకము చేసినాడు.

శ్రీవారియందు మధ్యాహ్న హారతిలో చెప్పబడునది గమనింపుడు.

"జయా మనీ జైసాభావ్ తయా తైసా అనుభవ్"

"భావ సదృశ మనుభవమును గూర్తువు
సేవక జనులకుఁ జిద్విలాసుఁడవు"

(మధ్యాహ్న హారతి- శ్రీసాయీనాధ గేయసుధ)

భగవానుని వివిధ రూపముల గోచరించుటయేకాదు- ఆభగవం తుని తత్త్వము- సచ్చిదానందస్థితి బాబాయందు కలదు. అందుచేతనే "మైఁ అల్లా హూఁమ్"- అని శ్రీ సాయీప్రభువు పలుకఁ గలిగినాఁడు.

వికసనము జీవము- ముకుళనము మృతి- సకల భూత ములయెడ ప్రేమ వికసనము- స్వార్థచింతనము ముకుళనము. కావున ప్రేమ జీవనధర్మము. ప్రేమించువాఁడు జీవించును. స్వార్థపరుఁడు ప్రతిక్షణము క్షయించును. జీవించుట కూపిరి పీల్చునటుల జీవనాధారము ప్రేమకావున ప్రేమకొఱకే మనము ప్రేమించవలయును. స్వార్థరహితప్రేమ- నిష్కామకర్మ- యం దలి రహస్యమిది- స్వార్థరహిత బుద్ధితో మనము కావించు ప్రతి కార్యము విజయవంతమగును.

ఈ విశ్వమును నిలుపఁజాలు శక్తి ప్రేమ. సర్వాంతక ముల నిరోధింఁచగల శక్తి ప్రేమ. మన అసంపూర్ణ నాగరకతా ప్రపంచమున వ్యక్తికి- వ్యక్తికి, సంఘమునకు- సంఘమునకు, జాతికి- జాతికి, దేశమునకు- దేశమునకుఁగల ప్రతిబంధకములఁ

దొలఁగించి, యైక్యమొనర్పఁజాలిన శక్తి ప్రేమ. ఆ పరాప్రేమ స్వరూపము ప్రకాశించునెడ వైషమ్యము- ద్వేషము- అసూయ మొదలగునవి పటాపంచలగును. ఆ ప్రేమ యంత్రము - చిచ్ఛక్తి- శ్రీ సాయీబాబా.

బాబా విధులు:- (పుట. 39 గమనింపుడు)

భగవంతుని పరిచారకులలో తానొకఁడుగ- సర్వ శక్తి వంతుఁడుగ బాబా తననుగూర్చి యొక సందర్భమునఁ బలికినాఁడు. (బాబా-ఈశ్వరుని ఉపకరణము, చూడుడు పుట. 45)
D. S. రసానేతో భగవంతుని అనుజ్ఞ లేనిదే నేనేమియుఁ జేయఁజాలను- అనియు. G.G. నార్కేతో దైవము నీకు 'కుఫ్నీ' నిచ్చుటకు సమ్మతింపలేదు. అనగా నీవు సన్యాసివగుట దైవమున కిష్టము లేదు- అని పలికినాఁడు. దక్షిణలు తీసికొను సందర్భమున 'నే నందఱినుండి దక్షిణలు గైకొనను. ఆ దైవము నిర్దేశించినవారి వద్దనుండియే గ్రహింతును'- అని పలికినాఁడు.
(చూడుడు పుటలు. 100.102)

బాబాకు గల సకల సిద్ధులను మానవుల నుద్ధరించుటకే వినియోగించెను. బాబాభక్తి దినదినాభివృద్ధినొందుచు వివిధ జాతి మత కులములకు హానిలేకయే ధర్మ- మతముల నేకీకరణము గావింపఁజాలినది. హైందవ మహమ్మదీయ మతములకు సంఘర్షణ లేనివిధమున సమైక్యత గూర్చినది. సర్వమత సమ్మత మతస్థాపనము గావించినది. హైందవజాతియం దేకీభావము పెంపొందించినది.

శిర్డియందు ప్రతినిత్యము గావింపఁబడుచున్న "మధ్యాహ్న హారతి" గమనింపుడు.

"వ్యాపకహి సాయీ! .... .... ...." జయదేవ! జయదేవ!
"అవతరింతువు ధర్మ హాని గల్గినవేళ
పావనింతు సద్భక్తి- నాస్తికులకు నేని
వివిధ లీలలఁ బఱపి- విశ్వముఁ బాలింతుఁ
బవలు రేలు దీన- భక్తుల రక్షింతు ॥ జయదేవ! జయదేవ! ॥
"ఇరుమతములు సమమేక మభేదము
ఇరువుర దైవము నేనే సత్యము
పోరపడి కలహింపఁ బోలదు మీ" కని
సరిదిద్దినాడవు సాయీ అవతార! ॥ జయదేవ! జయదేవ! ॥

బాబాశక్తి అద్భుతము. అన్యోన్య ద్వేషములడఁచి వివిధ మతములందు సంఘములందు ప్రేమ పెంపొందించినది. బాబాను జేరిన వారే జాతికి- ఏ మతమునకు- ఏ కులమ్మునకుఁ జెందిన వారైనను 'అందఱము నొక్కైక పిత భక్తులము' అను భావము నెలకొల్పినది. గుణమ్మునకు ప్రతిబంధకమగు దోషము నడఁచి గుణమును మానవసంఘమున పాదుకొలిపినది.

సాధువులు దైవశక్తి కొంతవరకుగలవారైనను దైవము కాదు, అను సంభాషణము శిర్డియందు చావడిలో జరుగుచుండ Master. T. వెళ్ళి ధ్రువ చరిత్ర వినుట- వెంటనేవచ్చి "బాబా! వన్నక్కడ కేల పంపితివి? వారు నీవు దేవుఁడవుకావని చెప్పుచున్నారు"- అనినప్పుడు బాబా సమాధానము గమనింపుడు. (పుటలు. 109-111) వేలు లక్షలు జనులు బాబా దేవుఁడని నిర్ధారణ చేసినారు. సామాన్యదృష్టితోఁ జూచువారికి

బాబా ఒక 'పేద ఫకీరు' కావచ్చును. ఆతండ్రి సర్వజ్ఞత్వము సర్వవ్యాపకత్వము సర్వసమర్థతలు స్వానుభవమున గ్రహింపఁ జాలినవారికి బాబా దైవమే. ముమ్మాటికి దైవమే అగుచున్నాఁడు. పూనానుండి యొకవిదుషీమణి "శ్రీమతి-కాశీబాయి-కనిత్కార్" అను నామె "బాబా బ్రాహ్మణుఁడా! యవనుఁడా! ఎవరో! పరీక్షించి తెలిసికొనవలయు" నని శిర్డికి వెళ్ళెను. ఆమె ద్వారకామాయి మసీదు మెట్లెక్కుచుండగా బాబా ఎదురుగఁబోయి చేతితోఁ దనను నిర్దేశించికొనుచు-

"బ్రాహ్మణుఁ డితండు - స్వచ్ఛమౌ బ్రాహ్మణుండు
పావన బ్రాహ్మణుఁడు కోట్లప్రజల శుభ్ర
మార్గమున నడిపించి గమ్యస్థలంబు
నందఁజేయు నియ్యదియె బ్రాహ్మణ మసీదు" (పుట 29)

అనిపలుక, తనఅవివేకమునకు సిగ్గునొంది ఆతల్లి బాబాసర్వజ్ఞుఁడు సర్వాంతర్యామి యగు దైవమే యని గ్రహించి బాబాను సేవించి వెళ్ళెను.

బాబా- భక్తుల కోరికలు తీర్చుట :-

కోరిన కోరికలను సహ
కూరుతు నాశ్రితున, కడఁగికొని, యిట నేఁ జే
కూరుపఁ గోరిన దానిక
గోరఁగ నను డాయు ననెడి కోరిక, బిడ్డా!

అని, బాబా ఉన్నరహస్యము తెలిపినాఁడు, తానీయ నభిలషించునది తెలిసికొని దానిని తనవారు గోరెదరను తలంపున

ఆశ్రితులు కోరిన కోరికలను శ్రీ సాయిప్రభువు సమకూర్చు
చున్నాఁడు. తన బిడ్డలకు మేలు కలిగించు వానినన్నియు నిచ్చు
టకు బాబా వెనుకాడఁడు. వాతజ్వర పీడితుఁడగు బిడ్డకు
తల్లి అన్నము పెట్టునా?- పెట్టదు. పగలంతయు కష్టము చేసి
వచ్చిన బిడ్డను పస్తుపెట్టునా?- పెట్టదు. మృష్టాన్న మిడును.
తొలిబిడ్డకు పస్తుపెట్టుట హితము. మలిబిడ్డకు మృష్టాన్న మిడుట
హితము. తల్లి తనబిడ్డలకు మేలుగూర్చు విధానములట్లుండును.
ఇరువురు క్షేమముగా నుండుటయే తల్లి కోరిక. శ్రీ సాయీ
ప్రభువు ఆవిధముగఁ దనబిడ్డల కెప్పుడేవిధమున నెట్టిసహాయము
చేయవలయునో అట్లు కావించును. అందు పక్షపాతబుద్ధి లేదు.
లౌకికములగు కోర్కెల నొడగూర్చుచున్నను బాబా తన
వారిని గమ్యస్థానమునకు సురక్షితముగఁ జేర్పఁదలచువాఁడు.
బాబాను ఆశ్రయించిన మన గమ్యస్థానముఁ జేరఁగలమా?
అను సందేహము బిడ్డలమగు మనకుఁ గలుగుట సహజము.
ఆసందేహము నుదొలఁగించితనసర్వవ్యాపకత్వము,సర్వజ్ఞత్వము,
సర్వసమర్థత్వము ప్రకటించి ఆశ్రితులు ధైర్యమునఁ దనవెంట
వచ్చునట్లు చేయును. ప్రేమ విశ్వాస ధైర్యములు తనవారికిఁ
గలిగించవలయును. పిల్లలకు మిఠాయిఁ జూపిన దగ్గఱకువత్తురు.
వెంబడింతురు. తనవారికి లౌకికకాంక్షలను బాబా సమకూర్చు
టలో గల రహస్యము- ఆతండ్రి యీయఁ గాంక్షించినది
తనబిడ్డలెఱిఁగి దానిని కోరుదురనియే. "దీని నెవరడుగుదురా?"
యని యెదురుచూచును. "జాగుచేసిన మేను శాశ్వతముగాదు"
అనినాఁడు. (పుట. 24)

చేరినవారిలో నందఱి కట్టి భాగ్యము లభించునా? ఏవియో ఒకటి రెండు మిఠాయి ఉండలను తిని ఆవలకుఁ దొలఁగుదురు. అట్లు తన్నేకమాఱు ఆశ్రయించి సఫలీకృతులుగాక దూరముగఁ దొలఁగిపోయినను ఆబిడ్డలను బాబా విడిచిపెట్టడు. ఎన్ని జన్మలనైనను వారినిఁ గనిపెట్టి యేదోక నెపమునఁ దనదగ్గఱకుఁ జేర్చుకొనును- బోధించును- పరివర్తనము గల్పించును. "వారివారి కోరిక లోకకారణంబ కాని యిదియెల్ల నాదు సంఘటన సుమ్మి" అనినాడు. అంత్యమున జీవిత సాఫల్యము సమకూర్చి తీరును. ( పుటలు 27 - 28 ) అందఱి కట్టి భాగ్యము కలుగునా? యని సందేహించిన R. శ. రాస్నే కు బాబా సమాధానము గమనింపుడు.

( పుటలు 77 - 78)

ఒక సమయమున బాబాను ఆశ్రయించిన నామిత్రు డొకఁడు (Police Sub-Inspector) "బాబా తొలుదొలుతఁ దన లీలలను బ్రకటించి తోడ్పడురుగాని, తరువాత తరువాత మనకు సాయము చేయఁడేమి? అని నన్ను ప్రశ్నించెను. తొలుదొలత భక్తునకుఁ దన ప్రభావము నెఱుకపఱచిన తండ్రి తరువాత ఏల ప్రకటింపఁడు? ఆశ్రితుని శ్రీ సాయిప్రభు వేనాటను విడువఁడు. కాని మనము కోరు కోరికలు మనకు హితము కానియెడ వానిని బాబా ఎట్లు సమకూర్పఁ గలఁడు? "అర్హతను బొంది యావల నడుగఁ బొమ్ము" అని, బాబా పలుమారులు చెప్పినాఁడు. ( చూడుడు పుటలు 74 - 75 )

మన కర్మ్హాత కలిగెనా మన మడిగినను అడగకున్నను బాబా మన కవి సమకూర్చి తీకును. శ్రీ సాయిాప్రభువు ఒకళపథము చేసినాఁడు. "సన్నాశ్రయించువానికి తిండి గుడ్డలకు లోటు కలుగదు"- అని. (చూడుడు పుట 104) విపులములగు నైహిక భోగములఁ గోరి ఆతండిః పీడించిన నేమి చేయఁ గలఁడు? వానిని పొందుటకు మన కర్మ్హాత లేదని మనము సంతృప్తి సంతుష్టులను పొందియుండవలయును.

మనుష్యజన్మము-ప్రాముఖ్యత:-

"దుర్లభం త్రయ మేవైతే దైవానుగ్రహ హేతుకమ్
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయమ్"

అని, శ్రీ శంకర భగవత్పాదులు వచించినాఁడు. ఈశ్వరుని లీలా విశేషములు గ్రహించు జ్ఞానముగల జీవి- మనుష్యుఁడై- జన్మించుట గొప్ప సుకృతము. ఇట్టి నరజన్మము కలిగినపిదప జననమరణ రూపమగు సంసారమునుండి విముక్తి నొందవలయు నను వాంఛ గలుగుట మిక్కిలి గొప్ప సుకృతము. ఆవాంఛను సిద్ధింపఁ జేసికొనుటకు సమర్థుఁడగు సద్గురువును- మహాత్ముని ఆశ్రయము పడయగలుగుట సర్వోత్కృష్టమగు సుకృతము అనక తప్పదు. శాస్త్ర గురుబోధలచేత, స్వానుభవమువలన, ఆత్మానాత్మ వివేకముగడించి త్రివిధఫలప్రదుఁడును అపాంత రాత్ముయు- పరమపదప్రాప్తిఁ గూర్చ సమర్థుఁడగు సద్గురువు శ్రీ సాయిాప్రభువు పాదాశ్రయముఁ గనుట మహోన్నత సుకృత విశేషము.

ప్రయత్నము :-

ఈ శరీర మెప్పుడో ఏ నిముసమో మృత్యు వాతఁబడు నని లెస్సగ గ్రహించి ప్రతిక్షణము జీవిత పరమార్థమును పొందుటకు జాగ్రత్త పడవలయును. ప్రాకృత మానవుఁడు లోకవస్తువుల సంపాదించుట కెట్లు పరుగులెత్తునో వివేకి పరమార్థప్రాప్తి కంత త్వరపడవలయును. అట్లుగాక విషయలంపటుఁడైన హీన జన్మములు తప్పవు. ఉపన్యాసములు వినినను, ధర్మశాస్త్రములు పఠించి యోగము లభ్యసించినను, సత్కార్యాదులు పెక్కు లొనర్చినను పడయఁజాలని పదము సద్గురువు చేకూర్పఁ గలఁడు సమర్థ సద్గురు సన్నిధి ప్రభావముచేతనే మన హృదయము పరివర్తనము నొందును. ఆ సద్గురువు చర్యలు- సామాన్యభాషణములే మనకు సత్ప్రబోధముఁ గలిగింపఁగలవు. అట్టి మహాత్ముల సాంగత్యమే ఆశ్రితులకు క్షమ- శాంతి- విరక్తి దాన దయ శమ దమాదులఁ గూర్చి మోహనివృత్తినిఁ గలిగించును. సద్గురువు నాశ్రయించినవాఁడు స్వానుభవమున ప్రతిక్షణము తన తలఁపులలో- చెయ్వులలో కలుగుచున్న మంచి మార్పులను గ్రహింపఁగలఁడు. అగ్నిని సమీపించువానికి చలిభయము కలుగని విధమున సద్గురువు నాశ్రయించినవానికి పతన భయము లేదు.

సమర్థ సద్గురువు చేయూత అవసరము :-

మానవుల మగు మనము సాధారణముగ మన పాప కర్మఫలములు- కష్టములు భరించి అనుభవింపవలయును. అవి మనము మోయలేనంత బరువు కలవి. ఆధ్యాత్మిక దృష్టితో

గాక లోకదృష్టితో వాని నెదుర్కొనవలయును. మనము బలహీనులము. అజ్ఞానులమగు జీవులము. సందేహములఁ బాపుకొనలేము. నైతిక పతనమునుండి తప్పుకొనలేము. ఒక అడుగేనియు ముందుకు సాగింపఁజాలము. ఎంత వివేకియైన నొక్కదినముననే గగనమున కెగురలేఁడు. మన మనస్సులో యుద్ధములు చెలరేగుచునే యుండును, తొలుత మనయందుగల దోషములతో, ఆపిదప మనకింతదనుక గుణములని విశ్వసించిన వానితో స్పర్థించవలయును. మానవుఁడు వానినుండి తేలికగ బైట పడఁజాలఁడు. కావున వీనికి సంఘర్షణ తప్పదు. మన భారములు మనము మోయుశక్తి గలుగువరకు- నిర్భయముగ క్షేమముగ జీవయాత్ర సాగించుటకు ఆధారము- సహాయము కావలయును. అవలంబన మవసరము. నిర్జలకూపమునఁ గూలిన మండూకముల మగు మనము "ఇట్టి నిస్సహాయస్థితినుండి యెవరు వెలుపలకుఁ జేర్చి రక్షింతురా!"- అని ఎదురుచూచుచుందుము. కష్టపరంపరలు- దైనిక సమస్యలు- విఫల ప్రయత్నములు, స్వశక్తిపై నాధారపడి పురోగమింపఁజాలమని తెలుపుచుండును. మన దేహబుద్ధిబలములు చాలవు. ఇతర సహాయము నపేక్షింతుము. ఎదురు చూతుము. ఉన్నత శక్తిసామర్థ్యములు గలవాని సహాయము కావలయును. ఇట్టి విషమ జీవిత రంగమున వర్తించుటకు సమర్థ సద్గురువు చేయూత అవసరము.

ఇది సాధారణ మనుష్యులవిధము. సాధనచతుష్టయము గడించి, ఆత్మాన్వేషణపరులై, ఆధ్యాత్మిక మార్గమునఁ గొంతదనుక పురోగమించి, కొంత అనుభవము గడించినవారు కూడ

సమర్థ సద్గురువుల సహాయము పర్థించక తప్పదు. (ఉపాసనీబాబా వృత్తాంతము గమనింపుడు- సాయిసుధ 1958 అక్టోబరుసంచిక చూడుడు) మన- కుల దేహాత్మబుద్ధులు పోవు. ఇంద్రియములు శవములు కావు. పూర్వజన్మకర్మ ఫలరూపములగు పెద్ద బండలు మన వీపుపైఁజేరి మనల క్రుంగఁదీయుచుండును. చక్కఁబడనీయక బాధించుచుండును. దీనులమగు మనపై కరుణఁ బ్రసరించి ఉద్ధరింపఁగలవారికై నిరీక్షించుచుందుము. స్వశక్తిపై నాధార పడిన లాభము లేదు. తృప్తి లేదు. సత్యాఽసత్యములు- యుక్తాఽయుక్తములు- కార్యాఽకార్యములు తెలిసికొను బుద్ధిపాటవము మనకు లేదు. కావున మన మీకష్టములనుండి తప్పుకొనుటకై చేయు ప్రయత్నమునకు దైవము తోడ్పాటు కావలయును. అదియే దైవానుగ్రహము. లేక 'కరుణ'. మానవుఁ డంతర్దృష్టికై ప్రయత్నము చేయుచున్నను తనంతట తాను సఫలీకృతుఁడు కాఁజాలఁడు. ఏదొక దినమున నితఁడు దైవసహాయ మర్థించితీరవలయును. ఆసహాయమే- కరుణా- గ రూపొందును.

"మానసికోత్సేకము కలిగించినను తాత్త్వికముగ ప్రయోజనకారి కాదు." అని ఆ 'కరుణ' ను గూర్చి లాఘవ ముగఁ బరికించు విద్యాగర్వితులు కలరు. భౌతికవాదులు నవ్వుదురు. నైతికానుయాయులు నిరసింతురు. నాస్తికులు తెగ డుదురు. అది వారివారి పొరపాటు. ఏపరమాత్మ ఆధారమున నీజీవకోటి వర్ధిల్లుచున్నదో అట్టి పరమాత్మ సహాయము ప్రతి జీవియు పొందునవకాశము కలదు. ఎవరికివారు తమతమ అను భవములఁ బరిశీలించుకొందురేని యీ 'కరుణ' అనునది వాస్తవముగఁ గలఁదని యెల్లరకు బోధపడును.

'కరుణ'- అన నేమి? పరమాత్మ జీవాత్మదరికి నవతరించుటయే కరుణ. అచింత్యము- అనూహ్యమై సంతృప్తి సంతుష్టులను గలిగించు దివ్యశక్తి జీవిపై ప్రసరించుట- కరుణ. ఈ అంధకార ప్రపంచమున సలుకడ లేక అటునిటు తిరుగు జీవికి అస్పృశ్యమగు కరము నందించుటయే- కరుణ. జీవి నావరించి యుండు నిశ్శబ్ద విశ్వమునుండి అకస్మాత్తుగ ఆపరమాత్మ పలికిన పలుకు కరుణ. నిరాశనొందిన జీవిచాతకమునకు గోచరించు సుందరమగు ఇంద్రధనస్సు- కరుణ నిబిడాంధకారమున ఆకసమున కెగురు ప్రాశిచకోరము నెదుటఁ దోచు చంద్రమండలము- కరుణ.

అది యొకప్రక్కన మానవ సంకల్పము- అనుభూతి- తనువులమీదను- మఱియొకవైపున మానవకర్మములమీదను ప్రసరించి, తన ప్రభావమును నెఱపి అద్భుత ఫలములొసంగు నా పరాత్పరుని నిగూఢశక్తి. అది సర్వేశ్వరుని ఇచ్ఛ. కేవలము పవిత్రమగు కోరిక. అది యెఱుకపడని మార్గమున అద్భుత కార్యములు జరుప సమర్థమైనది. మూగను వాచాలునిగను- కుంటిని కొండలుదాటువానిగ- మృతుని జీవితునిగ- పతితుని పావనునిగఁ జేసి మానవున కంతర్దృష్టిని ప్రసాదింప సమర్థమైన అప్రతిహతశక్తి- 'కరుణ'.

ప్రతిజీవియందు నా పరమాత్మ అధివసించునట్లే- ఆతని కరుణయుఁ గలదు. ఆశక్తి మేల్కొలుపఁబడినపుడే- అది మానసికము గానిండు- దైహికము గానిండు- భావప్రేరితము గానిండు- బహుకార్యోన్ముఖము గానిండు దానివిధానమును

గుర్తింపఁ గలము. ఆకరుణ శక్తి అద్భుతము. మనోబుద్ధి మార్గముల స్పృశించి, జీవి నుత్సాహపరిపూరితునిఁ జేసి చక్కని మార్పుఁ జేకూర్పఁజాలినది. (చూడుడు పుట 86) ఆపరమాత్మ-దైవము ఎక్కడో లేఁడు. హృదయముననే- ప్రాణసన్నిహిత వర్తి యగుచునే యున్నాఁడు. ఆదైవ మెక్కడో యున్నట్లు తలంచుట కేవలము భ్రాంతి. యోగాభ్యాసమున- తత్త్వవిచారమున- సద్గురువునను గ్రహమున మానవుఁ డీరహస్యముఁ దెలిసికొనఁగలఁడు. సర్వభూత హృదయాంతర్వర్తి- ఈశ్వరుఁ డనన నుడి కేవలము కవితాచమత్కృతి కాదు. అది శాస్త్రీయమైనది. యథార్థము. హృదయమే ఆదైవము నివాస స్థానము. కావున ఆప్రభువు కరుణయు హృదయముననే మనకు గోచరించును.

దైవ కరుణ రెండువిధముల ప్రకటమగును. బాహ్య జీవితమునందు అసంతుష్టి- అసంతృప్తి జనించుట మొదటిది. (వైరాగ్యము) ఆధ్యాత్మిక సత్యమెఱుఁగవలయునను ఆసక్తి- రెండవది. (జిజ్ఞాస) మనబుద్ధిని మెల్లగ హృదయమువైపున కాకర్షించుటతో "కరుణ" ఉదయమగును. బుద్ధిని బాహ్య ప్రపంచమునుండి లోనికి మధ్యగామియైన ఒకశక్తి ఆకర్షించుచుండును. ఆవిధముగ నాకర్షింపఁబడిన జీవి దానికనుగుణముగ నెంతెంత అంతర్ముఖస్థితి నొందుటకు లొంగుచుండునో అంతంత ఫలము పొందుచుండును. ఏదియో తనముందు దారి యుండెననియు దాని నెఱుంగవలెననియు భావించును. అది యేదో వానిబుద్ధికి స్పష్టముగ గోచరింపదు. కాని అదియొక పవిత్ర వస్తువని అతని అంతర్దృష్టికి యించుక ద్యోతక మగుచుండును.

అంతిమ ఫలము "నే నెవండను?" అను పరిశోధనస్థితిని హృదయ మున స్థిరీభూతుం జేయును. అట్టు మార్గము నిర్ణయించి అంతిమ సత్యమునందు అంతర్దృష్టి పొందును. మొదటిస్థితి క్రమక్రమముగ రెండవస్థితికిఁ జేర్చుచు నెప్పటికప్పుడు సత్ఫలిత మును పొందించును.

హృదయమున రేకెత్తు ఆధ్యాత్మిక పిపాసచేత జిజ్ఞాసువు కన్నుల్లో కొలుకు సంతత బాష్పములు స్రవించును. భావప్రేరిత ములై నిరంతర బాహ్యాంతర మనోవృత్తుల సంఘర్షణ ఫలిత ముగ ఆ కరుణ తోచును. కొన్నియెడల నిది యొక నిగూఢ మైన వెలుగుగ— కొన్నిట సమర్థ సద్గురు రూపమున ద్యోతక మగును. అది క్షణికమే కావచ్చును. మరల తోచక పోవ చ్చును. ఆ పవిత్ర క్షణములో ఆ పరాశక్తి వీని అహంతను స్వాధీనపఱచుకొని తన అభిముఖము చేసికొనినపుడు కరుణ ప్రసరింపఁబడినట్లుత తెలుంగును. ఆస్థితికి జీవి నిస్సందేహముగ లొంగి దాసుండై యనుసరింపవలయును. ఆ కరుణాప్రసారము క్షణికమే యైనను దానిఫలితము వారములు— నెలలు— సంవత్స రముల తరబడి జీవిని సక్రమ పథమున నడుపుచుండును. ఆ కరుణ ప్రసరింపఁబడెనా జీవి సక్రమ పథవర్తి యగును. అంతదనుక గోచరింపని అవకాశములు వానికిఁ బొడగట్టు చుండును.

కరుణ స్పర్శ జీవి నైతికవిధానమునఁ దొలుత గోచరిం చును. పిదపఁ దలవని తలంపుగ ఆశక్తి వీని జీవిత పథమున పూర్తిగ మార్పు గొనివచ్చును. ఘోరపాతకియగు వాని హృదయమునందును నిష్కళంకము నిరామయమైన ఆపరమాత్మ

అభినసించి యీ జీవిని "తెలివి గలిగి మంచిమార్గమున ప్రవర్తింపుము"- అని మెల్లగఁ బలుకుచునే యుండును. "మేము పవిత్రులము- మేము పుణ్యాత్ములము"- అని స్వాభిమానులై గర్వించు మానవులచే నట్టివాఁడు నిరసింపఁబడినను అట్టి పాపి పైననే ఆపరాత్మ ప్రేమ అధికముగ ప్రసరించును. చెడిపోయిన బిడ్డ ఎట్లు చక్కఁబడునా?- యను చింత తండ్రికెప్పుడు నుండుట సహజము. అది అనుభవసిద్ధము. దటీఁజేటు వారలందఱకు కుసుమము సువాసనల ప్రసరించుచుండును. ఎవరినిఁ గాదనదు. ఇఁక కేవల పరమాత్మకరుణ జీవులపై ప్రసరింప కుండునా? స్వాభిమాన మానవసంఘము త్రోసిపుచ్చిన మాత్రమున ఈశ్వరుఁడు పాపులపై కరుణ వఱుపకుండునా? ఎన్నడు నట్లు జరుగదు. అట్టి పాపికిని ఆతండ్రి తనను జేరు నవకాశములు కల్పించును. వానిని విపరీత పథమునుండి మరల్చును. తన కభిముఖునిఁ గావించుకొనును. తన కరుణను ప్రసరించును. ఆ కరుణాస్పర్శ ప్రభావమున పాపిపాపము సర్వము పటాపంచలగును. త్రివిధ తాపములు శమించును. అసహ్యమగు గతము గతించును. నింద శమించును. నిరాశ నిర్ధూతమగును. బలహీనులు తేరుకొందురు. బాధితు లోదార్పఁ బడుదురు. మానవుఁడేమార్గమున ఐహికమునగానీ- ఆధ్యాత్మికమునగానీ ఏ ఉన్నత స్థానమాక్రమించినను అది యీ కరుణాప్రభావమే. అది సచ్చిదానంద పరబ్రహ్మమను ధనపేటికకు బీగము!

ఈశ్వరుని కరుణ అందఱపై నొక్కసారిగ ప్రసరించి అందఱను సన్మార్గవర్తులుగ నేల చేయదు?- అనిన- దాని యిష్టము ననుసరించి అది ప్రసరించును. కాని మనయిష్ట

ప్రికారము కాదు. అది తలవని తలంపుగ నాకస్మికముగ ప్రసరించును. అది యొక బహుమానము. ఉపాయములు వన్ని, కలహించి దానినీ బడయలేము. దానికి పాత్రులమగుటకు ప్రయత్నము చేయవలయును.

ఆ కరుణ గర్వితులకు లభింపదు. దీనులకు విధేయులకు మాత్రము ప్రాప్తించును. మానవుని సహస్ర శక్తులుడిగి, అతని ప్రయత్నములు విఫలములై, వేఱుగతి లేదు- అను భావము వానికిస్ఫురించునపుడే ఆ కరుణ తోచును. ఆసించి, అపేక్షించి, ప్రార్థించినపుడే అది పొడమును. ఇచ్చి పుచ్చుకొను వారికి సంబంధమును గూర్చి ఆకర్షించుటకు ఆధారభూతములు విశ్వాసము- ప్రేమ- సర్వనియంతయైన పరమాత్మ కలఁడు- అను విశ్వాసము. అంతకంటె ప్రేమపాత్రము లేదు- అని, ఆవస్తువునందు ప్రేమ గాఢముగ సాధకుని హృదయమున పాదుకొనవలయును. ఆవస్తువు నెఱుగుటయే యీమానవజన్మ లక్ష్యము- అని సాధకుఁడు స్పష్టముగ గ్రహింపవలయును.

మన భావము మార్చుకొని- ప్రాకృత విషయములను ప్రేమించుట మాని- ఆ పరమాత్మను ప్రేమతోఁ జూడవలయును. ఆ పరతత్త్వమునకు భక్తులము కావలయును. సర్వజ్ఞత- సర్వనియంతృత- సర్వసమర్థత లావస్తువునకు గలవను గాఢ విశ్వాసము వహింపవలయును. ఆవస్తువును మనము భావించి, అనుభవించి, మనవిధులు నిర్వర్తించునట్లు చేసికొనవలయును. "నీ యిష్టము ప్రకారము జరుపుము"- అని, అట్లు జరుపుట కంగీకరింపవలయును. వాస్తవముగ మంచు ఆకసమునుండి

నేలపై నంతటఁ బడునట్లు ఈశ్వరుఁడు తన కరుణను వర్షించుచునే యున్నాఁడు. కాని, మానవులు దానిని స్వీకరింపఁ జాలకున్నారు.

ఆపరమాత్మ వసించు ఆమహోత్కృష్ట రాజసౌధమును ప్రవేశించుట కద్దాసి ద్వారము గడియఁ తొలగింపఁ జాలినది మన విధేయత- అడఁకువ. గర్వపూరిత అహంతను- స్వార్థపరతను మోహబుద్ధిని త్యజించినగాని ఆ మందిరమును ప్రవేశించు అర్హతను గడింపఁజాలము. ఆ కరుణాసారము మనపై వర్షించుటకు మనము- సర్వసమర్పణము గావింపవలయును. ఆ కరుణా ప్రసార మభివృద్ధియగుకొలఁది మనస్వార్థచింతనము సహజముగ నన్నగిల్లుచుండును.

కరుణా ప్రసారము సర్వేశ్వరుని కార్యము. జీవి దానికై నిరీక్షించి ప్రార్థించవలయును. సంకుచిత బుద్ధిని విడిచి పరాత్మవైపునకు దృష్టిని మరలించ వలయును. నిశ్చల నిర్వంచన బుద్ధితోఁగావించు ప్రార్థనమెన్నడును వ్యర్థముగాదు. అంతర్యామి యగు సర్వేశ్వరుఁడు- శ్రీ సాయినాథుఁడు తప్పక వినును. మన ప్రార్థనము తలంపులతోడనే గాక కార్యరూపమునఁ బ్రకటనము గావలయును. ఏదో యొకపట్టునగాక నిరంతరముగ నుండవలయును. ప్రేమతోఁగావించు ప్రార్థనము తప్పక సద్యోఫలిత మొసంగును. అది మనకిష్టమైన లేక అనిష్టమైన తాత్కాలిక ఫలములు గలిగించునదియైనను అట్టిఫలితములుమున్ముందు హితకర్మములైనవై- మేలు కలిగించునవియై- యుండును.

విషయలంపటులకు శ్రీ సాయీకరుణ లభింపదు:

శ్రీ సాయీప్రభుప్రకరణ అమూల్యము. వెలుపటి వస్త్రువులతో నది కలియదు. ప్రాపంచక సుఖములతో దానికి సంబంధము లేదు. ఆ ప్రభు ప్రకరణ మనయందు ప్రసరించుటకు ప్రతిరోధములను దొలగించవలయును.

"ఆసలీనులు లోభము నన్యనింద
కపటమునసత్యమును కాముకప్రవృత్తి
ఆగ్రహంబను నెనిమిది యవగుణముల
నవలఁ ద్రోయనా సాయీ పదాంకితుండు"

ఈజీవి వీనినెంతెంత అవలకుఁ ద్రోయునో అంతంత అధికముగ సాయీకరుణకు పాత్రుఁడగును. అంతంత స్వేచ్ఛ మనశ్శాంతి సంతృప్తి సంతుష్టు లాతఁడు పొందుచుండును. ఇతరులతో సంభాషణ ముడిగి, యేకాంతస్థలముఁ జేరి, ఆత్మనిష్ఠుఁడై భగవానుఁడగు సాయీనాథునిఁ బ్రార్థించవలయును. మనస్సు నిశ్చలమై, బుద్ధి నిర్మలమగుటకుఁ బ్రార్థన మవసరము. ఈ సమస్త విశ్వమును అస్థిరమైనదిగ భావించవలయును. ఇతరముల కంటె భగవానునధికముగ ప్రేమింపవలయును. భగవంతునందు ప్రాపంచక విషయములందు నేక కాలమున మనస్సు నిలుపుట దుర్లభము. మనకు బాహ్యప్రపంచ సంబంధ మెంతెంత సడలునో అంతంత ఆధ్యాత్మిక పరాప్రేమ వృద్ధినొందును. స్వలాభకాంక్షయే యీ బంధములకు మూలకారణము. కావున దానిమూలమును ఛేదింపవలయును. ఈస్వార్థపరతనుజయించిన తక్కిన వానినిఁ దేలికగ జయింప నగును.

"దైవీ హ్యేషా గుణమయీ- మమ మాయా దురత్యయా
మామేవ యే ప్రపద్యంతే- మాయా మేతాం తరంతి తే."

దేవసంబంధియును మఱి త్రిగుణ మయమును
నైన నామాయ దాటఁగా నలవి కాదు;
ఎవరు ననుమాత్రము సమాశ్రయింపఁ గలరొ
వార లీ మాయను దరింతురు; పాండుతనయ!

(భగవద్గీతామృతము- ౭-౧౪)

"ఈ ప్రపంచ మంతయు మాయామోహితమైనది. మాయాధీనములై ప్రాణులు చరించుచుండును. దీనిని అతిక్రమించుటకు ఉపాయాంతరము లేదు. ఎవరు నన్ను సమాశ్రయింతురో వార లీ మాయను తరింపఁ గలరు."- అని శ్రీకృష్ణ భగవానుఁడు బోధించినాఁడు. భగవంతు నాశ్రయించిన జీవిని ఆపరమాత్మ తన కరుణను ప్రసరించి, మాయావాగురల నుండి విడిపించును. మన భక్తిప్రపత్తు లెంతెంత వృద్ధియగుచుండునో మాయాబంధము లంతంత సడలును. మనము శాంతముగ పరిశీలింతుమేని ప్రతిక్షణము మన మనస్సులలో మంచి చెడు తలంపులకు సంఘర్షణ జరుగుచునే యుండును, చెడును నిరోధించుటకు ఈశ్వరుని కరుణ అవసరము. ఆ కరుణాలేశము గలవాఁడు క్రమముగ చెడును విడచి మంచిని చేపట్టును. ఈ మాయా ప్రభావమును శ్రీ సాయినాథుని కరుణాప్రభావమును ఎవరికివారు పరిశీలనము చేసికొనుట లెంతయు నవసరము.

మాయా- కరుణలు- అను నీరెండు నొకదానికొకటి విముఖములు. మాయామార్గమునకు వ్యతిరేకము కరుణామార్గము. అంతర్దృష్టి- ఆధ్యాత్మచింతనము- అంతర్జ్యోతి-

గలవానికిఁ గాని వీని జాడలు వేద్యములుకావు. మనుష్యులెల్లరు మంచినే యుద్దేశించుచుందురు. వారు పలుకు మాటలందును, చేయు పనులయందును మంచి యున్నట్లే తలంతురు. అట్టి 'మంచి' అను భావనలో పలువురు వంచితు లగుచున్నారు.

మాయ - కరుణ :-

మాయ- మిక్కిలి టక్కరి. పలువుర నాకర్షించును. తన యురులలోఁ జిక్కించుకొనును. వంచించును, తుదకు స్వార్థమునకై వారిని వినియోగించుకొనును. కరుణ- నిరాడంబరమగునడక గలది. దుష్ట వేషభాషలు దానిదగ్గర లేవు. ఎవరిని వంచింపదు. ఈశ్వరార్థ మెల్లపనులఁ గావించును. ఈశ్వరుని యందే యది తుదిలీనమొందును.

మాయ- నిరోధింపనీయదు. సాధ్యముకాదు. దాని నతిక్రమింపనీయదు. ఒకరికి లొంగదు. తనకు దాన అడంగు స్వభావము కలదికాదు. కరుణ- గ్రహింపఁ గలదు. విధేయత ప్రకటించును. ఇంద్రియముల నిరోధించును. లోఁబడును. తన స్వేచ్ఛా ప్రవర్తనము ప్రకటింపదు. కోరువారికి సాధ్యమగును. ఎవరిపైనను తన స్వాధికారము ప్రయోగింపఁ దలఁపదు. దైవమున కధీనమై, దైవము నాశ్రయించి, దైవము నాజ్ఞమేరకు ఎల్లప్రాణులకు లొంగియుండును.

మాయ- స్వార్థాభిలాష గలది. ఇతరులనుండి యేయే లాభములు పొందఁగలమా? అని అవకాశమునకై వేచియుండును. కరుణ- స్వార్థచింతన లేనిది. 'పలువుర కెట్లు లాభము కలిగింతుదునా?'- అను తలంపు గలది.

మాయ- ప్రశంసలను గౌరవములను సంతోషముతో స్వీకరించును. కరుణ- ఎల్ల కీర్తి గౌరవములను దైవవరములుగఁ దలంచును.

మాయ- అవమాన లాఘవములకు జంకును. కరుణ- దైవము నిమిత్తమై అవమతిని సహించును.

మాయ- అసలత- దేహ విశ్రాంతులను గోరును. కరుణ- సోమరితనమును సహింపదు. సంతోషపూర్వకముగ కష్టించును.

మాయ- అద్భుత సుందర వస్తువులను గూర్చికొనఁ జూచును. గాని సామాన్యముల- మొరసువస్తువుల కాసపడదు. కరుణ- సామాన్యములు అల్పములగు వస్తువులచే సంతోషించును. ముతుకవానిని నిరాకరింపదు. చినుఁగు పాతలఁ ధరించుట కేవగింపదు.

మాయ- అశ్వర పదార్థముల నాదరించును. ప్రాపంచక లాభముల కుప్పొంగును. నష్టములకై శోకించును. స్వల్ప నిరసన వాక్కులకు ఉద్రేకము ప్రకటించును. కరుణ- శాశ్వతమును కాంక్షించును. దేశకాల పరిమిత వస్తువులకై పాకులాడదు. అవి నశించినఁ జలింపదు. కటువుల కాగ్రహింపదు. తన సర్వస్వము ఆనందమయమును- నాశరహితము నగు శ్రీ సాయీ పదములందు పదిలపఱచుకొనును.

మాయ- మిక్కిలి లోభి. కపటి. తీసికొనఁ జూచునే కాని యీయఁడు. సకలమును తనకై వినియోగించుకొనఁ జూచును. కరుణ- ఔదార్యము కలది. నిష్కల్మష హృదయ. స్వల్ప సంతోషి. స్వార్థప్రయోజనము లేనిది. గ్రహించుటకంటె నిచ్చుటకే ముందంజ వేయును.

మాయ- జీవములను పొత్తుకొనును. స్వకీయముల వైపునకే మొగ్గును. గర్వప్రవృత్తి గలది. కాలు నిలకడలేనిది. కరుణ- సద్గుణ సంపద వైపునకు భగవంతుని దరికి జీవి నాకర్షించును. ఇతర జీవులకై ప్రాకులాడదు. ప్రపంచ మంతట నావరించును. మాంసవసాది వికారముల కాసింపదు. సంచారశీల గాదు. పలువురలోఁ జొరఁబడుటకు సిగ్గునొందును.

మాయ- బాహ్యసుఖముల నాసక్తితో గ్రహించి యింద్రియ సంతృప్తిఁ గూర్చుకొనును. కరుణ- భగవానునందే రమించును. ప్రపంచాతీత సామ్రాజ్యమునం దానందించును.

మాయ- స్వార్థ లాభములకై పనులు గావించును. ఉచితముగ దేనినిఁ జేయదు. తాను గావించు పనులకు సమానముగా లేక అంతకధికమైన ప్రతిఫల గౌరవాదులను గాంక్షించును. తన కృతులను, బహూకృతులను బలువురు కొండాడవలయునని కోరుచుండును. కరుణ- అశ్వరముల కోరదు. ప్రతిఫల కాంక్షఁ గనదు. అది కోరు ప్రతిఫలము భగవానుఁడే. శ్రీ సాయిప్రభువుయొక్క సచ్చిదానంద ధామముఁ బడయుటకు జీవితమున నెంత అవసరమో అంతమాత్రమే మది స్వీకరించును.

మాయ- జనకూటములు- బంధుమిత్ర వర్గములలో నానందింపఁ జూచును. తన వస్తు వాహన సంపదలను, వంశౌన్నత్యమును గాంచి విఱ్ఱవీఁగుచుండును. ఉన్నతాధికారము లందున్న వారిని, ధనికులను, తన కుద్దిష్టమైనవారిని వేనోళ్ళఁ బొగడుచుండును. కరుణ- తన శతృవులనుగూడ ప్రేమించును. మిత్రులున్న సుబ్బడు. గొప్ప గుణవిశేషణము లున్నఁడప్ప తన బంధుమిత్రాదులనైన పాటింపదు. ధనికులకంటె పేదలనే ఆదరించును. అధికారులకంటె నమాయకులనే ప్రేమించును. మోసగాండ్రను జేరదు. సత్యమార్గానువర్తుల గౌరవించును. సాధువర్తనుల నితోఽధిక సుగుణ సంపత్తి సేకరింపుమని ప్రోత్సహించును.

మాయ- తన నష్ట కష్ట దారిద్ర్యములను వెళ్ళఁబోసికొని విలపించును. కరుణ- దారిద్ర్యాదులను ధైర్యముతో గూడిన ఓర్పుగలిగి సహించును.

మాయ- సకలమును తనకై వశముఁ జేసికొనఁజూచును. స్వప్రయోజనార్థము శ్రమించును. కలహించును. కరుణ- సకల వస్తువులను జనక స్థానమైన దైవమునకే విడచును. ఏ మంచిపనియేని తనదిగ భావింపదు. స్వాతిశయము ప్రకటించుకొనదు. కలహించదు. తనమాటే చెల్లవలయునని పట్టుపట్టదు. ఎఱుక గలిగి యెదుటివాని వివేకమునకు దైవ పరీక్షలకుఁ దల యొగ్గును.

మాయ- గోప్యము లెఱుంగ వేగిర పడుచుండును. క్రొత్త క్రొత్త వారలకై నిరీక్షించును. ఎల్లెడలసంచరించి, వివిధ విషయానుభవములచే ఇంద్రియములకు సంతృప్తిఁ గూర్చ

కొనును. తన్నెల్ల రెఱిఁగి, తన చెయ్యెల్ల రగ్గించి, ఆశ్చర్యము ప్రకటింపవలయునని కోరుచుండును. కరుణ- లోకవార్తల కాసపడదు. ఎంతలకైన ఉత్సుకత వహింపదు. దానికి ప్రాప్త యనునది లేదు. ప్రాప్త వికారము లేయని, సకలము నస్థిరమని అది యెఱుఁగును. ఇంద్రియముల నిగ్రహించి, వ్యర్థ సంతోష ప్రాతిశయ ప్రకటనలను పరిత్యజించి, యేవేని మెచ్చఁదగిన గుణాతిశయములున్న నడఁకువతో వానిని గోప్యపఱచుకొమ్మని అది బోధించును ప్రతి విషయమును- ప్రతి అనుభవమును ఆధ్యాత్మిక బుద్ధితోఁ బరిశీలించి, దైవప్రభావమును గ్రహింపు మని అది యెఱుక పఱచును: తనకుఁ గలదానిని కొండాడు కొనఁ గోరదు. ఆ దైవము తన బిడ్డలయందుగల అపార ప్రేమచే బహూకరించినదిగఁ దలంచును.

ఈ కరుణ అప్రాకృత తేజము. దైవ మనుగ్రహించు ప్రత్యేక బహుమతి. "ఈతఁడు నావాఁడు"- అని దైవము నిర్దేశించు విశిష్ట చిహ్నము. లౌకిక విషయములనుండి మరలించి, ఆధ్యాత్మిక మార్గమున నడిపించి, సచ్చిదానంద పరంధామము నకు జీవినిఁ జేర్పింతునని దైవము కావించు వాగ్దానము. అభయ హస్తము.

కావున మాయ యెంతెంతదనుక నిర్జింపఁబడి యెంతెంత దూరము చేయఁబడుచుండునో శ్రీసాయీకరుణ మనుజానం దంతంత వృద్ధిపొందుచుండును. ఆజీవి నిత్యనూతనానుభవము లచే క్రమక్రమముగ చక్కఁగ మార్పునొంది శ్రీసాయీ సాయుజ్యపదము పొంద నర్హతఁ గాంచును.

"సతతానంద పయోనిధిక్ వెడలి శ్రీసాయీ సుధాభ్రింబు, భ
క్తతత ప్రేమ సుశీతలానిలము లాకర్షింప, నీహాంతఁ బో
ద్యత విజ్ఞాన పరామృతంబు స్వవచోధారాళి వర్షింప, వ్య
గ్రిత సేవింపవు చిత్త చాతకమ! నిద్రాణింబవో? బద్ధవో?

## శ్రీ సాయీబాబా- రూపము- నామము.

"మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః"

"నాసనాతనాంశమ యర్జునా! ప్రపంచ
మునను జీవరూపంబు ను బొంది"

(శ్రీమద్భగవద్గీతామృతము 15- 7)

ప్రతి జీవుడు ఈశ్వరాంశమే. ఆ అంశము సంపూర్ణతఁజెంది విశ్వవ్యాప్తము పొందిన అది దైవమే.

"యద్య ద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జిత మేవవా
తత్త దేవావగచ్ఛత్వం మమ తేజోంశ సంభవమ్."

"శోభితంబునగుచు సువిభూతిగల యది
బలముఁ గలిగి యున్న వస్తు సమితి
నర! యెఱుంగుమయ్య నాదు తేజోఽంశ సం
భవములనుచు నీదు స్వాంతమందు."

(భగవద్గీతామృతము 10- 41)

శిర్డిలో నవతరించిన 'సాయీబాబా' దేవుఁడగునా? అని యెవరేని ప్రశ్నించిన నిస్సందేహముగ భగవానుఁడే- అని చెప్పఁదగును. శ్రీసాయీనాథునకుసర్వజ్ఞత్వ- సర్వనియంతృత్వ- సర్వవ్యాపకత్వ సర్వసమర్థత్వములుకలవు. స్వార్థరాహిత్యము- సేవ- సకలభూతములందు ప్రేమ- దేశకాల పరిమితముగాని

భూత భవిష్యద్వర్తమానములఁ గూర్చిన జ్ఞానము- బాబాయందు గలదని తెలిసికొనఁజాలినవానికి శ్రీసాయీప్రభువు భగవానుఁడే. ఇవన్నియు శ్రీ సాయినాథునందుఁ గలవు గావున బాబా సర్వాత్మ- సర్వజనని- భగవానుఁడు. శ్రీ సాయి- సర్వాంతర్యామి యని యెఱిఁగినవారు ఆతనిని దైవముగ ధ్యానించి తరించిరి. "సత్యవర్తనము- భక్తి- విశ్వాసములు కలిగి ప్రార్థించు భక్తులకు వాంఛితార్థములు ప్రసాదించు సర్వసమర్థుఁడు భగవానుఁడు"- అన్న నుడి సర్వమత సమ్మతము. ఆ విధమున బాబాను ఆశ్రయించి పరీక్షించిన ఆ పరీక్షకు శ్రీ సాయినాథుఁడు నిలువఁ గలఁడు. వేనవేలు భక్తులు బాబాను పరీక్షించి తుదకు "దాసోఽహ" మనిరి.

అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం
పరం భావ మజానంతో మమ భూత మహేశ్వరమ్.

అఖిల భూత నియామక మైన నాదు
పరమ భావంబు నెఱుఁగని వారలగుచు
నరశరీరముఁ బొందిన నన్ను మూర్ఖ
జనము అవమానమును జేతు రనఘ చరిత!

(భగవద్గీతామృతము. 9- 11)

అని శ్రీకృష్ణపరమాత్మ వచించినాఁడు. శ్రీకృష్ణుని సిద్ధాంతమును గుర్తించిన వారెందరుండిరో- ఆవిధముగ బాబా సిద్ధాంతమును గుర్తించినవారు సరిది. పై తొడుగును చూచి మోసపోవుదురు.

శ్రీసాయీ రూపము.

శిర్డి గ్రామములో ద్వారకామాయి మసీదునందు ఏక దేశగతుఁడై ఆరడుగులమనుష్యుఁడుగ గోచరించుసాయీబాబా సర్వవ్యాపియు సర్వాంతరాత్మ యగు భగవానుఁ డెట్లగునని సందేహము సాధారణముగ మనకు గలుగవచ్చును.

"అర్కబింబ మొండొకటఁ బ్రత్యక్షముగను
వర్తులాకృతి వడసి విశ్వంబు వెలుగు
నొందఁ జేయుచునుండుఁ, దానొక్క మొగిని
నెల్లరకును నెల్లెడలఁ గాన్పింపకున్నె?
కాన; నేక దేశ గతుఁడైన, రూప స
మేతుఁడైనఁ గాని యినుని మాడ్కి
సర్వగతుఁడు- మఱియు సర్వాత్మ సచ్చిదా
నంద మయుఁడు సాయినాథుఁ డెందు."

బాబా శిర్డియందు తన బిడ్డలతో మాట్లాడుచున్నట్లు కనఁబడినను, బొంబాయిలో- పూనాలో- మఱి యితర ప్రదేశములఁ గల భక్తుల వేయి కన్నులఁ గనిపెట్టుచు రక్షించుచునే యున్నాఁడు. (చూడుడు పుట 33)

"ఈవు చూచునట్టి యీ శరీరం బొక్క
గృహమట్లందు నిక్క మెఱుఁగు మీవు;
ప్రేమనా గురుఁడు వేంకుశుఁ డెప్పుడో
యొత్తుకొనుచుఁ బోయె నింటనుండి."

అనినాడు. దేహముండియు బాబా బద్ధుఁడు గాఁడు. 1918 కి పూర్వము బాబా ఎక్కడనున్నాఁడో నేడు నక్కడే యున్నాఁడు. సర్వవ్యాపియై యున్నాఁడు.

శ్రీ సాయిప్రభువు మూర్తి పూజలు చేయువారు ఒక రహస్యము గమనింప వలయును. శ్రీరామ- శ్రీకృష్ణాది రూపములందువలెనే ఆపరతత్త్వమగు భగవానుఁడు శ్రీసాయీబాబా రూపమున అవతరించి తన సర్వాంతర్యామిత్వము ప్రకటించినాఁడు. వేలు లక్షల ఆశ్రితుల నుద్ధరించినాఁడు. ఉద్ధరించుచున్నాఁడు. సర్వేశ్వరుఁడగు భౌతిక తనువున ద్యోతకమైన కారణమున ఆరూపము- శ్రీసాయిబాబా రూపము- నఖ శిఖపర్యంతము- పవిత్రము- పూజనీయము- ధ్యేయమై యున్నది. బాబా సగుణరూపమును పూజించి ధ్యానించుట కెట్టి సంశయము పొంద పనిలేదు. ఆ రూపము పరతత్త్వముయొక్క ఆలయము- దేవాలయము. బాబాను గంధాక్షత పుష్పాదులతో భక్తులు ద్వారకామాయి యందు పూజించిన సందర్భము లనేకములు గలవు.

"ధ్యాననిష్ఠను విష్ణు దర్శింప నేమి!- ఈనాడు రూప మీక్షించిన నేమి!" (పుట 30) (శ్రీ సాయిప్రభు చరమసూక్తులు. పుటలు. 11- 12) "నా శల్య శల్యంబునందు ప్రత్యణువు సల్పుఁ జాలు సంభాషణంబు" అనినాఁడు బాబా. ఆ భౌతిక తనువు- అది మెట్టిన ప్రదేశము- తాకిన వస్తువు- పావనము. ఆ రూప చిహ్నము సైతము పవిత్రము- ధ్యేయము- ఆశ్రితరక్షణ సమర్థమని మనము గ్రహింపఁదగును. విశ్వవ్యాపి యగు భగవానుని సాయిప్రభు రూపమునఁ జూడనేర్చినవాఁడు పేదల దీనుల గనిన నీసడించి కసరి నిరసింపఁబోఁడు. ఏ బిచ్చగానిఁ జూచినను బాబా మేఁ పరీక్షకై వచ్చినాఁడని తనకుఁగల భంగి పెట్టి పంపఁజూచును. ఇందుఁ దెలుపఁబడిన బాబాలీలలు

గమనించితిమేని, చీమలు- దోమలు- పిల్లులు- కుక్కలు- మొదలగు జీవములందు సైతము బాబా అధివసించినాఁడను ఎఱుక పొడమితీరును.

"యోమాంపశ్యతి సర్వత్ర సర్వంచమయిపశ్యతి
తస్యాహం నప్రణశ్యామి సచమే నప్రణశ్యతి"

ఎవఁడు సకలంబునందు నీక్షించునన్ను
నెవఁడు నాయందు సకల మీక్షించుచుండు,
జగతి వానికి నేఁ బరోక్షంబునొంద
వాఁడు నాకుఁ బరోక్షంబుగాఁడు పార్థ!

'వాసుదేవస్సర్వమితి' ఎఱుకను బాబా తనవారికిఁగూర్చువాఁడు.

శ్రీ సాయీ నామము.

(శ్రీ సాయీ మననము పీఠిక గమనింపుడు)

శ్రీ రామ కృష్ణాది నామములవలె 'శ్రీ సాయీ' నామము ప్రసిద్ధమైనది. శ్రీ సాయీ రూపమున కెట్టి ప్రత్యేకత- అద్భుత మహిమ కలదో- శ్రీసాయీ నామమున కట్టి ప్రత్యేకత- అద్భుత మహిమ కలదు. నామి కంటె నామము బలీయము. నామముచే నామి ఆకర్షింపఁ బడును. 'శ్రీసాయీ' శబ్దమున ఆ బీజాక్షరసంపుటీ కరణమాహాత్మ్య మద్భుతము- అనూహ్యము. ఎవరికి వారు స్వానుభవమునఁ దెలిసికొని ఆనందింపఁ దగును.

సాయీప్రభువు- అంకిత సంతతి.

శ్రీ సాయీనాథుఁ డందఱియందు సమానమగు ప్రేమ గలవాఁడు. శ్రీకృష్ణ పరమాత్మయు నావిధముగఁ జెప్పెను.

" సమోహం సర్వభూతేషు న మే ద్వేష్యోస్తి న ప్రియః
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ "

సర్వభూతములందు నే సముఁడ, లేఁడు
ప్రియుఁడు గానియు నాకు నప్రియుఁడు గాని;
ఎవరు భక్తితో నను భజియింతురందు్ర
వారు నాయందు నేనుందు వారియందు.

(భగవద్గీతామృతము. ౯-౨౯)

కాని, ఋణానుబంధమున, పూర్వజన్మములందు సంబంధముగల జీవుల నుద్ధరించు భారము బాబా వహించును. బాబాపలుకులు గమనింపుడు.

" భక్తపరాధీనుఁడ … … నితర యోచన లేలా? " (పుట 17)

ఉద్యోగములు- ఆరోగ్యము- ఋణబాధలు- ఇతర కష్టములు కారణములు గా బాబాను జనులాశ్రయించుచున్నట్లు తలంచినను అదియు ఆప్రభువు సంఘటనమే. (చూడుడు పుట 28) ఆయా కారణములను పురస్కరించుకొని, హితకామితముల సమకూర్చి తనయందు విశ్వాసము పాదుకొల్పి, క్రమముగ నాధ్యాత్మిక ముగ నున్నతస్థితికి బాబా తన ఆశ్రితులను గొనిపోవును.

" శ్రీశతమున నేని యాపదలఁ గందఱు- కుందఱు మత్పదాశ్రితుల్ "- అని శ్రీ సాయీనాథుఁడు శపథము చేసినాఁడు. తన అంకిత సంతతియొక్క- సకల భారములు బాబా వహించును.

ఒక సందర్భమున కాకా దీక్షిత్ విచారముతో నుండగా "అరే! కాకా! తు లా కాళ్జీ కాస్లీ? మాఝే సారా కాళ్జీ ఆహే" "ఓయీ! దీక్షిత్! నీవేల వెతలఁగుందెదవు? నీ సకలభారములు నావే!" అని బాబా ధైర్యము కలిగించినాఁడు. తనను జ్ఞప్తి యందుంచుకొని మనస్సు తనయందు నిలిపి ధ్యానించుటకు తగిన అవకాశములను- సంఘటనలను తన అంకిత సంతతికి బాబా కల్పించును. శ్రీ సాయీప్రభువు తన కరుణా రసార్ద్ర కటాక్ష వీక్షణములను- వరదాభయ దానప్రశస్త హస్తమును తనవానికి ప్రతి విషయమున నెఱుకపఱచుచునే యుండును. ఇది యంతయు ఆతండి లీల! తనవారెప్పుడుఁ దన్నే మఱక అనుసరింపఁజేయు సమర్థ సద్గురుఁడు శ్రీ సాయీనాథుఁడు.

"ఎవఁడు సకల భారములు నాపైవదలి నన్ను సేవించునో వానిని సర్వ విధములఁ గాచియుందును." (అభయప్రదానములు- పుటలు. 16- 25) ప్రపత్తి- సంపూర్ణ శరణాగతిఁ జేసినవాఁడు 'అంకిత జీవి'. ఆ జీవిభార మాతండిదే. 'యోగక్షేమం వహామ్యహమ్'- అని బాబా శపథము చేసినాఁడు. అనాయాచిత ముగ నీయవచ్చినది అంగీకరింపరు. అదియే మానవులందుఁగల మాధ్యము. మనము అర్థించునపుడు. దానినిపొందినట్లె మనము భావింపఁదగును. విశ్వాసము- ప్రధానము. అదిలేనియెడల నేదియును సిద్ధింపదు. మానవునకుఁ దగిన అవసరము- సమయము వచ్చిన విశ్వాస మేర్పడును. ప్రత్యక్ష ప్రమాణ ములు మనమిన్ని చూచుచున్నను విశ్వాసము లేకపోవుట ఆశ్చర్యమే. శ్రీ సాయీప్రభువునందు విశ్వాసము పాదుకొను టకు ఇందలి ప్రథమ- ద్వితీయ లహరులు పారాయణము చేయదగునని మనవి.

సత్యసుఖము :-

"అనిత్య మసుఖం లోక మిమాం ప్రాప్య భజస్వ మామ్"

'అనిత్యము- అసుఖము నగు నీ లోకమును పొందిన నీవు నన్ను భజింపుము'- అని భగవానుఁడు తెలిపినాఁడు. దుఃఖమేది? సుఖమేది యని విచారించిన 'ఆశాహి పరమం దుఃఖం నైరాశ్యం పరమం సుఖం"-కామసుఖాపేక్ష దుఃఖము-అది లేకపోవుటయే సుఖము- అని తెలుపఁబడినది. ప్రాణమయము మనోమయము విజ్ఞానమయము లగు ఆనందముల కతీతమైనది 'ఆత్మానందము' అదియే సత్యమగు ఆనందము- లేక సుఖము. (తైత్తిరీయ II.8) నానాసాహెబు చందోర్కరు సంసారమును గూర్చి ప్రశ్నించి నపుడు బాబా పలికిన సమాధానము- సత్యసుఖమును- గమనింపుడు. (పుటలు 49- 54)

"భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్."

ఏ నెవండనో మఱి యెంతటివాఁడనో
యరయు భక్తిచే యథార్థ రీతి
అటుల వాఁడు నన్ యథార్థంబుగాఁ గని
పిదప నన్నె పొందు విమల చరిత!

(భగవద్గీతామృతము 18. 55)

బాబాను సర్వాంతర్యామిగ నిరంతరము ధ్యానించు భక్తుఁడు తాను సర్వాంతర్యామి యగును. బాబాబోధలలోని సారమిది. జీవి తననుండి యితరమును వేఱుచేయుట దుఃఖము. వేఱు చేయఁబడినది యెంతెంత తనలో చేర్చుకొనబడుచుండునో

అంతంత సుఖమాతఁడు పడయుచుండును. దీనిని పడయుటకు కృతజ్ఞత- ప్రేమ మొదలగునవి మూల్యములు. ఒకరిపై ప్రేమ ఇతరునిపై ద్వేషము కారాదు. ఆ ప్రేమ అందఱియందుండ వలయును. ఆ ప్రేమకు తన శరీరమే కేంద్రముగాక అంతట కేంద్రీకరించిన ఆ ప్రేమవృత్త పరిధి కెందును అంతముండదు.

బాబా- మాయాసిద్ధాంతము:- (పుటలు. 71- 73)

భగవద్గీతాది గ్రంథములు- భాష్యములు అధ్యయనము చేసి శాస్త్రీయమగు అనుభూతి గడించిన చందోర్కరుతో బాబా- మాయను గూర్చి పలికినను, ఇతరుల యెదుట నెప్పుడును మాయనుగూర్చి తెలుపలేదు. మాయ ఆవరణ విక్షేపశక్తులు గలది. ఈ విశ్వము మాయా లీల- చైతన్య మెఱుకపడిన మాయ అంతరించును అని బాబా ప్రవచించినాఁడు.

తాత్త్వికముగ ఈ విశ్వమంతయు కల్పితము- కావున పాటింప నవసరము లేదు- అని బాబా బోధింపలేదు. "ఈభౌతిక ప్రపంచమున నున్నంతవరకు విధి నియమములను మనము పాటింపవలయును"- అనియే తన బిడ్డలకు బోధించినాఁడు. బాబా భౌతికవాది అని చెప్పవలెను. సత్య మాధారముగ ప్రవర్తింపుఁడని తనవారికి బోధించినాఁడు. 'సత్యము'- భౌతిక అర్థముననే కాని, దేశకాలపరిమితముకాని అద్వైత వేదాంతార్థమున కాదు. సంసారమున ప్రవర్తింపఁ దగిన విధము 'చందోర్కరు' నకు బాబా తెలిపెను. ( పుటలు. 53 - 54 ) శ్రీ సాయీనాథుఁడును ఆ విధముగనే ప్రవర్తించెను.

ఈ దృశ్యమంతయు కల్పితము- మాయ యని యందు లేని, ఇతరులలో నీ 'మాయ' ను గూర్చి పలుకుటే అసంభవము. సంబంధమే కల్పితము- పలుకులు కల్పితము- సమస్త పలచి తనదారికిఁ గొనిరా బోధింపఁబడు ఎదుటి వ్యక్తియు కల్పితము- కావున బాబా ఈ వేదాంత వాదముల కెవ్వడునెట్టి తావీయలేదు ఇట్టి వెవ్వరికో డను చర్చించి యెఱుఁగఁడు. అది ప్రపంచమున ఆచరణకు సాధ్యముకాదు. ద్వైతభావము నుండి అద్వైతము పాటించుట అసంగతము. మాయ దైవము యొక్క శక్తియని, దైవ మీవిధముగ వ్యక్త మయ్యెనని మాత్రము తెలుపఁబడెను. 'సంభవా మ్యాత్మమాయయా'- "ఆత్మ మాయచేత నవతరింతు" (భగవద్గీతామృతము. ४- ६)

బాబా- కర్మసిద్ధాంతము :-

కారణము వలన కార్యము గలుగును. ఏ ఉద్దేశ్యమున మన మొక పనిఁ గావింతుమో దానిఫలము గలిగి తీరును. అది క్రమముగ వృద్ధిఁజెందును. వస్తువుల సేకరింపఁ దలచిన- సేకరించుచున్న ఆ కోరిక లంతకంతకు వృద్ధియగును. క్రొత్త క్రొత్తలకై పరుగులెత్తును. సంపాదింపఁ దలఁచును. అంతరాయము కలిగించు వారిపై ఆగ్రహము వహించును. ఇట్లు కామము- క్రోధమునకు-నది సమ్మోహస్మృతిభ్రంశబుద్ధినాశ వినాశములకు దారి తీయును.

మంచిబుద్ధికలిగి చేయబడుపనులు మంచిఫలము. చెడు బుద్ధితోఁ జేయబడుపనులు చెడుఫలములఁ గలిగించును. సద్గురు సమాశ్రియము చెడుగుణముల నిర్మూలించి సాధకునకు సాధు మార్గ ప్రవర్తనము సమకూర్చును. విడవ నద సద్వాసనలు రెంటిని పరిత్యజించి సాధకుఁడు గురుదేవునందు తుదకైక్యము నొందును.

"అవస్యమనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభమ్" అని శాస్త్రములందుఁ జెప్పఁబడినను సమర్థసద్గురువు సమాశ్రయము పదిజన్మముల ననుభవింపఁదగిన పాపము పదిదినముల అనుభవముతో నివారణమగును. (చూడుఁడు, శరణాగతుల కర్మవిమోచనము. i. డాక్టరు C. పిళ్ళె, ii. భీమాజిపటేల్. పుటలు. 121 to 124.) ఆకారణముననే

> "ఈ మసీదునందలి మెట్లు నెక్కువారి
> యఖిల కర్మదోషంబులు నడఁగి మోద
> మంకురించు" — అని ఘంటాపథముగఁ జాటినాఁడు. (పుట 15)

సత్ప్రవర్తనము:-

బాబా తన్నుఁజేరినవారిని మంచినడవడి కలిగియుండుఁడని బోధించెడివాఁడు. అన్నిసంపదలకంటె విలువయైనది సత్ప్రవర్తనము. మనజీవితమే బోధనాలయము. గురుదేవుఁడు ఉపాధ్యాయుఁడు. మనకుఁగలుగు సంఘటనలు- మేలు కీళ్ళు- మన ప్రవర్తనమును జక్కదిద్దుటకు ఆప్రభువు ఉపయోగించు ఉపకరములు. సుఖ దుఃఖానుభూతులవలన మనయందు లీనమైయున్న

ప్రవర్తనాశోభలు వెలువడుచుండును. జీవితసాఫల్యత ఇహ పరలోక సుఖప్రాప్తి నడవడిపై ఆధారపడియుండును. మనశ్శాంతిఁ గూర్చునది అదియే. పరిశుద్ధమగు నడవడిలేనివాఁడు ఐహికమున నెంత యున్నతస్థితిలో నున్నను ఇహ పరములందతనికి స్థానము లేదు.

మంచిప్రవర్తనకు అంతర్జ్ఞానమొకటి కలిగినఁ జాలును. అదియున్న తక్కినవిద్యలన్ని యున్నట్లే. భగవానుఁ డొక్కఁడే పూజనీయుఁడు. ఆస్వామికి విధేయులమై యుండవలయును. ఆశ్రియమేపూజ. సర్వ నియంతయగు ఆప్రభువు- యజమాని- దైవము. కోరుట జీవియొక్క స్వభావము. దైవము ఈ జీవికి యోగ్యము హితములగు వానిని అనుగ్రహించును. ఇతఁడు తనకుగలదానిని తనదియని అనుకొనరాదు. దానికితఁడు ధర్మకర్తమాత్రమే. అదియు కొంతకాలము. దైవమెప్పుడుకావలయు ననుకొనిన అప్పుడు తీసికొనును. ఈజీవిని ఆ ధర్మకర్తృపదము నుండి దైవము తనయిష్టమువచ్చినపుడు తొలఁగించును.

మనుష్యుని నడవడికి ముఖ్య ప్రతిబంధకములు 'కాంతా కాంచనములు'. బాబా తనబిడ్డల నీ రెంటినుండి విముఖులఁ జేయుటకు రెండుపరీక్ష లేర్పాటుచేసెడివాఁడు. తాను చక్కదిద్దఁ దలచిన బిడ్డను రాధాబాయి (రామకృష్ణ ఆయి) దగ్గఱకు పంపెడివాఁడు. ఆతల్లి బాబాకు కూర్చు భక్తురాలు. ఆతల్లి పరీక్షకు భక్తుఁడు నెగ్గవలయును. రెండవపరీక్ష- తనను జేరిన వారిని (చక్కదిద్దదలచినవారిని) దక్షిణలుకోరి వారిదగ్గఱనున్న

ధనమంతయు లాగికొనెడివాఁడు. వారు బాబాకు ఇచ్చునపుడు ఆధనముపై ఎంత ఆశపెట్టుకొందురో పరీక్షించెడి వాఁడు. 'దదాతి ప్రతిగృహ్ణాతి' — ఇచ్చునది ఆతండిరియే. తీసికొనునది ఆ సామియే. (చూడుడు- ధనము- దక్షిణ. పుటలు 100-102) కాని అందఱ నడిగెడివాఁడుకాఁడు. తాను అనుగ్రహింపఁ దలఁచిన వానినే అడిగెడివాఁడు. అందొకప్రత్యేకత- విశిష్టత గలదు. ఆయాభక్తుల చరిత్రిలలో గమనింపుడు.

శ్రీ సాయీబాబాబోధల సారాంశములు:-

1 నాభక్తుఁడగువాఁడు నాకు ముందుగ రెండు కానుక లర్పించవలయును.

i నిష్ఠ (సాయియందు గాఢమగువిశ్వాసము).

ii సబూరి. (ధైర్యముతో గూడిన ఓర్పు)

2 సకలభూతములందు నన్నుచూడ నేర్వవలయును.

3 నిన్నుజేరు ప్రతిజీవియొక్క ఋణానుబంధము నీవు పాటించవలయును.

4 నేను మిమ్ముప్రేమించునటుల మీరొండొరులు ప్రేమించుకొనవలయును.

శ్రీ సాయీకరుణ- ప్రచురణము:-

సోదరీ సోదరభక్తుల సాయమున ప్రచురణమైన 'శ్రీ సాయీమననము' ను వారందఱ కందించుచు 'శ్రీ సాయీకరుణ' గ్రంథ ముద్రణమును గూర్చి ప్రస్తావించి యుంటిని.

‘శ్రీ సాయీమననము’ పోషకులలో నొకరగు శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావు పంతులుగారు (Secretary, Saraswata-Niketanam, Vetapalem. Bapatla Tq) ది 2-1[illegible]-58న వచ్చి మాట్లాడవలసినదిగా ఉత్తరము వ్రాసిరి. ఆతేదీన వెళ్ళి మాటాడితిని. "ఆర్థికముగ నేనెంత సాయము చేయుటకంటె ‘శ్రీ సాయీకరుణ’ గ్రంథమును ఈ సారస్వతనికేతన ప్రెస్‌లో ముద్రించుకొనిన, మీకు ప్రత్యేకముగ ‘రేటు’ ఏర్పాటుచేయఁ దలచితి నని చెప్పిరి." "శ్రీసాయీమననము బాకీ ఇంకనుతీరలేదు- నాదగ్గఱ పైకములేదే- కాగితమునకైన పైకము కావలయును గదా!" అని అంటిని. "పైకము విషయము ‘బాబా’ కు విడచి పెట్టుము. పని ప్రారంభించుము. కాగితము ఏలాగో నేను తెప్పించుచున్నాను. సోదరభక్తులు సాయముచేసినపుడే పైకము ఈయవచ్చును" అని వారుపలికిరి. "ఇవియు శ్రీ సాయీప్రభువు పలుకులే- కాదనుటకు నేనెవఁడను?"- అనితలంచి యియ్యకొంటిని. కరుణామయుఁడగు ఆతండీప్రేమ ఆయాతావులఁగల సోదరీ సోదరభక్తులను ఏరి, కోరి, పిలిచి పోషకులుగా చేర్పించినాఁడు. అంతయు బాబా లీలకాని, నాశక్తిసామర్థ్యములు లేశమేనిలేవని మనవిచేయువాఁడను. ఒక్కొక సోదరభక్తునిద్వారా ఒక్కొక్క బోధ కల్పించుచు ఈసేవకుని . తండ్రి తనసేవ చేయించుకొనుచున్నాఁడు.

కృతులుపలికించునది శ్రీ సాయీనాథుఁడే. ప్రచురించుకొనునది- వివిధ భక్తస్వరూపుఁడగు శ్రీ సాయీప్రభువే. ఈ ప్రతిష్ఠ సోదరీ సోదరభక్తులది యగును. ఈకృతి వెలువడుటకుఁ

దోలుత మార్గమునిర్దేశించి సహజౌదార్యము ప్రకటించి, సర్వ విధముల ప్రోత్సాహము కల్పించిన శ్రీ అడుసుమల్లి శ్రీనివాస రావు పంతులు గారికి, ఇందు ప్రసరింపబడిన పోషకులగు సోదరీ సోదరభక్తులను, వారికుటుంబములను, శ్రీ సాయీనాథుండు ఎల్ల వేళల నెల్లవిధముల నేడుగడయై రక్షించుగాత యని ప్రార్థించు వాండను.

సహజ సోదరునికంటె నధిక ప్రేమౌదార్యములం బ్రకటించు మ శ్రీ సాయీమననమునకు, ఈకృతికిని, మాటపడారులు సాయము చేసిన చి॥ శ్రీ పొదిల విశ్వనాథశర్మ (S. ఇల్లిందలపర్రు) నాకు కుడిభుజమై భారమువహించు చున్నాండు. ఇది యేనాటి సంబంధమో యని ఆశ్చర్యపడుచుందును. సర్వనియంత యగు శ్రీ సాయీనాథునకే యెఱుక. సోదరభక్తులు- శ్రీయుతులు- కర్రి పెదమునిరెడ్డి (S. ఇల్లిందలపర్రు) కొప్పరపు రామారావు (కానూరు) ల ప్రేమాదరణములు పలుకులకందనివి. వీరికిం దక్కిన పోషకులగు సోదరీ సోదరభక్తులకు నా కృతజ్ఞత ఎట్లు తెలుపవల యునో నాకే బోధపడుట లేదు. ఆభారము శ్రీ సాయీనాథునకే విడచుచున్నాండను. ఈకృతికి 'తొలిపలుకు' పలికి, దీని నెఱుక పఱచిన శ్రీ D. భీమారావుగారికి (President, All India Sai Samaj- Mylapore- Madras.) నాకృతజ్ఞతాపూర్వక నమస్కృతు లర్పించుచు వారికి వారికుటుంబమునకు చిరాయు రారోగ్యభాగ్యములం బ్రసాదించి రక్షించుగాత యని శ్రీసాయీ ప్రభువును ప్రార్థించువాండను.

1 ద్వారకామాయి- బాబా- 2 పూజ్యశ్రీ బి. వి. నరసింహస్వామి- వారిత్రివర్ణచిత్రపటములను A.S.S Mylapore Madras- వారిచెలన సాయముచేయించిన కార్యదర్శి శ్రీ వి. కె పంతులుగారికి నేనెంతయు కృతజ్ఞుడను. శ్రీ సాయీనాథుడు వారి నెల్లవిధముల ననుగ్రహించుగాతయని ప్రార్థింతును.

కృతిఁబల్కించితి, వెల్వరించుటకు నీ వే కోర్కెమై నేరి, కూ
ర్చితి నీ సోదర సోదరీ మణుల, వీఁడన్ బిడ్డలన్ నీ పదాం
కితులన్ యోగము క్షేమముఁ బఱపి రక్షింపంగదే! యిందునం
దతులపేరిమ, పరేశ! సద్గురు సమర్థా! సాయినాథప్రభూ!!

శ్రీ సాయీకుటీరము
చిన్నగంజాము
4-2-1960

ఇట్లు విన్నవించు
భక్తజన విధేయుఁడు
బాపట్ల హనుమంతరావు.

సమర్థ సద్గురు శ్రీ సాయిబాబా




ఇచట నేనుండ నీఁక భయమేల? విడుము
నీ బరువుల నాపై నేన నిర్వహింతు;
నన్నుగను- వేయికన్నుల నిన్నుఁగందు;
శ్రితుని ని న్నెప్పుడే నుపేక్షింతునేమి?

ఓమ్

శ్రీ సాయీ సద్గురవేనమః

# శ్రీ సాయీనాథాష్టకము

సమస్తంబునౌ భూతజాలంబు మాయన్
భ్రమింపంగ జేయున్ గదే! నీ ప్రభావంబెఱుంగన్
విమోహాత్ముడన్, నాకు వేద్యంబె? తండ్రీ!
నమస్కారముల్ సాయినాథా! సమర్థా!

అనంతంబు నీ లీల లత్యద్భుతంబుల్
గనంజాల నీ విందుగా వింత చెయ్యుల్
నినుంజేర సద్బుద్ధినిన్ భక్తి నీవే!
ప్రణామంబులో సాయిబాబా! సమర్థా!

అమోఘంబు నీ ప్రాపనంతావతారా!
ప్రమోదంబు నీ రూపు భక్తానుసారా!
సమస్తంబు నీ చూపు సత్యప్రచారా!
నమస్కారముల్ సాయినాథా! సమర్థా!

సమాలింతు నీ దివ్యచారిత్ర ప్రీతిన్
ప్రమోదింతు నీ భద్ర పాదార్చలందున్
సుమాళింతు నీ ప్రేమసూక్తి స్తవాళిన్
నమస్కారముల్ సాయినాథా! సమర్థా!

తమః ప్రవృత్తుండనై వృథా కార్యశీలినై
భ్రమించుచున్ గనుల్, స్వస్థభావంబుఁగానన్
క్షమింపంగదే! సత్సుఖానంద మీవే!
నమస్కారముల్ సాయినాథా! సమర్థా!

ధనంబుల్ గృహాదుల్ వృథా కామితంబుల్
ననున్ నీచమార్గంబునన్ ద్రిప్పుచుండెన్
వినష్టాత్ముఁడన్ దేర్పవే! దీనబంధూ!
ప్రణామంబులో సాయిబాబా! సమర్థా!

తమిన్ నీదు నామామృతంబాన నీవే!
ప్రమాదంబులన్ బాపి భద్రంబు లీవే!
క్షమా శాంతి సద్భావ సంతుష్టు లీవే!
నమస్కారముల్ సాయినాథా! సమర్థా!

సృష్టిస్థిత్యుపసంహృతి క్రియల నీ వీ విశ్వరంగాన నీ
యిష్టంబౌనటు జీవిఁ ద్రిప్పెదవు; నీ యీలీల నాకేమి వి
స్పష్టంబౌ? శరణంటి, దీనుఁడను, నీవాఁడన్ గృపన్ బ్రోవవే!
సాష్టాంగప్రణిపాతముల్ గొను, సమర్థా! సాయినాథప్రభూ!!



శ్రీ వేంకటేశాయనమః

శ్రీ సాయీనాథాయనమః

# శ్రీ సాయీ కరుణ

ఉపక్రమణిక

## మేలుకొలుపు

"జాగరితఁ బొందు—బిడ్డ!", శ్రీ సాయి పలుకు;
"అదియొకను దూరమందు మాయాపిశాచి
పఱుగువాఱుచు నిను లోభపఱచుచుండె;
ఆశపడితివా! యగు సర్వనాశనంబు.

ద్వారకామాయి సౌధ కవాటమెపుడు
దిక్కులేనివారలు చేరఁ దెఱచియుండుః
వస్తుసంభారములు చూడ స్వల్పమైనఁ
బ్రేమపూర్వకముగ నివి పెట్టఁబడును.

గములుగట్టి కసాయి ప్రాంగణముఁజొచ్చు
నోరులేని యీ జీవుల తీరుఁగాంచి,
కరుణ వర్షించు నా పరాత్పరుని శక్తి
కతన, వీనికై మది జాలిఁ గాంచుచుంటి.

పథికుండా! నీదు చింత లావలకుఁద్రోయుము
యైహిక విచారములను మిథ్యలుగఁగనుము;
ఇందు నీకుఁగావలసిన దేలవంబొ!
కాలపరిమితియే నధికంబుగాదు.

అకట! యీభాగ్యకలిత సౌఖ్యంబు లెల్ల
స్వల్పములును బ్రతిక్షణ క్షయకరములు;
అల్పమగువానిఁ గొండాడునట్టి జడుఁడు
వానికంటెను మిక్కిలి స్వల్పుఁడగును.

కుదురుగా నిన్నెడఁదఁ జేర్చికొనఁగనిమ్ము,
కల విచారంబులెల్ల నావలకు విడుము;
ఒనర నెడఁబాటు మనకు లేకుండుఁగాత!
నాదు సర్వస్వమును, నేను, నాది, నీవ!"



# స్వప్న వృత్తాంతము

అమిత దుర్మోహ వారాశియందు మునిఁగి
దరిని దరియంగ నొండొక తెలివులేక
జీవితముపైన నాస వర్జించియున్న
తఱిని దరియయ్యె - దీనుల తాయి సాయి.

తారణాబ్దము పుష్య శుద్ధంబునందు
ద్వాదశీ తిథిగల భౌమ్యవాసరమున
నాలుగవజాము తుదిని స్వప్నంబునందు
నెదుటఁ బొడమెను 'శిర్డి సాయీపరిభుండు'.

సాఁగిలంబడి మ్రొక్కులు సలిపినంత,
"రార! యిటురమ్మి, యేమేమి వ్రాసినాఁడ"?
వనిన, గీతామృతంబాదియైన కృతుల
నామములను జెల్పుచునున్న నన్నుఁజూచి,

"వాని నట్లుండ నిమ్మింక పలుకు మీవు-
వీని - వీని" - నటంచు నేవియొ వచించె;
సమ్మతించితిఁ; గరుణించి సాయి సురిఁగెఁ,
దెలివి చేకుఱె; భల్లునఁ దెల్లవాఱె.

27-12-1944, 5 00. A. M.

ఉదయమందున, చీరాలనుండి వచ్చె
నాప్తుఁడైన శ్రీ ఆదినారాయణుండు *
వెంటఁగొనిపోయి మాఁపటివేళయందు
§ 'నారసింహు' ని సందర్శనంబుఁగూర్చె.

అఖిలభారత సాయి సంఘాధినేత
బి. వి. నరసింహ వరుఁడు పేర్వేరఁదెలిపెఁ
బలుకఁదగిన కబ్బంబుల; వానినెల్ల
నవదరించెద శక్త్యను సారముగను.

♦ ♦ ♦ ♦ ♦ ♦

చనియె నలుబదిరెండు వర్షములు వీని,
కంతదనుక నెయ్యెడ నుంటివయ్య! నీవు?
అప్పటికి నీకు జ్ఞాపకంబైతి నేమి?
ద్వారకామాయి సాయిబాబా! మహాత్మ!

ఏను నినుఁ జేర టనిన నాకేమి యెఱుక
మోహవారాశి యందున మునుఁగు కతన!
నీదుబిడ్డల సాఁకఁగ నీకె చెల్లు;
సత్యమిది; – ద్వారకామాయి సాయి దేవ!

* నా బాల్యమిత్రుఁడు – ఈ నాజీవితమున ఆధ్యాత్మిక మార్గదర్శి–
శ్రీ బందా ఆదినారాయణగారు, చీరాల.
§ శ్రీ బి. వి. నరసింహస్వామి, (President, All India
Sai Samaj, Madras.)

# వినతి

సమసె బంధుమిత్ర జాయా సుత క్షేత్ర
వివిధ భోగ గర్వ విస్తృతంబు;
శేషమొంచె సాయి! శిరిడి సంస్థాన
కవినటంచు నెగడు గర్వమొకటి!

గురు జనుల సేవచే నేర్చికొన్న చదువు
లేశమైన నీవానిలో లేదు - లేదు;
వీనియందేమి కాంచి యాస్థాన కవిఁగ
సలిపికొంటివో యెఱుఁగ; శ్రీ సాయిదేవ!

నీ కృతులు వల్కుతఱి నాదు వాకునందు
నిలిచి, నీవు పల్కించిన పలుకుఁ బలుకు
వాఁడ; నిందు నా ఘనత యే జాడలేదు;
సైపు దొసఁగులు పాసఁగిన సాయినాథ!



# జయ నమో వాకములు

ప్రేమ భృంగ "మోమ్ శ్రీ సాయి రామ" యనుచు
హృదయ కమలాంతరంబున మృదుల ఫణితి
సరస మాధురీ గాన నిస్వనముఁ బఱపె;
సచ్చిదానంద శాంతి తేజంబుఁ బర్వె;
ఆత్మ - చిఱునవ్వు వెలుఁగులందందు నెఱపె,
స్వాంత ముప్పొంగెఁ బరవశత్వంబు నొంది.
ఎలమి నీదు ప్రేమంపుఁ గౌగిలినిఁ దేలి,
ఈవు నా చెంత నుండుట నెఱిఁగికొంటి
స్వాభిలషితంబు నౌ ఆత్మ సారమగుట;
అవ్యయానంద శాంతి సత్యగతిఁ బ్రాపి
నడపు ప్రాణము తేజమై తొడరు కతన;
విషయ గ్రీష్మాతపమునఁ దపించి సోలు
హృదయ లత కమృతమ్ము వర్షించి, మగుడ
నాసఁ బెంపొంద నిడుదు వత్యంత కృపను;
జయ నమోవాకములు నీకు జయము! జయము!
నీ కరుణ నూఁతగాఁ బయనింప నిమ్ము
రామ శ్రీ సాయి! శ్రీ సాయిరామ! జయము! !

## నిర్వేదము - ప్రార్థన

సలలిత మృదు లోదార దృష్టులవి లేవు;
ఎఱుఁగఁగాలేము మా యున్కి నించుకేని,
చటుల సంకట భూత పిశాచ వితతి
వికటముగఁ గ్రమ్మికొని తాండవించుచుండె!
ఆదరణ మానవత్వ దయానునయము
లిరుగు పొరుగుఁ దలంపు లెందేనిఁ గనము;
పాపి యుష్ప్రాంగ సాధువు వనరుచుండె;
ఇన్నిటను నిల్చి ప్రార్థించుచున్నవాఁడ,
సాయి! యీవ నాకు మార్గదర్శకుఁడ వగుము!

## అపాంతరాత్మ

వీర లేయెడ మరణించువారు కారు
వా రెపు "డపాంతరాత్మ" యై పఱఁగుచుందురి,
వారి కరుణాప్రవాహముల్ పఱపుచుందురి,
సిద్ధ కరముల శ్రితుల స్పృశించుచుందురి.

దిక్కులేనివారల కెల్ల దిక్కనగుచు
నొసఁగుదురు దీనులకును జేయూఁత సతము;
తమ్ము సేవించు వారిఁ గష్టమ్ములందు
విడఁగనాడరు, రక్షించిడుచు నుందుఱు.

పేరునకుమాత్రి మనుజులు వారు, కాని
దైవమే యట్టివారు యథార్థమింత;
దర్శనముమాత్రి శ్రితులను దనుపుచుందుర్రి,
కనఁగ లీలా వినోద విగ్రహులు వారు.

## శ్రీ సాయిప్రభువునకు వినతి

శ్రీ పరాత్పర! సాయీ! కృపాపయోధి!
నా పలుకు సాహసంబును సైఁపఁగదవె!
స్వల్పమతి యెఱుంగునె నీ యపారకరుణ?
నిన్ను - నీ నామమును నమ్మి నెమ్మినుందు.

నరునివలెఁ దోఁతు వీవ, యీశ్వరుఁడ వీవ,
కర్త వీవ, క్రియయునీవ, కర్మవీవ,
పావనుఁడ వీవ, యుత్తమ వ్యక్తి వీవ,
సర్వజగముల ప్రభువీవ, సాయి దేవ!

జయము! శిరీ నివాస! శ్రీ సాయి! నీకు,
జయము! శ్రీ ద్వారకామాయి సాయి! నీకు,
జయము! సర్వ దేవాత్మక! సాయి! నీకు,
జయము! భక్త కల్పద్రుమ! సాయి! నీకు.



# శ్రీ సాయీ ప్రభువు

పాల సంద్రంబునఁ బాఁప సెజ్జను వచ్చి
నెదనిల్పి మోదించు మొదటివేల్పు
వెండికొండను జేరి పెనుగట్టు రా పట్టి
సా మేనఁగొను మేటి జంగమయ్యా,
పలుకుల జవరాలిఁ దలవాకిటను నిల్పి,
తొలిపల్కు తే పొద్దుఁ బలుకు నలువ,
ముగురు మూరుతులకు ముగురు సత్తులకును
దొలి సత్తియై పొల్చు దొడ్డ సత్తి,
ఎందునుండెది పుట్టువు నొందఁజాలెఁ,
దెలియ నెయ్యది జగముల నిలుచు పాదు,
పెంపఁ దుంపఁ బుట్టింపఁగ వెలుఁగునైన
'సాయిబాబా' ను వేల్పుల రాజుఁగొలుతు.

'శిర్డి' యేతపములఁ జేసెనో! నీపాద
జలజ మరంద వాసనలఁ గనియె,
'ద్వారకామాయి' యే వ్రతములు సలిపెనో!
నిలయమై నిన్నహర్నిశలు గొలిచె,
'నింబవృక్షం' బెట్టి నిష్ఠలఁ బఱపెనో!
ఛాయల నిడి జన్మ సఫలతఁగనె,
'ఆ పీఠ' మది యెప్పు డేపూజ నడపెనో!
యాసన స్థితిఁగాంచి వాసికెక్కె,

శిర్డి జనులెట్టి భక్తి భజించిరేమొ!
కనుచుఁ బలుకుచు వినుచు భిక్షలనొసంగి
పాద సంసేవన లొనర్చి భవ్యులైరి
సత్య కరుణాస్వభావ! శ్రీ సాయిదేవ!

"కలఁడు - లేఁడ" ను వాదములు సేయనేటికి?
కలఁడు శ్రీ సాయి త్రికాలములను
'మనుచునో - మనుపఁడో'-యను విచారములేల?
తనుఁజేరు చీమనేఁ మనుచు సతము.
లీలావళీ పరిశీలనంబు లవేల?
తనలీలఁ బఱపి నిత్యంబు నోము,
దేశ కాల క్రియాదిక విభేదములేల?
యెపు డెల్లవిధముల నేలుచుండు,

ఆస్తికత్వ విశ్వాస విద్యాప్రపత్తు
లున్న, నన్యసాధనములి నెన్ననేల?
కలియుగంబునఁ దరియింపఁగలుగుచొప్ప
ద్వారకామాయి సాయిబాబా కృపాప్తి!

పిలిచినాఁడవు ప్రేమ, వెరవేది నడయాడు
దీనుని నీ మహాస్థానమునకు,
దరిఁ జేర్చినాఁడవు తలమున్కలై యుజ్ఞా
బ్దినిఁగూలు వీవిపైఁ బెంపు నెఱపి,
బోధించినాఁడవు బుధజనస్తవనీయ
నీతిపాఠముల నిర్నిద్ర ఫణితిఁ;
బెంఁబాపినాఁడవు చెడుగుల కూటమిఁ
గడు పడిఁ బలు చమత్కార గతుల,

నిచ్చుచున్నావు తగు దినవెచ్చములను
చిరముఁ గురిపించుచున్నావు పరమకరుణఁ,
గాచుచున్నాఁడ వే లోటుఁగలుగనీక
సత్య కరుణాస్వభావ! శ్రీ సాయిదేవ!

## శ్రీ సాయిప్రభు చరమ సూక్తులు

"తనువుఁ బాసిన నేగు నెందొ, మనచెంతఁ నిల్వఁగాఁబోఁడు, క న్గొను భాగ్యంబిఁక మృగ్యమౌ" నని, విచారించెద మీకేల? సా యిని నీ యారడుగుల్ ప్రమాణమగు దేహిఁ గాఁగ భావించి, యిం దనుకఁ జూతురె? బిడ్డలార! జగదంతర్యామిఁగా నమ్ముఁడీ!

బ్రహ్మమును నేన, యెల్లవిశ్వంబు నడపి,
సతముఁ బాలించు నా మహాశక్తి నేన;
చేతనాఽచేతనంబు లౌ జీవసమితి
యందు నాధారభూతమౌ ప్రాణి నేన.

నా సమాధియే మీతోడ బాసలాడు;
అంతయేల? నా శల్య శల్యంబు నందుఁ
బ్రత్యణువు సల్పుఁజాలు సంభాషణంబు;
విశ్వసింపుఁడీ! నా మాట - బిడ్డలార!

తనువు గల్గిన లేకున్న దాన నేమి?
తనువు విడిచితి - నైన నన్ననఁగలారు;
కనుఁడి నను, నేమఱక మిమ్ముఁగనుచునుందుఁ,
దలఁచికొనిన మాత్రమునఁ జెంతన వసింతు"

అని, దయామయుఁడౌ ప్రభుండానతిచ్చెఁ;
గలఁడు మనయందు. మనతోడ మెలఁగునతఁడు:
నిలుపు డీ పల్కు మదిఁ, 'సాయి' తలఁపుఁగను డీ,
అనుసరింపుడు ప్రభువు బోధానుసరణి.

## బోధ

అర్థ చింతనంబును మఱి, స్వార్థచింత
బుజు పవిత్ర మార్గమునుండి యెడము సేయు;
ఎదుటివాని మోఱల్ చెవి నిడఁడు నరుఁడు
ఆస లీసులు వీని నియంత లగుట!

దుర్భరంబు దైన్యం నందిన దుర్ఘటంబుఁ,
గేవలము దోషమిళిత మీ జీవితంబు;
దొసఁగు జాడల విడి వీలు పొసఁగు నంత
బుజు పథంబుననే పయనింపుఁడెపుడు.

-: శ్రీ సాయిబాబా – ఏకాదశ సూక్తులు :-

1 శిర్డీ గ్రామంబును జేరిన వారికి
సంతాప చయములు సర్వమడఁగు,
2 ద్వారకామాయి సోపానముల్ మెట్టుడు
నఖిల సంపదలు లభ్యంబులగును,
3 భౌతిక దేహంబు వదలియున్ నా భక్తు
లందఱ జాగ్రత్త నరయుచుందు,
4 నా భక్తులకు రక్షణంబీ సమాధియుం
దుండియే వెలువడుచుండు నెపుడు,
5 ఈ సమాధి యందుండియే యెల్లకాల
ములను మెలఁకువ నావారిఁ బ్రోచుచుందు,
6 మనుజ భాషణముల నేను మాటలాడు
చుండు దీ నా సమాధియందుండి యెపుడు.
7 నను శరణొందుచు సన్నాశ్రయించిన
వారి రక్షించుటే వ్రతము నాకు,
8 ఎవ్వఁడు నాపయిన్ దృష్టినిఁ బఱపునో
యతనిపై నాదు కటాక్ష మలరు,
9 భక్తుఁడై యెవఁడు నాపై భారములమోపు
నే నవియెల్ల వహించుచుందు,
10 సాయమేన్ బోధనేన్ జనుఁడు నన్ గోరి, యు
పేక్షింప నొసఁగెద నా క్షణంబ,
11 నాదు భక్తుని యింట నే నాఁటనేని
'లేమి' యనునది లేశమేన్ లేదు–లేదు.
"ఇదియె సత్యంబు - సిద్ధాంతమిది" యటంచు
శపథమునుజేసి యెల్లెడఁ జాటుఁడింక.

ఓమ్
శ్రీ వేంకటేశాయనమః
శ్రీ సాయీనాథాయనమః

# శ్రీ సాయీ కరుణ

ప్రథమ లహరి

## — ద్వారకామాయి —

## అభయములు

సంసరణ వార్ధిఁదరియించు సాధనంబు
సాయి నామ పోతమని విశ్వాసమూని
ద్వారకామాయిఁ జేరిన భక్తుఁగాంచి
సాయి పలికించు ద్వారకామాయి పేర.

ద్వారకామాయి - నీ తల్లిగా నెఱుఁగుము,
నీకు నీవారికి నీడ నొసఁగు,
ద్వారకామాయి - యాపదలెల్లఁ బాపి, బి
డ్డలకు సౌఖ్యంబులఁ గలుగఁజేయు,
ద్వారకామాయి - యత్యంత దయోపేత,
కోప మెవ్వారిపైఁ జూపఁబోదు,
ద్వారకామాయి - సత్త్వరమ యార్తుల సాఁకి,
దఱిఁజేరి గండముల్ తలఁగఁబెట్టు,
ద్వారకామాయి - యంకతల్పమునఁ జేరు
నట్టి సుతుల యాధివ్యాధు లణఁచి మనుచు,
ద్వారకామాయి - భక్తబృందానుయాయి,
ద్వారకామాయి - పరమపద ప్రదాయి.

ద్వారకామాయి బిడ్డలౌ వారలెందుఁ
బన్నగ మృగాది బాధలఁ బడయఁబోరు;
ద్వారకామాయి రక్షించు వారిఁ జెనకఁ
జాలునదిలేదు నెమక విశ్వంబునందు.

"ద్వారకామాయి బిడ్డయౌ వాని నీవు
తాకువాఁడవె? నీచుఁడ! తాకుమెటులఁ
దాకి చంపుదో కనె" దని కేకవెట్టు;
ద్వారకామాయి భక్తులపాలి తాయి.

జీవ! ద్వారకామాయి "మసీద" టంచు
నరయఁదే?- కాదు - ద్వారకయని యెఱుంగు;
ద్వారకామాయి శరణొందువార లెందు
నాపదల పొల్పడరు నిశ్చయముగ నమ్ము.

ఈ మసీదునందలి మెట్ల నెక్కువారి
యఖిల కర్మ దోషంబులు నడఁగి, మోద
మంకురించు; నిందు వెలుంగునట్టి నేను
గడఁగి రక్షింతు మిమ్మెల్లకాలమందు.

ద్వారకామాయిఁ జొచ్చిన భక్తజనుల
కోరికలు సర్వమును సమకూరుచుండు
నా క్షణంబున, నన్యసహాయ మెందు
నెమకఁ బనిలేదు మత్పద నిష్ఠితునకు.

ద్వారకామాయి కన నీదు మారకంబు,
ద్వారకామాయి శ్రితజన తారకంబు,
ద్వారకామాయి పాప నివారకంబు
ద్వారకామాయి పరసుధా ధారకంబు.

* సాయినగు నేన — ద్వారకామాయి-నగుదు. *

-• శ్రీ సాయీ బా బా •-

# అభయప్రదానములు

నను ప్రేమించినవానిపై సతతముగ నాదృష్టి సారింతు, నే పనిఁ గావించుచునున్న, నేయెడల నిల్వఁగఁజాలినఁగ నమ్ము, నె మ్మనమందీ నను నీవు కన్ను మొఱగింపఁగలేవు నేఁ జేరనే రని తావుండదు, నీ దఱిఁగ నిలచి సర్వం బేను వీక్షించెదఁగ.

నను సేవించుచు నాదునామము ననన్యశ్రద్ధఁజిత్తంబునఁగ మననంబుఁగ బొనరించి, నాకృతులఁ బ్రేమఁగ గీర్తనల్ సేసి నా యను భావంబునుబొందు; దాన, సకలంబౌకర్మముల్ నాదు భ క్తునకుఁగ ద్రెయ్యును; నాదుభక్తుదఱినుందుఁగ సర్వకాలంబులఁగ.

సత్య మాధారముగ నీవు సంచరింపు
మెల్లవేళల, నపుడు నీ వెటులనున్న
నెందు నీవున్న - నేమి కావించుచున్న,
విడువకెప్పుడు రక్షణంబిడుచు నుందు.

నీ వేయెడ నేవేళల
భావంబున నన్నుదలఁచి ప్రార్థించెదవో
నీ వెంట నచట నప్పుడు
నే వెలయుదు; భయము విడుము నిర్మలమతివై.

ఎవఁడనన్యభక్తి నెద నన్నుఁ జింతించు,
స్మరణఁజేయు, నాదు శరణు గనును;
వానికేను ఋణము పడియుంటఁ, దలనేని
వెచ్చపెట్టి, యభయమిచ్చి మనుతు.

ఎవఁడీ మత్పరరూప దివ్యగుణముల్ హృద్వీథిఁజింతించు, వ
స్తువెదేౙ ముందుగనాకొసంగి భుజియించుౘ, ప్రేమ విశ్వాసముల్
దవులౙ నాకయి క్షుత్పిపాస లిరవొందౙ విశ్వమం దెల్లవ
స్తువులౙ లెక్కఁడకుండు, నాతనికి దాసుండౌచు వెన్నంటెదౙ.

భక్త పరాధీనుఁడ, నే
భక్తునిఁ బ్రేమింతు, నన్ను భక్తుఁడు ప్రేమా
సక్తిని బంధించు, నిఁకే
యుక్తులకుౙ జిక్క నితరయోచన లేలా?

తన హృదయంబు పుత్రవనితా జననీ జనకాప్తబంధు కాం
చనములనుండి త్రిప్పి, యనిశంబును నాయెడ బ్రేమసల్పు మా
న్యునిమది నిక్కువంబగు ప్రియుండనియెంతుఁ; బయోధిఁజొచ్చు వా
హినిబలె నన్నుఁబొంది సుఖియించు నతండొగి నిర్వికల్పుఁడై.

(శ్రీ సాయీబాబా — భక్తునకు. జరిగిన సంభాషణము.)

సా. బా:- బిడ్డ! నాధనపేటి బీగమిచ్చితినీకుఁ
గొమ్ము ధనమ్ము నీ కోరునంత,
ఇంక నేమేనిఁ గాంక్షించిన యడుగుము
భక్తుఁడు:- ఏమియుఁగోర సాయీమహాత్మ!
సా. బా:- కోరు మేదేని సమకూర్ప నిచ్ఛించితి.
భక్తుఁడు:- నేదైన నడుగ నాకీయఁగలవె?
సా. బా:- సందియంబేమి!
భక్తుఁడు:- యీ జన్మమందున మఱి
యేజన్మమందైన నీవు నన్నుఁ
బాయకెపుడు నాదఱినుండు వరమునిమ్ము
సా. బా:- ఇచ్చితిని నిన్నువిడకెప్పుడేని వసింతు
నీదువెలుపల లోపల, నీవిఁకేమి
చేయుచున్న, నేగతినున్నఁ జేరియుందు.

తనయందు విశ్వమందున
ననయము వెలుగొందు నీ చరాచరసమితిన్
ననుఁగాంచు నాదుభక్తుఁడు
పొనరఁగ నా పరమరూపమును దానొందున్.

ఏపనిఁజేయుచు నున్నను
నాపయిఁ జిత్తంబు నిలిపి నన్నొక్కనినే
ప్రాపుగ నెఱనమ్మిన, గత
పాపుండై నరుఁడు పొందుఁ బరమార్థంబున్.

గురువును నెఱనమ్ముటయే
పరమంబగు సాధనముగ భావింపుము; నీ
గురువే దైవము సకలము;
పరికింపుము నన్ను, నిన్నుఁ బరికింతుఁ గృపన్.

అనిశంబుఁ దిరుగని మనసు నాకొసఁగి నా
యందు విశ్రాంతినిఁ బొందువాఁడు
తనదేహమునకు నేన్ దన యాత్మకొఱకు నేన్
భయమొందుపని లవమయిన లేదు
నన్నె వీక్షించుచు, నన్నె యాలించుచుఁ
జేరి నా మాటలె చెప్పుకొనుచుఁ
గాలము నాకునై కడపు నాతండు చై
తన్యము వడయు యథార్థమింత

నిత్య శుద్ధ బుద్ధునిగ నన్నెఱింగెడి
భక్తజనుఁడు నన్ను బడయుచుండు;
జనన మరణ బాధఁ గనఁబోఁడు వాఁడెందు
నిందు సందియం బదేమి లేదు.

నా నామము వేమాఱును
మానసమున స్మరణఁజేయు మనుజుఁడు నిత్య
జ్ఞానానందాత్మక సు
స్థానంబై వెలుఁగు నిష్టదైవము నొందున్

'సాయీ! సాయీ!' యని జను
లీ యక్కరములను రెంటినే నెదఁ బొంగన్
బాయక కీర్తించిన, వా
రేయేవిధి నున్న నుందు నే వారలలోన్.

నా నామము జపియింపుము,
యీ నన్నొక్కని సమాశ్రయింపుము సతమున్;
"నే నెవ్వఁడ?"- నని యెఱుఁగన్
మానుగఁ బొనరింపు శ్రవణ మననము లెలమిన్.

ఇందుగల - నందు లేనని
సందేహమువలదు నీకు - సర్వగతుఁడనై
యెందెందుఁగనిన నందే
యుందును, రూపమని యొకటియుండదు నాకున్.

ఇతరమేదియుఁ దలఁపక యెవరు నన్నుఁ
జింతసేయుచు మది నుపాసించుచుందు,
రట్టి నిత్యాభియుక్తులు నైన వారి
కెపుడు విహిత యోగక్షేమ మేన యిడుదు.

"ఏరీతి జనుల నానా
భారంబుల మోయు సాయిబాబా?"- యని లోఁ
దారసిలన్ బోకుఁడు, మీ
భారముల వహింతు, నిపుడ వదలుఁడి నాపై.

నిన్నునమ్మి సతము నన్నాశ్రయించెడి
వానియింట నెన్నడైనఁగాని
కుడువఁ గట్ట నెట్టికొఱఁత వాటిల్లదు
ప్రతినఁజేసి యిదియె పలుకుచుంటి.

మీర లెల్ల నా బిడ్డలు మీకుఁ దండ్రి
నేన, నన్నాశ్రయించి మీకేది వలయు
వానిఁ గొందురి; కావున జంకఁబనియు లేదు.
"సాయి దేవుఁడా?" యనెడి సంశయము వలదు.

ఈ కరణి నీవు చిత్త
వ్యాకులతను బొందనేల? భయమందకుమీ!
నీ కావలసిన వానిని
సాకల్యముఁగూర్తు నింత, సత్యము సుమ్మీ!

ఊరకయె కూరుచుండు, వి
చారంబులఁ దక్కి, నీకు సలుపుదు హితమౌ
తీరున నీ కోర్కెల, నిఁక
జేరుతు నానంద నిత్య సిద్ధపదంబుఁక.

నీవెంట నేను నడువఁగ
భావంబున భీతినొందఁ బని యేమిఁక, నే
త్రోవను నీవు చరించినఁ
గావలిగానుందు; వెతలఁ గననీ నెపుడేఁక.

ఎందుఁ బసిబిడ్డ నిద్దుర నొందుచున్నఁ
బెద్దవారు మేల్కొని కాపు పెట్టఁబోరె?
నాదు బిడ్డల జాగ్రత మైఁ దవులఁగ
శ్రమపడియునైన వారి రక్షణమొనర్తు.

శ్రితులగువారి నెవ్వరను జేద్పడనీయను; వారిఁగూర్చి సంతతమును యోజసేతు; నెట నాదగుభక్తుఁడు గూలుచున్న బాధ్యత వహియించి నా కరములన్నియుఁజాచి వడిఁగ్రహింతు, నేకతముననేని; నాపదలఁ గందరు కుందరు మత్పదాశ్రితుల్.

అతఁడు నావాఁడ, నావాఁడయగు సతండు
భక్తుఁడగువానిఁ గాపాడుపనియు నాదె;
యేను జేయూఁత నిడకున్న నెవరు వాని
కాదటఁగ నిల్చి రక్షింప నధిగమింతురి?

పవలుఁ రేలును నాదు భక్తవితతిఁ స్వాంతంబునందెంతు, నెందు విరామంబునులేక వారల స్మరింతుఁ సుమ్మి వేర్వేఱ; నేలవమేఁ నిద్దురయెట్టిదో యెఱుఁగ నెల్లఁ రాత్రి, బిడ్డా! త్వదీయ విచారంబెదఁ దార్కొనెఁ దలఁపనీ దన్యపశ్రంసార్థముల్.

అడుగడుగునకు జాగ్రత పడగవలసె
నీవు చరియించునెడ, నిట్లు నిన్నుఁగనక
విడిచియుంటినే నేమౌనొ విధియెఱుంగు!
నేను గవకున్న నావాని నెవఁడుగాచు?

మఱువఁబోను నావాని నే తరుణమందు
రెండువేల మైళ్ళకుఁబైన నుండుఁగాక;
వాఁడు నా హృది విడకుండు వాఁడసుమ్మి!
అతఁడు వెలిఁగాఁగ నెదియు నే నారగింప.

ఎఱుఁగను గోపపుం బలుకు నెవ్వరిపైనను; దల్లి కోపముల్
బఱపునె యెన్నఁడేనిఁ బసిపాపలపై? జలరాశి వాహినీ
శరములఁ గ్రిమ్మఱల్ నదులచక్కికిఁ ద్రోయునె? భక్తికేను సం
బరమునుగాంతు; భక్తుఁడగువానికి నూడిగ మాచరించెదన్.

ఈ యెల్ల విశ్వమందున
నేయెడ నే నుందు; భక్తుఁడెందు క్షుధార్తిన్
గూయిడుచుండఁగఁ జూచుచు
సాయపడకయుండ నెట్టిసమయము లందున్.

రండీ! బిడ్డలు! సంచుల
మెండుగ 'యుధిఁ' గొనుచుఁబొండు, మీతలిసొమ్ముల్
బండులకెక్కింపుఁడి, యె
వ్వండును మీ కడ్డురాఁడు - త్వరపడుఁడింకన్.

"బాబా! బాబా! మాకిడ
వా! బాబా!" యంచు నఱచువారలె కానీ,
"రా! బాబూ! కైకొను" మన
నే బిడ్డఁడురాఁడు, గొనఁ డభీష్టార్థంబుల్.

అడిగిన వానికి నడిగినవన్ని తే
దనక యిమ్మని గురుఁడానతిచ్చె,
నాపల్కు నాబోధ నాట దెవ్వానికి
మఱుఁగుసేయను నాదు పరమధనము
బండ్లకెక్కింపఁ డెవ్వాఁడు; నేఁదవ్వుఁడీ
యందు, నిందఱు శ్రమనొందఁబోరు,
ధనరాశి త్రవ్వి బండ్లను నింపికొనుమింక
నాలసింపఁగ నేలనయ్యా! నీవు

తల్లి గౌరవమునునిల్పఁ దలఁపుఁ గనుము!
జాగుసేసిన మేను శాశ్వతముగాదు;
అవని నవని, నీరము నీట, నగ్ని యగ్ని,
గాలి గాలి, నింగియు నింగిఁ గలసిపోవు.

నా మాటఁ ద్రోసిరేనియు
మీ మోసంబునకుఁ గలదె మేర? యిఁకెన్నేఁ
బాముల కీ యవకాశము
నోమరు నోమంగ లే రనూనము సుండీ!

జడనిధిఁజొచ్చిన తటినీ
జడముల నొగిఁ గ్రిమ్మరింప సాధ్యములగునే?
కడ చనిన క్షణముఁ గ్రిమ్మరఁ
బడయుంగా నగునె యెంతవారలకేనిన్?

నిరతంబు నాదు పలుకులు
స్థిర చిత్తముతోడ విశ్వసించితిరేని జే
కురు సర్వాభీష్టంబులు
పరమార్థము మీకుఁ గొంగుబంగారమగుచున్.

* * * * * * *

సాయిప్రభువు లేఁడనెడి విచారమేల?
ఆ మహాసిద్ధవస్తు 'వహాంతరాత్మ';
తన సమాధినుండియె భక్తజనుల నెల్ల
వేయికనులఁ గన్పెట్టి కల్పించు సుగతి.

---

శాశ్వత సమాధినుండి శ్రీ సాయి పలుకు
సంతత మహాంతరాత్మయై సాయి పొలుచు.

---

నే గతియించితినని యీ
"జోగెం" చెడి; జనన మరణ శూన్యుఁడ 'లక్ష్మన్'!
జాగేల? రమ్ము! పఱపుము
బాగుగ హారతిని సుప్రభాతార్చనలన్.

నీ వాగ్దత్తము మఱచెదె?
చావేయెడఁ గనను; "మజ్యా సర్వ్యారూపా
దేవో!" యనుఁ; బోఁదొ్రియం
డావంతయు దత్తముల, శ్రితానీకములన్.

నన్ను శరణొందు వారల
నెన్నండేని విడువ, మఱువ నెచ్చటనున్నన్
బన్నుగ సమాధినుండియు
వెన్నాడుదుఁ, బలికి, కాతు, విహితముఁ గూర్తున్.

భౌతిక దేహమునంబలె
బ్రాతిగ నుత్సుకతఁ గార్యభారవహనమున్
గాతర రక్షణ నెఱపెద
నాతత కరుణన్ సమాధియందే నున్నన్.

జానగు మహాసమాధిని
నేనుంటి నటంచు వెఱవ నేకార్యము? మీ
రేనాట నెప్పు డెచ్చట
ధ్యానింతురొ యా క్షణంబునం దేతెంతున్.

నాబిడ్డఁ డే క్షణంబున
బాబా! రమ్మనుచుఁ బ్రేమభరమునఁ బిలువన్
నేఁ బరువులెత్తి వచ్చెద
నే బంధ్లును నాకు వలయునే చనుదేరన్!



## —•• బాబా సందేశములు ••—

పరిమిత తత్త్వభాగ్యముల స్వాశ్రితకోటికొసంగి ప్రోవ, ని
ర్ధర జనియింతురు సాధువు లుదారమతుల్; వరసాధుసేవ సం
సరణ మహాబ్ధి తారకము; సాధుజనావమతిన్ క్షమింపఁడా
హరి; హరి - సాధు లిర్వురు యథార్థము నొక్కరః విశ్వసింపుఁడీ!

శ్రితులగు వారలఁ జేకొని
సతతము విహితంబులైన సద్వస్తువులన్
గుతుకమునఁ గూర్పవచ్చితిఁ;
గృతకృత్యులు గండు! రండు! కేల్గైకొనుఁడీ!

నన్నాశ్రయించు వారలఁ
గ్రన్ననఁ జేపట్టి వారి కాంక్షితముల నె
న్నెన్నేని నొసఁగి ప్రోచుట
మన్నియమము; దానికై క్షమన్ భాసిలెదన్.

§ ధనముఁగోరి కొందఱును, సంతానకాంక్ష,
గొంద, ఱుద్యోగముల వాంఛఁ గొంద, ఱొండు
కార్యసిద్ధికై కొందఱుఁ గ్రమ్మికొనఁగ
వారినెల్లర వారింప భక్తుఁడొకఁడు
సాయిపరిభువనెఁ గరుణారసార్ద్ర ఫణితి. §

చేరిన నావారి వారింపఁ బోకుఁడు
తొలుత నేతెంతు రా తలఁపుఁజేసి,
యవ్వారి కోరిక లవ్వారిగాఁ బొంది
నెమ్మది మోద భరమ్ము హెచ్చి,
యెల్ల సంపదలొంది, పెల్లగు బత్తిమైఁ
బరమార్థకాంక్ష నా శరణుఁ గందు
రెందున్న వీరి నే దే నెపంబునను నా
కడకు నాకర్షింతుఁ గార్యమూని.

వీరలు తమంతఁ దారు నన్జేర రారు;
ఏటి యెందున్న నావారిఁ జేరఁ బిలుతు;
వారి వారి కోరిక లౌక కారణంబ
కాని, యిది యెల్ల నాదు సంఘటన సుమ్మి!

వేల మైళ్లదూరమున నా బిడ్డలున్నఁ
బ్రేమ పాశంబులన్ గట్టి వీరినెల్ల
నాదరికి నేన లాగుదు సాదరమునఁ,
ద్రాళ్లఁ గట్టి పిట్టల లాగు పిల్లలటుల.



# శ్రీ సాయిబాబా స్వభావము

## మనోగతి - శక్తి

బ్రాహ్మణుఁడితండు - స్వచ్ఛమౌ బ్రాహ్మణుండు,
పావన బ్రాహ్మణుఁడు, కోట్లప్రజల శుభ్ర
మార్గమున నడిపించి గమ్యస్థలంబు
నందఁజేయు; నియ్యదియె "బ్రాహ్మణమసీదు".

* * * * * * *

'అల్లా' ను నేన, మహాలక్ష్మి నేన
ఎల్లభూతంబుల హృదినుండు నేన;
పాండురంగఁడ నేన పంఢరియందు
పండరికిని బొమ్మ వఱలెద నందు.

గణపతి నేన నీ కావించుచున్న
గణనాథు పూజ నేఁ గైకొంటి తల్లి!
పావన దత్తాత్రేయ మూర్తిని నేన
తనయుని నెట్లు పొందఁగ నేర్చితీవు?
గంగాపురంబునఁ గ్రాలెడి దత్తుఁ
బొంగారఁ గావించు పూజల నొంది,
ఈ కాయమును జీల్చి యే నిచ్చినాఁడ
లేకున్న సంతతి లేదీ భవమున.
పావని గంగకై పఱువెత్తనేల?
శ్రీ విష్ణు వేన దోసిలిపట్టుము, నాదు
పదముల నుండియే ప్రవహించు నమ్మ!
సదమల జహ్ను వత్సలయైన గంగ.

ధ్యాన నిష్ఠను విష్ణు దర్శింపనేమి?
ఈ నాదరూప మీక్షించిననేమి?
అనిలాత్మజుం డైన హనుమంతుఁ డేన
తనర నన్నిచ్చె నా తండ్రి మారుతికి;

హనుమంతు దేవాలయము ముందునిలచి
పానరింతు సన్నుఁ దమ్ముఁడ నేనటంచు.

* * * * * * *

ఎల్ల కమలాసనాండము
లెల్ల చరాచరములైన యీ ప్రాణిచయం
బెల్ల దివిజవర్గంబులు
'అల్లా' యగు నిదియె నిశ్చయము - సిద్ధంబుగా.

నేను "§పర్వర్దిగర"ను, నా నెలవు 'శిర్డి'
ఎల్లవిశ్వంబునన్ వసియించి యుందు,
నరయ వే లక్షలేండ్లు వయస్సు నాకు,
దీవెనలఁ బఱపుటయే మదీయ వృత్తి;
ఎవ్వ రేమి కోరిన నదియొల్ల నిత్తు.

కనినఁ బండరి పురిని, గంగా పురమున
నెందు నెందులఁజూడ నందే వసింతు;
భూత సంచయములయందుఁ బొలుతు నేను;
ఏనులేనిది విశ్వమం దెద్దియు లేదు.

§ సర్వేశ్వరుఁడను.

నే, విశ్వమందు నెల్లెడ
స్థావర జంగముల నెట్లు తార్కొని యుందుఁగా
భావింపఁగ నాయందున
నీ విశ్వము వెలయుచుండు నేకాలమునఁగా.

* * * * * * *

ఏ వానియందు నీదగు
భావమ్ము లయించుఁ బ్రేమ భయముల కిరవై
యా వానినొకని నమ్ముము
దైవము వైళంబ నిన్ను దగరక్షించుఁగా.

## బాబా - సర్వ వ్యాపకత్వము

ఆకార శూన్యుండనై యలరారుదు
విశ్వమందెల్లెడ వెలయుచుందు,
స్థావర జంగమ సంచయంబుల యందు
నేను లేకుండిన దెద్దియు లేదు,
వెలుపల లోపల వెలుఁగొందుచుందుఁ, ద
త్సర్వము నేనయై తనరుచుందు;
కల సమస్తాకాశ మందుందు నే
నెసఁగని పరమాణు వేని లేదు;
దృక్కునో గోచరంబైన యీ సమస్త
జగము నొక్క పోవుగ నేనయగుచు నుందు;
తడియు, నెండను, కాలను, చెడను, పడను,
ఇంచుకేనియుఁ గదలఁ జలించ నేను.

చీమల నీఁగల దోమల
సామజముల వ్యాఘ్ర సింహ శరభములందేన్
చామరుల బుధులఁ బేదల
భూమీశులనేని నొక్కపోలిక నుందున్.

జలముల స్థలములఁ గానన
ములఁ, జనపద నిర్జనంపు భూముల నుందున్
వెలయుదు నగ్నిని నింగినిఁ
గలుగదు నాకెట నియామకంబగు స్థలమున్.

*  *  *  *  *  *  *

ఆఁకటఁ గృశించు కుక్క కాహారమిడుట
షడ్రసోపేతమైన భోజనము నాకు;
దాని యాఁకలి శమియించెనేని నాకుఁ
గలుగఁగాఁబోవ దాఁకటికలఁత లవము.

§ ఒకసమయమున బాబా - లక్ష్మీబాయి సింధీతో "అమ్మా! నన్నాఁకలి చిచ్చు బాధించుచున్నది" యనెను. అంత లక్ష్మీబాయి వేగముగ వెళ్ళి యొక పళ్ళెరమునిండ పంచభక్ష్య పరమాన్నములఁ బెట్టికొనివచ్చి బాబాముందుఁ బెట్టెను. శ్రీ సాయీప్రభువు ఆపళ్ళెరమును కుక్క ముందుఁ బెట్టెను. లక్ష్మీబాయి ఆశ్చర్యపడి "ఇదేమి? బాబా! నీకని తెచ్చిన పదార్థములఁ గుక్కకేల పెట్టితివి?"- అన- బాబా ఇట్లనెను.

అమ్మ! శునకముగూడ జీవమ్ముగాదె?
మనము పల్కుదు మదిచెప్పుకొనఁగలేదు;
అదియు నాఁకటిచిచ్చుచే నటమటించె;
'నేను-నది'- యొక్కరమ- యేకమై నెగడెద,
మేను దినిన- నయ్యది తిన్నఁగాని యొకటె.

పొద్దుటను గుక్కెడినట్టి భోజనమున
జీర్ణమదిగాక నే సొమ్మసిల్లుచుంటి;
మడువునను సూకరముగ నేఁ దొడరియుంటిఁ
దనుపవైతి వించుకయు నీ ధక్తికి నరుగ.

ఒక్కొకవేళఁ బందితనుపొంది చరించెద, నొక్కవేళ నేఁ
గుక్కగ సంచరింతు; తనకుఁ గనుపించెడి భూతకోటి స
మ్యక్కృతి నన్నె కాఁదలఁచునాతఁడె భక్తుఁడు; యట్టివానికేఁ
జిక్కెద; నన్యులేగతి భజించియు నన్గనలేరు లేశముఁ.

పదియును నెన్మిదేండ్లకును బైఁబడె నాదటి నీవుచేరి, యే
మది? మది 'సాయి' యన్న నొక యారడుగుల్ పొడవైనరూపుఁగా
గఁ దలఁచెదే?- యటెన్నటికిఁగాదు; వసింతును దోమఁ జీమనే,
నిదియొక "చిన్నె";- దీనిఁగను దే నటనుంటినటంచు నెంచుమీ!

చీమలుఁగా నీఁగలుఁగా
దోమలుఁగానుండి యైనఁ దొరవు భక్తి
ప్రేమల నీవిడు భోజన
సామగ్రిని నారగింతు - సత్యము సుమ్మీ!

ఈవు చూచునట్టి యీ శరీరంబొక
గృహ మటంచు నిక్క మెఱుఁగ మీవు;
ప్రేమ- నాగురుండు వేంకుశుం డెప్పుడో
యెత్తికొనుచుఁబోయె నింటనుండి.

నీ వెచ్చ టెచట నుండువొ
నీవెంటన నేవసింతు; నేనరుదెంచఁ
గా వలయునె శకటంబులు?
భావమునఁ దలఁచు మాత్రఁ బఱుగునవత్తుఁ.

1914 వ సంవత్సరమున- మే నెలలో బాంద్రాపురమునుండి Mis. T ఆమె కుమారుడు Master. T. బాబాదగ్గరకు వెళ్ళఁగా.

సాయిబాబా:- అమ్మా! మీ యింటికి ని
త్యమ్మును నే మూఁడువేళలందున నాతి
ధ్యమ్మును గైకొనుటకునై
సమ్మతి నరుదెంచు నట్టి జాడ తెఱుఁగుదే?

బాంద్రాకాంత:- నిజము- సాయీ మహారాజ! నిజము; నిజము.

ప్రతిదినము బాబాను శిర్డియందుఁ జూచుచున్న యొక భక్తురాలు వారిమాట లర్థముగాక- "ఏమి యీ వింతపలుకు సాయీ మహాత్మ!" అనెను.

సాయిబాబా:- కల్లలెప్పుడుఁబలుక నో తల్లి! నేను.
నేఁ మహాలక్ష్మి నగుదును; నేను బ్రతి ది
నంబు వచ్చుచుంటనె నీ గృహంబు? నీ వొ
సంగు నాహార మారగించంగఁ బోనె?

బాంద్రాకాంత:- నిక్కువంబు- సాయీ ప్రభూ! నిక్కువంబు.

షిర్డికాంత:- నిజముగా సాయినాథుండు నీ గృహంబు
నిచ్చలును వచ్చుచుండునే?- నీవు భోజ
నం బొసంగు చుండుదువె?-

బాంద్రాకాంత:- నిజంబు తల్లి!

సా. (Master. T. తో) నేను వచ్చుచుండనె బిడ్డ?-

బాలుడు:- నిజము-బాబు!

సాయిబాబా:- (క్షీర్సాగర్ కాంతతో)

తల్లి! నిజమిది; నేను బాంద్రాపురమున
'భావు' గృహమునకును జని వచ్చుచుందు;
నడుమ గోడనుదాటి యనంతరంబు
నట నయోమార్గమును దాటి యతనిగృహముఁ
జేరుచుందును కాకి యాకారముననుఁ.
మేటి గోడలు గుంటలు దాటిపోదు.

* * * * * * *

§ బాంద్రా పురమున తేండల్కార్ అను భక్తురాలు పలువిధములుగ బహు పుష్ప హారములను గూర్చి బాబా ప్రతిమకు సమర్పించు చుండెడిది. అట్లు మూడు నెలలు జరిగినతరువాత నామె శిర్డికి బాబా సందర్శనార్థమై వెళ్ళెను. బాబాపాదములవ్రాలి నమస్కరింపఁగా శ్రీసాయీనాథుఁడు కాకా దీక్షిత్ తో నిట్లనెను.

అహహా! దీక్షిత్తు! ఒండు రెండయ్యెనెలలు
శిర్డి గ్రామంబునందే వసించి;- ప్రేమ
పాసఁగ, నీతల్లి- పూల నన్నుంచి తేల్చె;
దిమ్మ దిఱిగెను- నాకుఁ జిత్తమ్ము వశము
గాద! యిప్పుడిప్పుడ యించుకంత మదిని
స్వస్థతను గాంచుచుంటి విశ్రాంతి గదుర".

అని భక్తురాలు గావించిన పూజను గొండాడెను.

* * * * * * *

నే వెడలితిఁ గడు నాసను
'భావు' గృహంబునకు నొకట బాంద్రాపురి, నా
కావంత యొగిరంబిడ
కే - వెడలఁగనడపె, నాకలెసఁగ మగిడితిన్.

* * * * * * *

నీవు భుజించెడి వేళల
భావంబున నను దలంచు వాఁడవె? యెప్పుడున్
నీవెంట నుండనే? నా
కా వంతే నోగిరంబు నర్పించెదవే?

* * * * * * *

ఈ యొక్క శిర్డిపురి యం
దే యుండెడివాఁడ ననుచు నెంచెదవేమీ?
నీ యజ్ఞానమ పొమ్మది;
నా యుండని తావు జగమునన్ లేదు సుమీ!

ఈ సాయి యొక్క శిర్డి ని
వాసుండగు ననుచుఁ దలఁచువాఁడు నిజముగా
నా సర్వవ్యాప్తిని వి
శ్వాసముఁ గనలేని మూఢ భావుఁడు సుమ్మీ!

* * * * * * *

ఈ కరణిఁ జింత నొందఁగ
నేకార్యము నీకు?- నిలువ నే బొంబాయిన్
నీ కడ?- నెవ్వరు చూతురు
నాకయి, నే వారి విడఁగనాడ నిముసమేన్.

ఏ చైతన్యము శిర్డినిఁ
దేఁచునొ యది యిప్పుడిచటఁ బేఁచుటఁ దెలుపన్
మీ 'చందర్గాడ్' పురంబున
కీ చక్కని నిన్నుఁజేర్చి యెఱుకపఱచితివ్.

* * * * * * *

స్నాన మొనరించితిని వారణాసి నిపుడ
ఇప్పుడ 'జజూరి' - 'భాగటు' లే నరిగితి,
'ధూలియా' యందు నన్ననఁజాల వొక్క?
నను వినుచు సంశయంబును గనెదవేల?
గడియ వైచిన నారాక కెడరు గలదె?

* * * * * * *

అమ్మా! యదృశ్యమౌ రూ
పమ్మున నీవెంటనుందు భయమొందకుమీ!
పొమ్మిక నీ బిడ్డల భా
రమ్మును నాపైన నిడుము రక్షణసేతున్.

* * * * * * *

కన్యాకుగ నుంటిని నీ
కు న్నీ కులసతికి నొరులకును గనరాకే
త్వన్నిలయమున పురందర్!
నిన్నెప్పుడు విడను బొమ్ము నిశ్చలమతివై.

* * * * * * *

నీవెందునున్న, నేపనిఁ
గావించుచునున్న హృదయకంజంబున, నన్
భావింపుమి, యాక్షణమున
నేవైళమ పేరిమఁడాసి నీదటనుందున్.

నీవెచ్చట వసియించిన
నావా రెవరేని నేమొనర్చిన నెదియేన్
భావించిన, వచియించిన
నే వాని సమస్త మెఱుఁగనేరుతు నపుడే.

నా సేవకు లెవరేనియు
నీ సన్నిధిఁజేరి భక్తి నిష్ఠితమతులై
నాసంగతి నడిగిన నే
నాసక్తినిఁ దత్క్షణంబ యభిమత మిడుదున్.

ఈ కనఁబడు ప్రాణివితతి
నేక గతిన్ గాచువాఁడ నెక్కాలమునన్
నా 'కరుణ' లేక యించుక
యాకే నల్లాడఁ బోవదనుచు నెఱుఁగుమీ!

శ్రీ సాయీ కరుణ
ప్రథమ లహరి
సమాప్తము.



ఓమ్

శ్రీ వేంకటేశాయనమః

శ్రీ సాయినాథాయనమః

# శ్రీ సాయి కరుణ

ద్వితీయ లహరి

## శ్రీ సాయిబాబా - విధులు:

నే నీశ్వర సేవకుఁడను
గా నెఱుఁగుము; నన్ను నేమి కావింపఁగఁ దాఁ
బో నెఱపు నటులఁ జేసెద
నౌ; నేతయు, ప్రభువు, దైవమై వర్ధిల్లున్.

భగవంతుని పరిచారకు
లగణితముగఁ గలరు; మహిమ లతివిస్తృతమై
నెగడొందువారి, కందఱఁ
బొగడొందుదు సత్ప్రభావపూర్ణుఁడ నగుచున్.

తనువును విడి వేఱొక నూ
తన తనువుమజేరు ప్రాణిఁ దగ శిథిలంబౌ
తనువునఁ జేర్పంగల, నై
నను నూతన తనువు కృతులనంతము చెడెడిన్!

మృతినొంది యిపుడు ప్రేతా
కృతిఁగని విహరించు సుదతి యిదె ననుజేరెన్
హితమెఱుఁగఁజెప్పి, యాసతి
మతి సమ్మత పఱచి తేర్చి మగుడ నడపితిన్.

*  *  *  *  *  *  *

మరణించు వేళలన్ మ
త్పరతంత్రులు వేలమైళ్ళ దవ్వున నున్నన్
మఱువను నావారల, నా
దఱికిని నేఁ జేర్చికొందు దయ పెంపారన్.

శ్రితుఁడైనవాని నెట దు
ర్గతిపాల్పడనీక సతతముఁ గాచెద; శరణా
గత జనుల కృతులకేన్ బా
ధ్యతఁగొని నేఁ జెప్పికొందుఁ దగ నీశ్వరుతోన్.

* * * * * * *

బాంద్రాకాంత కోమరుఁడు. Master. T. } ఎఱుఁగువాఁడవే నీవు సాయీమహాత్మ!
చేరినాను నీ ధనమును స్వీకరింప.

సాయీబాబా:- సత్యముగ నీవు దానిఁ గాంచంగఁ గలవు.

బాం. కాం. కో:- ఎఱుగుదును గాని; జరుగుట యెపుడొ? బాబ!

సాయీబాబా:- స్వల్పకాలంబులోనఁ గాంచంగఁ గలవు.

బాం. కాం. కో:- చేతిలోఁ జేయివైచి వచింపు బాబ!
ఇంక నెన్నిజన్మలలో లభించగలదొ?

సాయీబాబా:- మూఁడుజన్మలు చాలది పొందుటకును.

బాం. కాం. కో:- కాని, మావెంట నెప్పుడుఁ గనుచు నిలవె!

సాయీబాబా:- ఎంతమాట! పుట్టువు లివ్వియెన్ని యయ్యొ!
నెప్పుడేనియున్ మిమ్ము త్యజించఁబోను;
పవలు రేలు నావారిఁ గాపాడుచుందు.
వీరిఁగూర్చి యీశ్వరున కేన్ విన్నవింతు.

* * * * * * *

§ అకల్ కోట సపట్నేకర్ తో.

సా. శా:- మృతి నొందియున్న నీ ప్రియ
సుతు జీవాత్మను మగిడ్చి శోకించెడి నీ
సతి గర్భంబునఁ జేర్చెద
సుతునిగ మఱు వత్సరమునఁ జూతువు పొమ్మీ!

(మఱు సంవత్సరమున కుమారుఁడు పుట్టెను.)

* * * * * * *

కాకా దీక్షితుని సుభ
శ్రీ కలితు విమానమందుఁ జేరిచి, తుది నే
వైకుంఠమునకుఁ గొనియెద
నాక నివాసులు నొగిగ జోహారులు పలుకఁగ.

(కాకా దీక్షిత్తునకు సన్మరణము ప్రాప్తించెను.)

* * * * * * *

---

సాయి చెబ్బులు తినిమె మహాగ్దాలయ గురుణ.

§ హాన్సిరాజ్ అనునతఁడు ఉబ్బస వ్యాధి చే బాధపడుచుండెను. బాబాను ఆశ్రయించెను. పెరుఁగు త్రావకుము - పులుపు వస్తువులు తినకుమని బాబా చెప్పెను. కాని అతఁడామాటలు పాటింపక ప్రతిదినము రాత్రి పాలు తోడు వేసి ఉదయమున పెరుఁగు త్రాగ దలఁచుచుండెను. గిన్నెలో నున్న పెరుఁగు పిల్లివచ్చి త్రాగి పోవుచుండెను. ఒకనాఁడతఁడు పిల్లి పెరుఁగు త్రాగుటమాచి కఱ్ఱతోఁ గొట్టెను. హాన్సిరాజు బాబాను చేరఁగా - అచట చేరినవారితో బాబా ఇటు లాడెను.

ఒక్క గ్రామంబునఁ మూర్ఖుఁడొకఁడుగలఁడు
పెరుఁగు తినవలదంటిని పెక్కుమార్లు
కాని, తిననెంచ నిత్యంబు దాని దాఁచఁ
బిల్లినై త్రావుచుంటిని యెల్ల పెరుఁగు
వాని ప్రాణంబు గాపాడు వాంఛఁజేసి;
ఈ దినంబున నట్లు గావించుచుండఁ
గసరికొట్టె నన్ భుజముపైఁ గఱ్ఱతోడఁ
జూఁడుమని భుజంబున వ్రేటుఁజూపె సాయి.

* * * * * * *

హన్సి రాజు పిల్లినిఁగొట్టె, నైన నట్టి
వ్రేటు సాయికిఁ దగులఁ దపించె మిగుల.

* * * * * * *

---

శునకమును రోగియైనట్టి శూద్రుఁ డయ్యె.

(1911 April) కాశీనాథ్ గోవింద్ ఉపాసనీ మహారాజ శిర్డియందుండగా.

* * * * * * *

కాశినాథ్ ఉపాసని శీర్డి గ్రామమందు
శాక పాకంబులను దాన సలుపుచుండ,
నల్లకుక్క యొక్కటి వంటనెల్లఁ గనుచు
నిలచియుండెను; దాని కేకొలఁది యిడక
ద్వారకామాయిఁజేరి బాబాకు నిడఁగ;-
సా. బా:- ఇచ్చుటకుఁ దెచ్చితేమి నే నచ్చుటుండ?

కా.గో.ఉ:- నల్లకుక్క యొక్కటి తక్క నరులెవారుఁ
గానఁబడ రొక్కరేని నిక్కంబు, బాబ!

సా. బా:- బిడ్డ! నేనా నల్లకుక్కనై వేచియుంటి
నిడవ యొక యించుకే-నివియేల! పొమ్ము!

(ఉపాసనీ తిరిగి వెళ్ళెను)

మఱుదినంబు నాహారముల్ కరము సలిపి
కుక్కకై చూచె నచట నల్దిక్కులెల్ల
కాని, రోగియౌ శూద్రుఁడొక్కండు గోడ
నానుకొని నిల్చి వంటకం బరయుచుండె
కర్మఠుఁడు శ్రోత్రియుండైన కాశినాథుఁ
డచటి శూద్రుని గద్దించి యవలకనిపి
భోజ్యములఁదెచ్చి శ్రీ సాయి మ్రోల నిలిపె.

సాయీబాబా:- నిన్న భోజనంబును బెట్టకున్నవాఁడ
వీ దినంబునుగూడ నా కిడవె తిండి?
నావలకు గెంటివైచితి, వట్టి నీవు.
ఇచ్చటకు దెచ్చిపెట్టె దిదేమి తగవు?

కా. గో. ఉ:- ఎచటనుంటివి బాబ! నీ వెచటనుంటి?
సాయీబాబా:- గోడప్రక్కన నిలుచున్నవాఁడఁగానె?
కా. గో. ఉ:- అట్టివాఁడ వీవై యుందువా? మహాత్మ!
సాయీబాబా:- అన్నిటను మఱి సర్వత్ర నధివసింతు
పృథివి, విశ్వమందెల్లెడ వెలసియుందు.

* * * * * * *

౬ అప్పా కులకర్ణిపైన నొక నేర మారోపింపఁబడెను. అతఁడు బాబాను ఆశ్రయించఁగా

సాయీబాబా:- ఆ పరబ్రహ్మ 'అల్లా' సరూపుఁడై, ♦ ని
వాస- * మోహినీరాజుగ వసుధఁ బొలిచె
పొమ్ము;- ఆ దైవమును జేరి మ్రొక్కు లిడుము
స్వీయ భక్తజనాళి రక్షించు పెంపె
నెల్లమహిమలఁ బ్రకటించు నీశ్వరుండు.

బాబా ఆజ్ఞానుసారము మోహినీ రాజును సేవించి డిప్యూటీ కలెక్టరు ఎదుట హాజరయ్యెను. ఆ మోపఁబడిన నేరము కొట్టివేయఁబడెను.

అప్ప కులకర్ణి - సాయి యాజ్ఞానుసరణి
సలిపి రాజదండన తప్పి, సాయిఁగాంచి
బాబ! నీ యనుగ్రహమున బ్రతికినాఁడ
ననిన;- దైవంబు నీకు సహాయపడియె
అప్ప! ప్రభునకు లేదసాధ్యమని యెఱుఁగు!

* * * * * * *

♦ పురము పేరు. * శివావతారము.



## బాబా - ఈశ్వరుని ఉపకరణము.

భగవాను ననుమతిఁ బడయనిదే యెట్టి
కృతినేని నేఁ బొనరింపఁజాల
'తుప్పి' నేనిడనని కోపింపఁగాఁబోకు
దేవుఁ డీయఁగ సమ్మతింపఁడయ్యె;
'ఇమ్ము దక్షిణ' యని యెల్లర నడుగుడు
నా? యీశ్వరుఁడుమాపు నతనిఁదక్క;
దారిలో నెదురగు దైవముగా గనఁ బోని
వాని కెవ్విధి సాయపడఁ గలాఁడ?
ఏనుగావింప నేదియు - గ్రహింప నేదియు
దత్త గుమనకు దత్తపౌ విత్త మిపుడు
ద్వారకామాయికిని సమర్పణము సేసె
భగవ దుపకరణముగఁ జేపట్టినాఁడ.

---

## బాబా - ఫలదాత

మంచికార్యములఁ గావించి యవ్వాని స
ర్వేశ్వరార్పణముఁ గావింతురేని
మేలు చేకూరును మీకు నెల్లప్పుడు;
కృతివెంట ఫలితము కెరలుచుండు;
కుజనులు సుజనులుఁ గోరుచుందురు తమ
కును మేలుపొనరింపు మనుచు నన్ను

మంచిపనుల్ పొనరించఁగాఁ బోవని
వాని కెవ్వఁడు మంచి ఫలమునిత్తు?
పుణ్యఫలముఁ గోరఁ బూనుదురే కాని,
పుణ్య మాచరింపఁబోరు జనులు;
పాప ఫలముఁ బడయనోప రెవ్వారలుఁ
బాపముల నొనర్ప వలతు రెల్ల!

---

## బాబా స్వభావము

దైవమునకును నాకు భేదంబులేదు;
నను నిరాకార సచ్చిదానంద మయుని
గా భజింపుఁ, డవ్విధిఁ గొల్వఁగాద యేని
నిట్టి సగుణుఁడౌ 'సాయి' భజించ రండు!

ఇంద్రియోపేతమౌ దేహ మేనుగాను
సకల విశ్వంబునకు నేను సాక్షినగుదు.
నేను దేనినిఁ జేయను దేనిఁ గొనను
ఇందు విలయమొందునది నాకెదియు లేదు.

§ ఒక సమయమున ధుని ముందు గూర్చున్న బాబా తటాలున తనచేతిని అగ్నిలోనికిఁ జొనిపెను. (ఎక్కడో నిప్పులోఁ పడిన ఒక కమ్మరివాని బిడ్డను బాబా రక్షించిన ఘట్టము) చేయి కాలెను. ప్రక్కన జూచుచున్న 'డాక్టరు' అను నొకభక్తుఁడు, బాబా ఇట్లు సంభాషించిరి.

భక్తుఁడు:- కాలె నీ చేయి, నను గట్టుఁగట్టనిమ్ము,
ఎంత బాధించుచున్నదో! ఏమొ? బాబ!
సా. బా:- ఇట్టి దేహముఁ జితిపైనఁబెట్టి కాల్ప
వేడుకగఁ జూచుచుందు నో బిడ్డ! నేను.

---

## ఆ త్మ వి చా ర ము

నే నెట్టివాఁడ నెవఁడనొ
మానసమునఁ దలఁపు, శ్రవణ మననంబుల స
త్యానంద మయుఁడనౌ నట
గానంగల వీవు - వేఱుగతి లేదుసుమీ!

మన మెవర మెట్టివారమొ?
యెనయగ నీ "నేను - నీవు"- నెందుందుమొ! నీ
మనమునఁ దలపోసెదవేని
గనెదవు 'నీ-నా యభేదగతి'- నొగి,బిడ్డా!

---

## భే ద ము - అ స త్య ము.

పగతుఁడని యెవ్వరినిఁ గూర్చి పలుకరాదు;
ఎవ్వఁడెవనికి శాత్రవుఁ?; డెన్నఁడేని
ఎవనిపై నే నసూయ వహింపఁదగదు;
సకల 'మేకం, బభేదంబు-సమము', బిడ్డ!

నాది యిది - యిది యియ్యది నీదియనుచు,
జనము లన్యోన్య భేదముల్ గనుచు నుంద్రు;
ఇది యసత్యంబు, భ్రాంతి; నే నెల్లగతుల
నుందు నీయందు, నీవు నాయందు నుందు.

నిన్ను నన్ను వేర్పఱచుచు నున్న దీని-
యవనికను- దొలంగించిన యా క్షణంబ
యొండొరులము ముఖాముఖి నొకట నిలచి
పొందుఁగాఁ గాంచి యానందమొందఁ గలము.

సాధుజనము లీ భేదంపు సరణిఁ గనరు;
తలఁగఁజేయు మీ విట్టి భేదంబు నన్ను
భజనఁ జేయఁగ నిచ్చించు వాఁడవేనిఁ;
దలఁపుమెప్పు డివ్విధిని - యథార్థంబుఁ దోఁచు.
అరయు మేక మేవాఽద్వితీయమ్ము బ్రహ్మ
మనెడి వేద వేదాంత శాస్త్రములు.

---

## నే నెవఁడను - మే మెవరము.

§ R. A. తర్ఖాడ్ — ఒక ఫ్యాక్టరీ మేనేజింగు డైరెక్టరు - మన్మాడ్ స్టేషన్‌లో ఒక రైలుపెట్టెలో నెక్కి పోలీస్ కాన్‌స్టేబిల్‌తో స్థలముకొఱకై తగవులాడెను. శిర్డి చేరి బాబాను సందర్శించెను. బాబా బోధించినపరమార్థము:

సా. బా:- ఎవరితో పొద్దుటను గలహించుచుంటి?
అన్న! వారలతోఁ గలహంబు లెప్పు
డేనిఁ గాని యుక్తముగాద; యెల్లవేళ
లందు "నెవరము మే" మని యరయనగును.

స్వ పర భేదబుద్ధిని భిన్న భావమొంది
తగవులాడుట చేటిది-తగదు- తగదు.
సకల జీవములకు బరేశ్వరుఁడు గలఁడు;
ఈశ్వరునియందు జీవంబులెల్ల పాలుచు.

---

## సంసారము - మోక్షమార్గము

§ N. C. చందోర్కర్. ఒకయొక శ్రీ సాయీ ప్రభునకు వినయమున మ్రొక్కి యీ విధముగఁ బ్రార్థించెను.

చందో:- సాయి! సంసార మిద్ది నిస్సారమగును
శాస్త్రములు పల్కునటుల; నా సంసరణము
బంధములను దప్పింపవే! బాబ! కృపను.
*　*　*　*　*　*　*
మొదట సుఖమునై, దుఃఖమై పిదపఁ దోఁచు;
త్రిప్పటలు గూర్చెడిని విధి యప్పుడపుడు,
సౌఖ్య మదిలేశమేనిఁ గాంచంగఁజాల
విసువు జనియించె, నాకిది వెగటు గూర్చె.

సా.బా:-బాపురే! యెట్టి విభ్రమవాక్కు లివ్వి!
కాని, సత్య మొకించుక కానిపించు
నన్నృత సంకలితంబునై; కనుమి నాన!
వపువు గలదాక సంస్కృతిబంధ మొదవుఁ,
దలఁగఁజేయ నెవ్వరికి సాధ్యంబుగాదు.

నీకెటుల లభ్యమగు? నిట్టి నేనుగూడఁ
జిక్కికొని యుంటి;- సంసృతి పెక్కుగతులు
మేని యుపరిభాగము నట్లు గానుపించు
సంసరణ కామ కోపాది సంకలితము;
మతి తనూపరివృత్తులను సంసృతిగఁ గనుము.
రెండు వస్తువుల్ చేర సంసృతియె సుమ్మి!
అడవికేగిన సంసృతిఁ విడఁగలేవు
ఇట్టి నీ స్థితిఁ నీవ కల్పించుకొంటి
విట్టి దీనినిఁ గోపింప నేమి ఫలము?
ప్రాక్కృతఫలంబు, తనువు ప్రారబ్ధ మిదియు;
కలిగెఁ దనువు, జీవుఁడుచేరెఁ గర్మ మూన.

* * * * * * *

కాన, నీ వట్టి ప్రారబ్ధ కర్మఫలము
ననుభవింపక దీనిఁ ద్రోయంగ లేవు;
వివిధ జీవచయంబు వే విధులఁ దోఁచు;
వాని వాని ప్రారబ్ధ కర్మానుసరణి;
అకతన భేద మెల్లెడ వ్యక్తమగును.
ధనికు శునకము పరుపుపైఁ దనువువ్రాల్చు;
పఱచు రొట్టెముక్కకు పేదవాని కుక్క;
అరయు మిది తనూ ప్రారబ్ధమనుచు బిడ్డ!



# సత్యసుఖము

నానా. చందా:- సంసరణ సుఖ దుఃఖముల్ జనుని వేచు
సంస్కృతిఁ ద్యజింప మేల్గాదె? సాయినాథ!

సా. బా:- సంతోష దుఃఖముల్ సకలంబుభ్రాంతి, యు
సత్య మీ తోఁచు సంసార విధము
ప్రాకృత మనుజుఁడు బలిమి నాకర్షింపఁ
బడు సత్యమని తలంచెడిని గాన,
ప్రారబ్ధ ఫలముగఁ బరమాన్న మొకఁడొందు
నంబలి యొకనికిఁ బ్రాప్తమగును;
మొదటివాఁడు సమస్త మొదవినట్లెంచును
రెండవవాఁడు దారిద్ర్యమనును;

రెంటి ఫలము లీ యాకలి తృప్తియగును;
తాల్చు జలతారు పట్టు వస్త్రము లొకండు
వల్కలంబులు ధరియించువాఁ డొకండు;
పాసఁగ దనువుఁ గప్పుటయ యిర్వురఫలంబు.

ఇది సౌఖ్యం బిది దుఃఖమంచనెడి నా యీ ద్వంద్వభావంబు లిందొదవున్ గేవల భ్రాంతిమూలమయి, నిన్ దూలించు; నద్దాన నీయెద ద్వంద్వంబులు దోఁచినంతన మనోవృత్తిన్ నిరోధించి యేయదనున్ దానికిఁదావొసంగకుమి! నానా! భ్రాంతిసుమ్మింతయున్.

అరిషడ్వర్గము భ్రాంతి మూలము; యసత్యంబెల్ల సత్యంబు నా స్ఫురణఁగూర్చు నుః భాగ్యవంతువసనంబుల్ భూషలఁగాంచి, మోహరతిఁ బేద యసూయ నీసుఁగనుఁ, దా నాసించు నవ్వాని, దుర్భర లోభంబిది; యిట్లు తక్కు రిపులుఁ బాధించునిన్నెప్పుడున్

నిను గారించెడి శత్రులార్వుర నొగిఁ నిర్జింతువేఁ మానసంబున సంకల్ప తరంగ సంతతి లయంబుఁ గాంచు; నిర్జింప నోపనిచో వానికి బానిసీఁడగుదు; నీ స్వాంతంబునం బీ విచక్షణఁగన్నఁ భ్రమ జాతమైన సుఖ దుఃఖాదుల్ ప్రధావించెడిఁ.

---

## సత్యానందము

సత్యమైన సుఖంబు మోక్షంబ యగును;
వ్యసనము జనన మరణ రూపమగు భవము.
జగతి సంసార సుఖ దుఃఖసంచయంబ
సత్యమును గేవల భ్రాంతి జాతమగును.



# సంసారమునఁ బ్రవర్తింపనగు విధము

విను, సంసారమునందు నీ కుచితమౌ వృత్తంబు వాక్రుత్తు; స జ్జనముల్ ప్రాగ్భవలబ్ధ భాగ్యములతో సంతృప్తి సంతోషముల్ గనఁగానేర్తు, రసాధ్యసాధనకునై కాంక్షింపఁగాఁబోరు, లే దని ఖేదంపడ, రున్న నుబ్బరు పరేశాధీన చేతస్కులై.

కలిమి గలిగిన నమ్రతఁ గనుట మేలు
ఫల భరంబునఁ దరువులు వంగకున్నె?
కుజనములయెడ నమ్రత కూడదెపుడు;
సాదుల గణింపు, మఱఁగి సమాదరింపు.

దాన ధర్మార్థములకు విత్తము వ్యయింపు;
కాని, మితి మీఱి వెచ్చింపఁగాదు నీకు;
అశ్వరమ విశ్వ; మందాక యర్థమవస
రంబు; య్యైన - లోభంబు మోహంబుఁ దగదు.

జగతి నీ నియమిత సకల కర్మంబులఁ
బొనరింపు సంతోష బుద్ధిగలిగి,
పరమేశు నెప్పుడు మఱవంగఁబోకుము,
స్మరియింపు మీ పరేశ్వరుని సతము,
"సంసారమిద్ది. యీశ్వరునిద - నాది కా"
దని యెంచు మెలఁకువ దనరు దనుక,

పేదల దీనులఁ జీవరింపక నీ యు
ఘా శక్తి వారి కాధారమగును,
స్వాభిమానము స్వాత్మ ప్రశంసలుడుగు
మితర నిందలఁబలుక నాలింపఁ దగదు;
అనవరతము "నే నెవ్వఁడ"- నని విచార
మేమఱక సల్పు మిదియె సంసృతికిముక్తి.

* * * * * *

# భక్తి

## నవవిధభక్తి

అనంతరామ పటణ్కర్:-

చదివితిని పెక్కు శాస్త్రముల్ సాయినాథ!
కాని, చిత్తోపశాంతినిఁ గాంచఁజాల;
లోక వృత్తంబులఁ దగుల్కొనియె మనసు;
శరణుఁజొచ్చిన యీ దీనుఁ గరుణఁ గనవె!

సా.బా:-కలఁడు వైశ్య వంశీయుఁ డొకండు తొల్లి;
ఒకదినము నావుదూఁడ పెంటికలు వేసెఁ
దొమ్మి, దవ్వాని వాఁడు వస్త్రమ్మునందుఁ
బట్టికొనిపోయి శోధించెఁ, దుట్టతుదకు
శాంతి నానందమును బొంది సంతసించె!

క. అంతట గ్రహింపలేక యనంతరాముఁ
డేకతమున కేల్కారు నీక్షించి పలికె
"ఏమి? దాద! యెఱుంగ, సాయిప్రభుండు
పలుకు దాని భావంబుఁ జెప్పఁగదె!"-యనిన.

కేల్కారు:-వత్సరం బిందు వెలయు నీశ్వరుని కరుణ,
పెంటికలు తొమ్మిదియు నవ విధములైన
భక్తి; యియ్యెడ నీవ యావర్తుఁడవు
వాని గడియింతువేని శాంతిఁ బడయఁగలవు.

(కొంతసేపైన పిదప ననంతరాము
సాయి దఱిఁజేర ప్రభుఘనుల ప్రశ్నంబు సేసె)

సా.బా:-ఏమి పటనకర్! వెదకి గడించినావె,
పెంటికలు నిప్పుడా తొమ్మిదింటి నీవు?
అనం:-పరమగురు! దానికైన నీ 'కరుణ' వలయు;
సా.బా:-ఈశ్వరుఁడు వైళమ యనుగ్రహించు నిన్ను!

---

## జ్ఞానము - భక్తి

కనుమి 'రామఫలంబ' ని జ్ఞాన పథము,
మహిని, 'సీతాఫలము' భక్తిమార్గ మరయ;
తొలిఫలము గుజ్జుఁగొన శ్రమ సలుపవలయు,
మలిఫలము దిన సులభము మధుర తరము.

రామఫలము పండఁగవలె, రాలనీక
త్రుంచవలెఁ, గ్రిందఁబడిన భక్షించఁ దగదు.
కలదు పతన భయం బెట్టి జ్ఞానికేనిఁ,
గనక యేమఱి కూలెనేని - జ్ఞాని చెడును.

---

## ఆత్మవిచారము. జ్ఞానము.

భక్తుఁడు (ప్రశ్న):- ఎవ్వఁడవు నీవు? శ్రీ సాయి! యెందుఁగలవు?

సా.బా(సమాధానము):-నిర్గుణుఁడ, నిరామయుఁడను - నెలవులేదు,
సగుణదృష్టిని నీ చూచు 'సాయి - నేను'
కర్మ గతిఁ జేసి తాల్చిన కాయ మిదియ;
తెలియుమీ నాదు నామంబు దేహియనుచు.
సకలవిశ్వంబు నా నివాస స్థలంబు,
తండ్రి బ్రహ్మంబు, మాయ నా తల్లిసుమ్ము!
వారికూటమిన్ నా కిట్టి వపువుగలిగె.
అఖిల విశ్వంబు పరివర్త మస్థిరంబు.

* * * * * * *

సా. బా:- (బాలభావ్ - సీతారామదేవ్‌తో)

నిగమగిరి గుహాంతరముల నెమకనేల?
సావధాన చిత్తుండవై యాలకింపు;
ఎఱుఁగు మీ వెవ్వఁడవొ - పరీక్షించికొనుము!
దాన - సకలమెఱుంగఁగఁ దగదు బిడ్డ!

1917 అక్టోబరు- బొంబాయినుండి ఒక దంపతులు వచ్చి బాబాను దర్శించిరి.

(కాంతతో)

సా.బా:- అమ్మ! నీకేమి వలయునో యడుగు మిపుడు.

బొం.కాంత:-జనన మరణ బాధలఁ బాపు - సాయినాథ!

సాయిబాబా [నవ్వుచు]:-

ఈవు కాంక్షించు నది యెల్ల నిదియ యేమి?
మరణ మొందఁగ నిచటకుఁ దలఁచినావ?

బొం.కాంత [ఆశ్చర్యమున]:-

ఈవు పల్కినదేమియొ యెఱుఁగ - బాబ!

సా.బా:- ఎవ్వరవొ నీ వొకింత యోచించుకొనుము!

బొం.కాంత:-ఏను మూఢ - నీపల్కు గ్రహింపఁజాల.

సాయిబాబా:-[భర్తను చూచుచు]

ఈతఁ డీ నాదు బోధంబు నెఱుక పఱచు.

[భార్యా భర్త లిరువురు విడిదిఁ జేరిరి. భార్య ప్రశ్నింప భర్త తెలిపినవిధము]

భర్త:- సాయినాథుని పలుకు లాశ్చర్యకరము
లిదియ - యనుచును నే నిర్ణయింపఁజాల,
నైన, బాబా యభిప్రాయ మేను గంటి.
"ఆ పరాత్మ" సాక్షాత్కృతినందు దనుకఁ
గాంచుచుండును రాక పోకలను జీవి;
జగతిఁ బ్రత్యక్ష దైవంబు సాయి విభుఁడు;
జనులు చూచియుఁ, బలికియు, వినియు నెఱుఁగఁ
జాల రక్కట! దైవంబు సాయి యనుచు;
కాన, వారు విముక్తినిఁ గాంచలేరు.

ఎఱుఁగనగును జీవేశ్వరు లేకమనుచు;
సకల నిగమాంత సిద్ధాంత సారమిదియ,
ఈవు జీవినటంచు భావింతు కాదె?

భార్య:- నిశ్చయంబు - ప్రాణేశ్వరా! నిశ్చయంబు.

భర్త:- ఎల్ల వేద శాస్త్రములు - సాయివిభుండు
ఈశ్వరుఁడ వీ వనుచు విశ్వసింపుమందుర్రీ.

భార్య:- కా దదెన్నటి కే నట్లు కాదు. కాదు.
ఏను మిక్కిలి పాపిని, హీన నగుదు.
జీవినే కాని పరుఁడైన శివుఁడఁ గాను.

భర్త:- నిజమ నీమాట;- యదియెల్ల నీ తలంప;
కాని, సంతతం "బీశ్వరుండే" నటంచు
ధ్యాన నిష్ఠను గనిన య జ్ఞానమెల్లఁ
దలఁగి, జీవాత్మ బుద్ధియు విలయమొందు.
పెక్కు జన్మంబులెత్తిన పిదపఁ, బరమ
సాధు గురు వర కరుణాప్రసాద గరిమ
'బ్రహ్మ మేన' యంచును దృఢభావ మొదవు
సాయిదేవ ప్రబోధంబు సారమిది, య
టంచు నా బుద్ధియందు గ్రహించినాఁడ.

* * * * * * *

[ద్వారకామాయిఁ జేరి రా దంపతులును.
అపుడు బొంబాయి కాంతతో ననియె సాయి.]

సా.బా:- అమ్మ! నీభర్త పలుకు బోధమ్మదెల్ల
నేను చక్కగ వినినాఁడ నిచటనుండి
దాని భద్రంబుసేయుమి మానసమున!

# దైవమెవరు?

నానా. చందో:- [ప్రశ్న]

దైవ మెవ్వఁడు? మఱియు నా దైవ మెవ్వి
ధమున నుండు? నా దైవము స్థానమేది?
దైవమును జూడఁగలుగు విధాన మేది?
సదయ మతినెఱింగింపవే! సాయిదేవ!

(సాయిబాబ - "మఱియొక సమయమునఁ దెలిపెదను. ప్రస్తుతము స్థిమిత పడియుండుము". అనిచెప్పి, వేఱొక నాఁడొక సమయమున నానాసాహెబ్ చందోర్కరుతో)

సా.బా:-బద్ధులై లోకజనములు బుద్ధి నెఱుఁగ
రీశు, సత్య మసత్యం బదేమొ కనరు;
గుణము దోషము భేదంబుఁ గనఁగలేరు,
నైతిక పరివర్తనము సుంతయును గనరు.

లౌకిక ప్రవృత్తుల లోఁగి, లక్ష్యమేది,
శాస్త్రముల, సాధులందు విశ్వాస మెడలి,
కల్మషాత్ములై, దైవముఁ గానలేక
నరకబాధ లొందెదరు జనంబు లకట!

తగ 'ముముక్షువు' లా బద్ధ దశను ద్రోసి
సద్విచార వివేక విస్తారులగుచు,
వాసుదేవు దర్శింపఁ బిపాస వడసి,
భాగవత నిష్ఠ నైతిక పథిఁ జరింతురి.

సాధకులు వారు; విషయముల్ సంత్యజించి
యింద్రియముల నేర్పున నిగ్రహించి, సాధు
లైన యోగివర్యులను సమాశ్రయించి
యభ్యసింతురు సాధనల - జపాదికముల.
అటుల సాధనఁ బరిపూర్ణు లైనవారు
సిద్ధులని చెప్పఁబడుదు, రాస్థితినిఁగనిన,
దైవమని నరుండని విభేదంబులేదు.
స్తుతియు నిందయుఁ దోఁచును దుల్యములుగ.
పూర్ణకాముఁడై కోరికల్ పొందఁబోఁడు;
దేహ మిదినాది, నేనని - మోహికాఁడు;
ఆత్మ సర్వాత్మయందు నైక్యతను బడయు
"బ్రహ్మమే - నే" ననెడి స్వానుభవముఁ గాంచు.
సాధకులు వేఱు వేఱు కక్ష్యలను, వారి
వారి సాధనాభ్యాసాను సారముగను
దైవము నెఱుంగుచుందు; రంత్యంబునందుఁ
జేతనాఽచేత నాంత ర్వ్యాశిష్టుఁడైన
వాసుదేవునిఁగని తుష్టి వడయఁగలరు.

* * * * * *

దైవ మెల్లెడనుండు - నా దైవ మిందు
లేని స్థానమెయ్యెడ నేని లేదు;- కాని
సర్వ సంవర్తి యైన 'ఈశ్వరు' నిఁ దెలియ
నీని మాయా ప్రభావంబు నెఱుఁగు మీవు!
అట్టి దైవాంశ మేను, నీ, వఖిలజగము

కాన - నితరములఁ ద్వేషింపఁ గాదు నీకు;
దైవమొక్కఁడె గలఁడను తలఁపు విడకు

*   *   *   *   *   *   *

ప్రేమ దైవంబు - దైవమే ప్రేమ సుమ్ము!
అది యనుభవంబునొంద సకలంబుఁ బ్రాప్తమగును.

---

భక్తుఁడు:- దైవమును గాంచు విధి సాయిదేవ! చెప్పుము!

సా.బా:- మనసు సతతంబుఁ జలనంబుఁ గనుచునుండు
దాని నియమించి నిలుపు యత్నంబు వలయు;
వస్తు సంచయములపైన వ్రాలు నీఁగ
అనలమును గన - వే - దూరమునకుఁ బోవు.

అటుల మనసును కల విషయాళిఁ దలఁచుఁ,
బఱచు వానికై, పొందును వాని, వాని
యందు లీనంబునొందు; బ్రహ్మంబుఁ గూర్చి
తలఁచు మాత్రన - అది దవ్వు దవ్వు లేగు!

ఆ మనంబు దైవమున లయంబుఁ గాని
యంతదనుక నీ సంసృతి యడఁగఁబోదు;
జనన మరణము లనివార్యమనుచుఁ గనుమి!
మనుజ జన్మ దుర్లభము జన్మంబు లందు!

సా.బా:- మనసు నిగ్రహింపఁగఁ దగు మార్గమిదియు.

మూర్తి పూజల సలుపుము మొదట నీవు;
మనసు నిలుపఁగ దైవ పూజనము వలయు;
ప్రతిమ యేనియు నా పరేశ్వరుఁడు సుమ్ము!
దైవ ప్రతిమలందున నిరాదరణ వలదు.

అధిక భక్తిఁజేయుడు విగ్రహార్చనముల
మనసు క్రమముగ 'నేకాగ్రత' ను వహించు;
నిది యొనరదేని మది నిగ్రహింప రాదు.

*　*　*　*　*　*　*

'మననము' ను 'ధ్యాన' మభ్యసింపంగఁ దగును,
పిదప, సద్గ్రంథముల నొగిఁ జదువ నగును;
ఆచరింప నౌ తత్త్వబోధాను సరణి;
విద్యలన్నిట నీ 'ఆత్మ విద్య', ఘనము;
దానిఁబడసిన ముక్తి హస్తామలకము,
ఆ సగుణుఁడైన హరియె నిన్ననుసరించు.

*　*　*　*　*　*　*

ఆత్మ విద్యయు - మోక్షంబు - నందఁజేయు
'సాధన చతుష్టయంబు'- ప్రశస్త సరణి.

## మోక్షమార్గము. (మోక్షము పొందు విధము)

సాధన చతుష్టయము నవస్యము గడింప
వలయు మోక్షమపేక్షించు భాగ్యతముండు.

సాధన చతుష్టయము:—
సద్వివేక వైరాగ్యముల్, శమదమాది
షట్కమును, ముముక్షుత్వము - సాధనములు.

నవవిధ భక్తి:—
దైవమునుగూర్చి శ్రవణ కీర్తనలు - స్మరణ
పాదసేవనార్చనములు - వందనంబు.
దాస్య సఖ్యముల్ మఱియు నాత్మార్పణంబు
ననెడి నవవిధ భక్తి సాధనలు వలయు.

* * * * * * *

అనుదినము సాధు వరుల సమాశ్రయించి
నైతిక పథంబునఁ జీవనంబు నెఱప
మరణ సమయమందీవు నిర్మలతఁ గనెదు.
మరణవేళ నే కోర్కెల దఱియనీకు
మిష్టదైవంబు నందు నీ హృదిని నిలుపు;
ఇష్ట దైవంబు నందున హృది లయించు
నపుడు తనువు వీడిన 'మోక్ష' మందఁగలవు.

## దైవమును పొందు మార్గము

నా. చం:- సాయినాథ! సం ప్రశ్నము సేయుచున్న
వాఁడ. మూఁడవమాఱు, నీవాఁడఁ జెపుమ!
దైవ మెవ? (డాతఁ)డెట్లుండు? దైవముండు
స్థానమేదియో విశదంబు సలుపఁగదవె!

సా. బా:- ఆ విషయమెల్లఁ దెలిపితినయ్య! మున్నె.
ఏను బలికిన విధి నాచరింతువేని
సాధన చతుష్టయము నీకు సాధ్యమగును.

నా. చం:- సాధనము లేవియో సాయినాథ! చెపుమ!

---

## 1. వివేకము

సా. బా:- పఱగ నిత్యానిత్య వస్తు వివేకము
తొలిసాధనంబని తెలియుమీవు.
నమ్మించు చుందురి కొందఱు, జనంబుల "వివే
కులము తా" మని సుంతఁ గొంకులేక,
హరి యెవఁ డెటనుండు నని యెఱుంగకయె "వా
ర్కారు"§ లై తీర్థయాత్రలఁ బొనర్తు.
"భక్తి" కా దిట్టిప్రవర్తనల్ జన గౌర
వము పొందఁజాలు నుపాయమగును.

§ పాండురంగ పూజారులలో నొక తెగ- (హరిదాసులు)

భావ సంశుద్ధి లేక సభా ముఖమున
దంభమున కేవొ విద్యా ప్రదర్శనములు
సలిపి, ప్రత్యర్థులను గెల్వఁ దలఁచువారు
కనఁగలేరు బ్రహ్మము వివేకంబులేమి.

## 2. వైరాగ్యము

ఇహము నందును బరమందు నెదియునేని
కాంక్ష సేయకుంటయె విరాగమనఁ జెల్లు.

*  *  *  *  *  *  *

విధి విధానమెవ్వరికిఁ దప్పింపరాదు.
కలుగ నున్నవి యెటులేనిఁ గాకపోవు.
ధనము భోగ భాగ్యములు బాంధవ నికాయ
మస్థిరంబును మిగుల భయావహంబు
సర్వసంగ వర్జనమె మోక్షమును గూర్చు.

## 3. శమము - దమము - వెంబడిగునవి

ఇంద్రియార్థము లందు వర్తించనీక
మనసు నిగ్రహించుటయె "శమంబు" సుమ్మి!

*  *  *  *  *  *  *

అంచితమ్ము నంతర్ముఖమైన మాన
సంబు వెలికిఁ బోనీమి "దమంబు" నూవె!

*  *  *  *  *  *  *

పానరఁ బ్రారబ్ధకర్మ సంజనిత మైన
ఫలము మంచి చెడ్డలఁగూర్చి తలఁపఁబోక
స్థితమతినిఁ బొందుచుంట "తితిక్ష" యగును.

* * * * * * *

ధనము సతులును సుతులు నేస్తంబులాది
సకల మిం దసత్యములని చక్క నెఱిఁగి
మాయఁ ద్రోయుచే "యుపరతి" యై యెలర్చు.

* * * * * * *

ఆత్మ విశ్వాసమే "శ్రద్ధ" యనఁగఁ బఱగు

* * * * * * *

నిశ్చల మనంబునఁ శాంతి నిష్ఠఁబూని
ద్వంద్వముల సహించుట "సమాధాన" మగును

## 4. ముముక్షుత్వము

మోక్షము:- అది యెట్టిది? దానిని పొందుట యెట్లు?

సౌఖ్య దుఃఖాదులను విసర్జనము సేసి
ఉన్నతా పరోక్ష జ్ఞాన మొకఁడె సాధ
నం బనన్యమార్గం బంచు నమ్మి మదిని,
మోక్షమునఁ గాంక్షఁగనుట "ముముక్షుకత" యు

* * * * * * * *

నాక కైలాస వైకుంఠ లోకములను
మోక్షమను పేర వచియింపఁ బోలదెందు.
స్థూల మది కాదు;- మిక్కిలి సూక్ష్మమగును.

అఖిల విశ్వంబునం దదృశ్యంబు నౌ ని
దాన సత్ జ్ఞాన శుద్ధ చైతన్య మరయ.
అట్టి స్థితినిఁ బొందుటయె, మోక్షాఖ్యఁ బొలుచు.
అదియె "అమృతత్వ" మను పేర విదితమగును.
అదియె మానవ గమ్యంబు నై తనర్చు.
అన్యవిధము లాశయములు వ్యర్థములగు.

*    *    *    *    *    *    *

నానా-ఛందో:- శుద్ధ చైతన్యమన నేమి? యుద్ధచరిత!

సా. బా:- అఖిల విశ్వమునకు నది నిదానము, తదం
తర్గతసార మాధార మగును;
సృజనపోషణ లయస్థితుల కేక పదంబు,
వేద్య మవేద్యమై వెలయుచుండు.
'శుద్ధ చైతన్యంబు'- చెప్పిది- యని పల్క
నలవి కాదు; ప్రతిక్షణంబు నీదు
మనికి నా వస్తువు ద్యోతక మగుచుండు;
నామ రూపము లే దనామయంబు,

తెలియరానిది; యునికి సందియము లేదు;
బ్రహ్మమను పేర వ్యవహరింపంగఁబడును;
బ్రహ్మము నెఱుంగు జ్ఞానులు బ్రహ్మవిదులు,
అఖిలమౌ చరాచరము బ్రహ్మమునఁ బొలుచు.

కనఁగఁ, దాకఁ, దెలియు, మూలకారణం, బ
నేకములకు నియ్యదియ యేకైక మూల,
మన్నిటను బొల్చునదియ, యివన్ని యదియు,
సచ్చిదానంద, మేకము, సకల మదియు.

నానా—చందోర్కర్:—

ఆనందైక రసపరిపూరితము బ్రహ్మంబంటి; దుఃఖంబుఁ గా
నీ, నానాత్వముగాని లేదనెద, వా యేకంబు విశ్వంబునన్
నానా భూతచయంబులన్ బొలిచి వంతల్ బాధలన్‌బొందుటల్
గానంగాఁబడు; నెట్లుపోలు నిది? వక్కాణింపు, సాయిప్రభూ!

ఏక మెబ్భంగి ననేకమై పొడచూపు?
సత్యవస్తు వదెట్లసత్య మగును?
ప్రతిజీవి చైతన్యవస్తువే యైన, బ్ర
హ్మంబు లనేకంబు లగునుగాదె?
అందఱ మొక్క బ్రహ్మంబ యానందువే
నొకరి బాధల నందఱొందవలదె?
ఎవనిమోదము వాఁడె, యెవనిఖేదము వాఁడె
పొందునట్టుల జగంబునను దోఁచు.

కలవు 'కోటానకోట్లు' జీవులు జగాన,
కాయములు వివిధంబులై కాలునటుల
ఆత్మలును బహువిధములై యలరవలదె?
సందియంబు వారింపవే! సాయినాథ!

సా.జా:- పొరపడితివి బిడ్డ! పరికింపు; రంగులు
పసు పెర్పు నల్పాకు పచ్చలాది
కలవు; నీరంబులఁ గలుపుము - వేర్వేరు
రంగు లుండినను నీరం బదొకటె;
రంగు వేర్పఱుప నీరంబు స్వచ్ఛంబయౌ;
నటు పలురంగుల యంబు లమరు.
ఆత్మ యేకం- బాత్మ- యధివసించెడి హృద
యంబులు పెక్కు విధంబులగును.
అఖిల హృదయస్థితం బైన యాత్మ యొకటె;
మోద ఖేదంబు లాత్మ కెప్పుడునులేవు.
హృదయ పరి కల్పితంబులై యెసఁగు నివియు;
ఆత్మ సన్నిధిజ హృది హృదయత్వమొందు.
త్రిగుణంబు లందుండి దీపించు నీ శుద్ధ
చైతన్యము త్రివిధ సత్య సంజ్ఞ,
పారమార్థిక మన, వ్యావహారిక మన
ప్రాతిభాసిక మనఁ బఱగుచుండు.
బాల్యము యవ్వన వార్ధక్యములు దేహ
మునఁ బోలె సత్యము ముత్త్రివిధములు;
పారమార్థిక సత్యపథగామి యగు యోగి
విధ్యుక్తముల యథావిధిఁ బొనర్చు,
సత్యము నెఱుంగు, భేదంపుసరణిఁ గనఁడు:
వ్యావహారిక సత్య పథానువర్తి
సజ్జనుఁడు; శాస్త్రసరణిఁ దాఁ జనుచుఁ, బ్రతిప
దమున మంచినిఁగొని చెడ్డ దవులఁ ద్రోయు.

ప్రాతిభాసిక సత్యమార్గమున వాఁడు
మూఢుఁ డెఱుఁగఁడు సత్యంబు పూర్ణముగను.
మంచి చెడు భేద దృష్టినేఁ గాంచఁబోవఁ
డెంచు మంచి చెడ్డగ చెడు మంచి కాఁగ.

బ్రహ్మము సమంబ యీ మూఁడుపథములందు,
రాజు, రాజ ప్రతినిధియు, రాజ దూత
లందు రాజత్వ మది సమమైన యటులఁ,
బలుగతులఁ దోఁచు జీవులఁ బ్రహ్మ మొకటి.

నా. చం:- సార్వభౌమత్వ మెటు విభాజ్యమగు? సాయి!
అదియు? యేకంబు న విభజ్య మగునుగాదె!

సా. బా:- సత్యంబు నీ పల్కు; సార్వభౌమత్వ మే
కంబవిభేదనీయంబు సుమ్మి!
రాజు- మాఱటరాజు- రాజదూతల యుదా
హరణలస్థితి విభేదాప్తిఁగనవె?
అటు శుద్ధచైతన్య మవిభక్తమును, పరి
వ్యాప్తమై, యేకమై, యలరుచున్న
జీవు లుపాధి విశేషంబుల కొలంది
చైతన్యమును బ్రకాశకముఁ జేయు;
అంతటను నిండియున్న యీ యాకసంబు
ఘటము, కుంభము, మఠమునఁగ్రాలి, యందు
పాధుల కొలంది లఘు గురు త్వములఁ దోఁచు
కరణి మాయచే నాత్మ వే గతులఁ దోఁచు.

సకల జగము మాయా విలాసంబు, బిడ్డ!
బ్రహ్మ మాయలకూటమి బ్రకట మొందు;
విశ్వమగు నజాండంబిది యశ్వరంబు;
సత్యమని విశ్వసించు నజ్ఞాని దీని.

*  *  *  *  *  *

నా.చం:-'మాయ' యన నేమి? యెవ్వరు
మాయను సృష్టించి? రేది మాయాకృతియో?
ఈ యెడ మూలము బ్రహ్మం
బే యగు నే నింక మాయ యెట పొడమెడినో?

---

## మాయ - వివరణము

సా.బా:-'మాయ' యనంగ నేమో? యది యెటుదోచు
నో?- విను- సావధానుండ వగుచు.
చైతన్య పరిపూర్ణ శక్తి విశ్వంబున
'మాయ' నా వ్యవహరింపంగఁ బడును.
ఏక చైతన్య మనేక రూపంబుల
మాయ- తాఁ గోచరింపంగఁ జేయు.
'రవి- ప్రభల్', 'గుడ- మధురత్వంబు' లటుల, 'చై
తన్య శక్తులు'- నభేద్యంబు లగును.
వేఱుపడు మాయ తొలఁగిన వేళయందు,
తొలఁగు 'మాయ' చైతన్యము తెలియఁబడిన;
ఆదిఁ గనము చైతన్య మాయలకు, నంత
మొనరు మాయకు;- చైతన్యమునకు లేదు.

మాయా చైతన్యము లా
మ్నాయములఁ బ్రకృతి పురుషులనఁబడుదురు, ని
త్యా యతి, §జ్ఞానేశ్వరి పా
రాయణమున బోధపడు పరాత్మ విధంబుఁ.

చైతన్యం బొక గుహయౌ
చైతన్య గుహఁ జొఱంగఁ జాలిన యాతం
డే తఱి వెలువడి రాఁబోఁ
డాతఁడు 'గుహ' యగును సచ్చిదానందగతిఁ.

కార్యయౌ మాయ- యక్క జమౌ గొనంబుల
వింత వింతలుగఁ గన్పింపఁజేయు;
"నే నిట్టివాఁడను నీ వట్టివాఁడవు;
అది వేఱు- ఇదివేఱు"- యని తలంపఁ
జేయునదే సుమీ! 'మాయ'; యక్కతమున
నీ విభేదంబులు మృషగఁ గనుము.
మాయకు లోఁగుదే నీ "యభేదబ్రహ్మ
వస్తువు"- గోచరింపంగఁ బోదు.
'ఆవరణము',- 'విక్షేపంబు',- నన ద్వివిధము
మాయ;- ఆత్మ, "నావరణము" మాటుపఱచు;
కల్పనా చమత్కృతిని నా కప్పుపైనఁ
దోఁపఁజేయు "విక్షేప" మా రోపితములు.

§ భగవద్గీతలకు మహారాష్ట్ర భాషలోని టీక, దైనను-
శంకరభాష్యమైనను జూడనగును.

భటుఁడు ప్రభుపైనయటుల స్వప్నంబుఁ గనుడు
భటు "భటుత్వముఁ" గప్పు 'నావరణశక్తి'
తొడుగుపైన విక్షేపము తోఁపఁజేయు
"ప్రభుత"- యిదియు నూ మాయా ప్రభావయుగును.

మాయచే బ్రహ్మ మవ్విధి మాటుపడును
ఛాదనోపరిస్థలిఁ బ్రపంచంబు దోఁచు;
'సత్య' మగు- బ్రహ్మ; మీ ప్రపంచంబు 'మిథ్య'
కాని, యీ సృష్టి సత్యంబుఁగాఁ దలంతు.

* * * * * * *

మోసమిది:- కాన, మాయను ద్రోసిపుచ్చి,
తిరిగి శుద్ధ చైతన్య సుస్థితినిఁ గనుము!;
మలినమెడల స్వచ్ఛంబైన జలము తోఁచు;
'మాయ' తొలఁగ సత్యమగు 'బ్రహ్మంబు' వెలయు.

* * * * * * * *

కలఁ డొకండె, స్వతంత్రుఁడౌ జ్ఞాత- ఆత్మ
నామ రూప విహీనుఁ డ నామయుండు.
కల దతనియందు మాయ- యీ కలలుఁగనుచు;
సాక్షి యతఁడె జీవిగను, విశ్వముగఁ, దోఁచు.

శ్రీ సాయీ కరుణా
ద్వితీయ లహరి
సమాప్తము.



ఓమ్

వేంకటేశాయనమః

శ్రీసాయీనాథాయనమః

# శ్రీ సాయీ కరుణ

## తృతీయ లహరి

## ఆత్మజ్ఞానాధికారి

### 1 గ్రహణశక్తి

ఒక దినమున బాబా భాండముల శుద్ధిచేసి బోరగిలఁ బెట్టుచుండెను. సాయీనాథునందు శ్రద్ధా భక్తులు లేని "గోపర్గాం స్టేషన్ మాస్టరు" "ఏమి యీపని?"- అని ప్రశ్నించెను. అంతట బాబా 'నన్ను చేరు ప్రతి భాండము క్రిందుముఖముగ వచ్చును'. (సద్విషయము గ్రహించుటకు విముఖమై యుండును.) అని, సమాధానమిచ్చెను.

### 2 అర్హతనుపొంది యావల నడుగ వగును:-

ఒకనాఁడొక ప్రేక్షకుఁడు బాబాను సమీపించి "బాబా! భగవంతుఁ డెవఁడు- అతఁడెట్లుండును?" అని ప్రశ్నించెను. ఆ ప్రేక్షకుని గమనింపక బాబాప్రక్కన నున్న యొక భక్తునిచూచి "మార్వాడి- బాగ్చంద్" దగ్గరకు వెళ్ళి నూరు రూపాయలు అప్పుతెమ్మని పంపెను. ఆ భక్తుఁడు వెళ్ళి మార్వాడి "నాదగ్గర పైకములేదు అనేక వందనములు" అనిచెప్పినాఁడని బాబాతో చెప్పెను. ఆ విధముగ మఱి యిద్దఱు మార్వాడీల వద్దకు బాబా అతనిని పంపెను. అదే సమాధానము వచ్చెను. బాబా- నానాసాహెబ్‌ను పిలిపించెను. నానాసాహెబు వచ్చెను. నానా! నాకు నూరు రూపాయలు కావలయునని బాబా అడిగెను. చందోర్కర్- బాగ్చందుకు ఒక చీటి వ్రాసిపంపెను. ఆమార్వాడి నూరు రూపాయలు పంపించెను. ఆ ప్రేక్షకుని

చూచి "సకలమిట్లుండును"- అని బాబా సమాధానము చెప్పెను. ఆ ప్రేక్షకునకు విషయము బోధపడలేదు. ఆ ప్రేక్షకుఁడు దాస్ గాణూను చూచి "బాబా నాప్రశ్నకు సమాధానము చెప్పినవాఁడా కాఁడేమి?" యనెను. "నీప్రశ్నకు బాబా సమాధానము చెప్పినాఁడు- కాని నీవుగమనింపలేదు"- అని దాస్ గాణు- ఆబోధ నిట్లు వివరించెను.

ఇతరు లడిగిన నొక రూకయేని నిడరు
'చందవర్కరు' కోరిన వందలిత్తు;
రటుల నీశ్వరు గనఁ గోరినంతఁ గనఁడు:
'అర్హతను గాంచువాఁడె బ్రహ్మమును బడయు'.
* * * * * * *
"అర్హతను బొంది యావల నడుగఁ బొమ్ము".

## బ్రహ్మ మర్థించువేళ విడు పంచకంబు.

ఒక దినమున నొక ధనికుఁడు జేబునిండ "కరెన్సీ నోట్లు" పెట్టుకొని బాబాను దర్శించుటకు శిర్డికి వచ్చెను. ఒక టాంగాను రాను పోను బాడుగకు మాట్లాడుకొనెను. ఆలస్యముచేసిన టాంగావాఁడు హెచ్చుబాడుగ అడుగునేమో యని జంకుచుండెను. బాబానుచేరి "బాబా! నాకు సర్వము కలదు. ఏ లోటులేదు. నాకు దైవమును జూపుము. నే నింతదూరము దానికొఱకు వచ్చితిని. అందఱు 'శిర్డీ బాబా' దైవమును శీఘ్రముగఁజూపఁగలఁడని చెప్పుదురు"- అని అనెను.

అంతట బాబా "మంచిది. సందేహింపకుము. ఇప్పుడే స్పష్టముగాఁ జూపెదను. ఇది జాగుచేయఁదగిన విషయముకాదు. దైవముకొఱకు వెదకువారు దొరకుట చాల యరిది. నన్నుచేరిన వారందఱు- ధనము- ఆరోగ్యము- సుఖము- కీర్తి- ఉద్యోగము- మొదలగునవి కోరుదురే కాని దైవమును గోరు

వారు దొరకరు. అట్టివారి కొఱకు నేను నిరీక్షించుచుందును. ఈ విశ్వమునకు బ్రహ్మము మూలకారణము. సూర్య చంద్రాది గ్రహములు- దివా రాత్రములు- ఋతువులు- హాయనములు- దైవము నాధారము చేసికొని వర్తించుచుండును. అట్టి బ్రహ్మమును జీవి దేహ పతనమునకుఁ బూర్వ మెఱుఁగవలయును. లేనిచో జనన మరణ చక్రమునఁబడి తిరుగుచుండును. "ఎఱుక" వలన "కేవలాద్వైత సుఖము" జీవికిఁ బ్రాప్తించును. గురువు ఆ "ఎఱుక"ను సమకూర్పఁగలఁడు. అది గురువునకే సాధ్యమగును. (బాబా ప్రక్కకు తిరిగి ఒక పిల్లవానిని పిలిచి) "మార్వాడి నందలాల్ దగ్గరకుపోయి అయిదు రూపాయలు అప్పు కావలయునని నామాటలుగా చెప్పుము". అని పంపెను. ఆ పిల్లవాఁడు వెళ్ళి తిరిగివచ్చి నందలాల్ లేఁడని చెప్పెను. ఆవిధముగ నెవరు ఇంటలేని తావులకు బాబా ఆపిల్లవానినిఁ బంపెను వాఁడు రిక్త హస్తములతో తిరిగి వచ్చుచుండెను. ఆ వచ్చిన ధనికుఁడు చీకాకు పడుచుండెను. జాగు సహింపలేకుండెను. ఆలస్యము చేసిన కొలఁది టాంగావాఁడు హెచ్చుబాడుగ కోరునేమోయని అతనిభయము. దైవ సాక్షాత్కారము- (ఆత్మజ్ఞానము) బాబా వెంటనే అనుగ్రహింపఁడేమి?- యని విసుగు నొందుచుండెను. బాబా అయిదు రూపాయల కొఱకు పిల్లవానిని పలుతావులకుఁ ద్రిప్పుట అతఁడు గమనించుచునే యుండెను. అతని జేబులో 250 రూపాయలుండెను. 5 రూపాయలు బాబాకు అప్పు ఇ[illegible]వి తిరిగి రావేమో యని అతని భయము.

అంతట ఆ ధనికుఁడు సహింపలేక "ఏమి! బాబా! బ్రహ్మమును నేను పడయుటకు సాయపడుదువా? లేదా?"- అని అడిగెను. 'నీవు బ్రహ్మమును పొందుటకే నేనింతవరకు ప్రయత్నించుచున్నాను. నీవు చూచుచున్నావుకదా? కూర్చున్నవాఁడవు కూర్చున్నట్లే నీవు బ్రహ్మమును గనుగొనునట్లు చేయ ప్రయత్నించుచున్నాను". అని బాబా సమాధానము చెప్పెను. అంతట నాధనికుఁడు "నేను త్వరగా పోవలయును. దయయుంచి బ్రహ్మమును జూపుము"- అని కోరెను.

అంతట బాబా "చూడుము! ఇంతదనుక నేను పడయు ప్రయాసం నుజున జేబులో 250 రూపాయలుంచుకొని 5 రూపాయ లొసగిన, నవితిరిగి దక్కునో దక్కదోయని సంశయించు చుంటివి. నేను కోరునవి 'అయిదు' మాత్రము.

బ్రహ్మమును గన విడం(గ నౌ పంచకంబు:-
అయిదు నింద్రియముల, నైదు ప్రాణములను,
మనసు, బుద్ధ్యహంకారము లనెడి యైదు
నప్పనము సేయ(దగును మోక్షాభిలాషి.

* * * * * * *

అదె 'విరక్తి' - 'నిర్లిప్తత'- యన(గ(బడును;
దుర్గమంబు బ్రహ్మజ్ఞాన మార్గమరయ;
అందఱకు( బయనింప సాధ్యంబుగాదు.
ఇనుడు పొడమిన( గాంతి యెల్లెడల( దోచు;
ఇహ పరార్థ కాంక్షల( ద్యజియించువాడె
వల(తి సుమ్ము బ్రహ్మజ్ఞాన పదము వడయ.

బ్రహ్మజ్ఞానోపదేశ మొకంటె నైదురూపాయ లధికమని- యా ధనముపై( దనకు(గల బంధము బాబా గ్రహించెనని తెలిసికొని ఆ ధనికు(డు సిగ్గున తిరిగి వెళ్ళెను.

## సాయి( జేరువారెల్లరు సఫలమతులె?

దామోదర్ S. రాస్నే· పై ప్రశ్న మనస్సునం దనుకొనుచు బాబా యెదుట( గూర్చుండెను. సాయిప్రభువు అక్కడ చేరినవారిలో నొకభక్తునకు దూరముననున్న మామిడిచెట్టును వ్రేలితో చూపి,

"కనుమి! పూచిన చూతవృక్షమును బిడ్డ!
ఎల్లపూవులు కాచి ఫలించెనేని
నెట్టి చక్కనిపంటో! యూహించుకొనుము!
కాని- పండునా? పిందెలు- కాయలెన్నొ
గాలికినిరాలు- పండు న వే లవంటో!

* * * * * * *

## సాయికి సమస్త మర్పన సలుప వలయు.

ఒక దినమున బాబా- బూటీ గోపాలరావును 16½ రూపాయలు దక్షిణ నిమ్మని యడిగెను. బూటీ తనదగ్గర లేవనెను. కాకా దీక్షిత్ పఠనము వెళ్ళుము. 16½ రూపాయలడుగుము. అతడు పారాయణచేయు ఏకనాథ భాగవతము వినుమని బాబా చెప్పెను. అవిధముగ బూటీ దీక్షిత్ దగ్గరకేగి 16½ రూపాయలడిగెను. అతడుతనదగ్గర ఒక రూపాయిమాత్రము కలదనెను. బాబా చెప్పినమాటలు బూటీ చెప్పెను. దీక్షిత్ భాగవతము చదువ ప్రారంభించెను. 'కాయేన వాచా........సమర్పయామి' అను శ్లోకము చదివెను. బాబా భగవానుడు కావున సమస్తము తనకర్పింపుమని అభిప్రాయము ఈ విధముగా తెలిపెనని దీక్షిత్ చెప్పెను. ఆ శ్లోకమున 16 పదములు గలవు. చిత్తము ఆ శ్లోకమున విడువబడెను. చిత్తము ½ మాత్రమే. కావున అందు తెలుపబడిన 16½ బాబాకు దక్షిణగసమర్పింపవలయునని భావము విశదము.

## మంత్రోపదేశములు.

శ్రీ సాయీప్రభువుగాని వారి గురువులుగాని యెవరికి మంత్రోపదేశములు చేసినవారు కారు. ఆయా సందర్భములందు ఆయా భక్తులతో రామనామము జపింపుమని తెలిపియుండెను.

(N.R.S.) తో 'రాం రామిఘ్యా'- రామనామము జపింపుము.
(G.S.K.) తో 'రాజారాం రాజారాం' అని ఉచ్ఛరింపుము.
అట్లు కావించిన నీ జీవితము సఫలమగును. శాంతి సౌఖ్యములు పొందగలవు.

M W. ప్రధాన్ తో 'శ్రీరాం జయరాం జయజయరాం' అని స్మరింపుము. మఱియొకరితో "అల్లా అచ్ఛాకరేగా-రామ్ రామ్ మ్హణా" 'రామ్' 'రామ్'- అని జపింపుము- దైవము నిన్ననుగ్రహించును. బాంద్రా బాలునితో-పోతీ (భాగవతవ్యాఖ్య) పారాయణ చేయుము. ఏ దొక నామము జపింపుము. అని యీవిధముగ పలికెడివాడు

H. S. దీక్షిత్ తో-బాబా తానెప్పుడు 'హరి'-'హరి' అని పలుకుచుండెడివాడనియు- హరి తనకు దోచినప్పటినుండి ఔషధము లిచ్చుట మాని 'ఊధి' నిచ్చుచుండెనని చెప్పినాడు. కాని యెవరికి ప్రత్యక్షముగ మంత్రోపదేశము చేసినట్టులేదు.

ఒక సమయమున "అన్నాసాహెబ్ దభోల్కర్" దైవసాక్షాత్కారము పడయు కోరికగలిగి బాబా ఎదుట గూర్చుండి "బాబా ఏదొకదినము నా కుపదేశము చేయకుందువా?" అని అనుకొనెను.

అంతర్యామి యగు బాబా వెంటనే "నీవు మాధవరావ్ దేశపాండ్యా శ్యామా (శిర్డీలో ఉపాధ్యాయుడు) దగ్గరకు వెళ్ళుము. అతని నడిగి 15 రూపాయలు తెమ్ము. అతనిదగ్గరకొంతతడవు కూర్చుండుము- సంభాషింపుము. పిదప 15 రూపాలు దక్షిణ తెమ్ము. అతడు నీకిచ్చును". అని దభోల్కర్ ను నియమించెను. దభోల్కరు శ్యామా దగ్గరకు వెళ్ళి బాబా పలికిన పలుకులు తెలిపెను. శ్యామా, నాదగ్గర 15 రూపాయలు లేవు. పదునైదు నమస్కారములు బాబాకు సమర్పింపుము. ఇదియే నా దక్షిణ అని బాబాతో వచింపుమని కోరెను.

అంతట దభోల్కరు, "నేను బాబాయెదుటఁ గూర్చుండి బాబా నాకుపదేశము చేయకుండునా? అని అనుకొంటిని. దానికీవిధముగ నీదగ్గర కొంతతడవు కూర్చుండి సంభాషించి, నీవిచ్చుదక్షిణ గొనిరమ్మని ఆజ్ఞాపించినాఁడు"- అని చెప్పెను. అప్పుడు శ్యామా "నాకు తెలిసినంతవరకు బాబా ఉపదేశము చేసియుండలేదు. ఎవరికి చెవిదగ్గర మంత్రోపదేశముచేసి యుండుఁగడు. నీకొక విషయమును తెలిపెదను వినుము"- అని యిట్లుచెప్పెను.

## రాధాబాయి వృత్తాంతము.

రాధాబాయ్ దేశముఖిణ్ అనునామె మంత్రోపదేశము వడయనెంచి బాబాను చేరెను. తవకోర్కె ఫలించని కారణమున సత్యాగ్రహము చేయ నిశ్చయించెను. బాబావలన ఉపదేశము పొందుటో లేక ప్రాణముల త్యజించుటో ఏదొకటి కావలయునను నిశ్చయముతో ఉపవాసము ప్రారంభించెను. అట్లామె మూఁడు దినములు నిష్ఫలముగ నుపవసించిన తరువాత ఏదోయొక మంత్రముపదేశించి యామెను తృప్తిపఱుపుమని అతడు (శ్యామా) బాబాను ప్రార్థించెను. బాబా రాధాబాయిని తన దగ్గరకు పిలువనంపించి యీవిధముగఁ బలికెను.

"అమ్మా! ప్రాణత్యాగము చేసికొన వలయునని ఏల నీవు హింసించి కొనెదవు? నీ బిడ్డనైన నాయందు దయ వహింపుము. నేనొక బిచ్చగాఁడను. ఇటు చూడుము! నాగురువు మహాసాధువు. అతి కరుణా స్వరూపుఁడు. శ్రద్ధాభక్తులతో సేవించితిని. నాచెవియందేమంత్రము ఉపదేశించినవాఁడు కాఁడు. నన్ను పరిశుభ్రము చేసి రెండు పైసాలు తెమ్మనెను. ఆయనకోరినవి నాణెములుకావు. బంగారమిచ్చిన నాసించువాఁడు కాఁడు. "నిష్ఠ" "సబూరి" (భక్తి- సంతృప్తి ధైర్యములతోగూడిన ఓర్పు.) ఆయనకోరెను. నేను తత్క్షణ మొసగితిని, ఆయన సంతసించెను. ఈ రెంటిని విడనాడకుము. ఈ సంసార సముద్రమునుండి నిన్నావలకు క్షేమముగా నివి చేర్పఁగలవు, ఇవి పాపముల నడంచి నిస్పృహతను మాపుమాపె భయమును నివారింప సమర్థములు.

సాటిలేని ప్రేమామృత సాగరంబు
వేంకుశ గురుండు; భక్తి సేవించినాఁడఁ
బదియురెండేఁడు లేమని పలుకఁగలను
నాపయిఁజ గురుదేవుఁడు చూపు నెనరు!

ధ్యాన నిష్ఠా గరిష్ఠుఁడౌ తఱినిఁ దాపు
చేరి మద్గురుమూర్తి నీక్షించుచుందు;
ఇతరమందు నాచూపు వర్తించఁబోద;
అందినా నిర్వారముఁ జిదానంద సుఖము.

పవలు రేలును మద్గురు స్వామి సురుచి
రాననాంభోజ మకరందపాన మత్త
షట్పదంబనై క్షుత్పిపాసలను మఱచి,
యవ్యయానంద వార్ధి నోలాడినాఁడ.

ఏ క్షణమేఁజ గురు నెడబాటును సహింప,
గురుఁగాక యితరంబు స్మరణసేయు;
గురువుఁగాకన్యంబుఁ గోర నెద్దాని నే
నెడపక గురునె చింతించు మనసు;
గురుదేవు దివ్యసత్కారుణా విలాసంబు
లద్భుతంబు లచింత్య మవితథములు,
కామితార్థంబు నిక్కము మద్గురుఁడ, దేశి
కపరికాంక్షితము మద్గాఢప్రేమ;

ఊరకున్నట్లు వెలిఁదోఁచు, నుడుగఁ బోఁడు
మనుచు నెప్పు కటాక్షవీక్షణము మాత్రి;
చెవిని మంత్రోపదేశముల్ చేయఁ, డేను
బడయఁగంటి నీస్థితి 'గురువరు' ని కరుణ.

గురుదేవు నొకనినే మది
నెఱనమ్మి సతంబు భక్తి నిష్ఠితమతులై
వరి వస్యసలుపు వారికిఁ
బరమార్థంబెపుడు కొంగు బంగారమగుణ్.

* * * * * *

సత్యమిదియ,- మద్గురుబోధ సారమిదియ;
సాధన చతుష్టయము నారు శాస్త్రములను
శ్రమలకోరిచి యభ్యసించంగ నేల?
చాలు గురునందు భక్తి, విశ్వాసబుద్ధి.

తనగురువును సాధుజనం
బును దూలఁగనాడుచోట బుద్ధి వరిష్ఠుం
డనుమానింపక విడనౌ,
క్షణకాలంబేని నిలువఁగారాదు సుమీ!

కావున నా గురుదేవుఁడు నాచెవియందెట్టిమంత్రమూది యెఱుఁగడు. నేను మీ చెవియఁదూదునది యేమియు లేదు. అమ్మా! నీపట్టుదల విడుము. ఈవిధముగ నాచరింపుము.

నాపై నిల్పుమి యెల్ల యాశయములుఁ సంకల్పముల్ నీ మనో
వ్యాపారంబుల, నట్టి నిష్ఠ గలిగింపఁజాలు హృచ్ఛాంతి, సం
తాపంబుల్ సకలంబడంగుఁ, బరమార్థంబౌ పరంధామముఁ
బ్రాపింపంగల నీ సుబోధము మదిఁ భద్రింబుఁ గావింపుమా!

అన్యచింతనల్ వీడి నన్నరయుమెప్పు,
డటుల నిన్ను నే కన్నుల నరయుచుందు;
పూర్ణ విశ్వాసమున గురువును భజింపు
మిదియ నేఁ జేయు నుపదేశ; మిదియ చాలు.

రాధాబాయి తలయొగ్గి, బాబా బోధను గ్రహించి సంతృప్తినొందెను.

శ్యామా యెఱింగించిన రాధాబాయివృత్తాంతమును విని, దభోల్కర్ బాబాను సమీపించి శ్యామాదగ్గరజరిగిన సంభాషణము నివేదించెను. శ్రీ సాయీప్రభువు దభోల్కరును అనుగ్రహించి యిట్లనెను.

§ "అనుపమములు- ప్రత్యేకంబు లగును మా వి
ధానములు; మఱువఁగఁ బోకు దీనినెపుడు;
ధ్యాన మాత్మానుచింతన మవసరంబు,
దాన, శాంతివహించి నీ మానసంబు
క్రమముగ సమాధినిష్ఠను గాంచఁజాలు.

* * * * * *

§ "ఆమాచా ఘరాణే నిరాళా ఆహే" (మాపద్ధతులు ప్రత్యేకములు)
"మీతానాలా ఇన్‌ణారా గురు నవ్హే" (నేనుచెవిలోఉపదేశించునది లేదు)

స్వాంతమును సంతతంబు భూతాంతరాత్మ
యైన శ్రీ వాసుదేవుని యందు నిలుపు,
మటుల పిదప దైవమందు లయంబుఁ గనినఁ
గందు సచ్చిదానందైక గమ్యపదము.

సాకారునిఁగా లేక ని
రాకారునిఁగాగ నన్ను ధ్యానింపుమి, నీ
కాకార రహిత చింతన
చేకురదే, నిట్టి నన్ను చింతింపఁ దగున్.

ధ్యానింపుము రేయిఁ బవ
ళ్ళన, న్నద్దాన మనసు లీనంబగు, నీ,
"నీ"- "నా"- భేద మడంగును,
ధ్యానము ధ్యాతయును ధ్యేయ మపుడు శమించున్.

* * * * * * *

అదియె 'చైతన్య ఘనత' యదా- నదియె బ్రహ్మ
సామరసతయు;- నానందధామ మదియ;
సద్గురు కృపా కటాక్ష వీక్షణమె- శిష్య
స్వాదు షడ్రసోపేత భోజనము సుమ్ము!"

అని పలికి, దభోల్కరుకు కలకండ ప్రసాదమొసఁగి, "ఈ నాబోధ సుస్థిరముగ మనసున నిలుపుదేని నీజీవిత మీ కలకండకంటె మధురముగా నుండును. సత్కథా శ్రవణ పఠనములు- మననము- నిధి ధ్యాసలు- స్మరణ ధ్యానములు ఆనంద ఘనప్రాప్తినిఁ గలిగింప సమర్థములు. ఈ దృశ్యప్రపంచ మంతయు మాయాద్వారా ఆవిష్కరింపఁబడిన బ్రహ్మముయొక్క రూపము.

ఇది తిరిగి బ్రహ్మమునం దైక్యమగును. ఆత్మ ఒకఁడో - లేక జీవులవలె పలువురో సకలశాస్త్రములఁ బరిశీలింపుము. ఎందుండి యీ సకలముద్భవించెనో యట్టి "కేవలాత్మ" నెఱుఁగుటయే "జ్ఞానముయొక్క పరమావధి".

ఋణానుబంధమునఁ జేసి నీవు నన్నుఁ జేరితివి. అట్టి ఋణానుబంధము నాదరింపుము. విస్మరింపకుము. ఏ ప్రాణియైన నిన్ను జేరవేని నిరసించి వెడల నడపకుము. తగునట్లాదరింపుము. ఆకలిగొన్న జీవికి అన్నము - దప్పిగొనిన వానికి నీరము - దిగంబరునకు వస్త్రము యథా సాధ్యముగ నొసఁగుము. అట్లు గావించితి వేని భగవానుఁడు సంతసించును. ఇతరులపై ఆగ్రహావేశములఁ బ్రకటించి కటువులు పలుకకుము. ఇతరులతోఁ గలహింపకుము. ఇతరులు నిందించిన ఓర్పు వహింపుము. శాంతవచనములు పలుకుము. ఇది సుఖము వడయఁదగినమార్గము. ప్రపంచమంతయుఁ దలక్రిందులు గానిమ్ము దానిని నీవు పాటింపకుము. చలింపక ముక్కునకుసూటిగ నీమార్గమునఁబొమ్ము.

ఈ ప్రపంచమున నిన్ను - నన్ను; - ఒక జీవినుండి మఱియొకజీవిని వేఱుపఱచుగోడ - "భేదకుడ్యము" గలదు. ఈ గోడను పడఁగూల్చుము. భగవానుఁడే మహాప్రభువు. ఆ భగవద్వాక్కు లద్భుతములు - అమూల్యములు - శాశ్వతములు - క్రమముగ నీ ఆశయము ఫలించును. మనము పరస్పరప్రేమాభివృద్ధిఁబడసి శాశ్వతానందము పొందఁగలము" - అని బోధించి, దభోల్కరును బాబా సమాధానపఱచి పంపెను.

## హిందూ దేవతలందు. హైందవ పూజలందు బాబాకు గల ఆదరణ.

ఒక దినమున ద్వారకామాయి - మసీదు చావడిలోనికి వర్షపుజల్లు పడుచుండెను. ఒకభక్తుఁడు బాబాను - మారుతి విగ్రహమున్న పై అరుగు మీద కూర్చుండుమని కోరెను. "భగవానునకు సమాన పీఠమున నెట్లు కూర్చుండఁగలము" ని బాబా సమాధానము చెప్పెను.

*       *       *       *       *       *       *       *

శ్యామా-ఒకనాఁడు- 'బాబా! పురాణములు సత్యములే నా? శ్రీ రామ-శ్రీకృష్ణుల విషయమేమి?'- అని ప్రశ్నించెను. పురాణములు- సత్యములు. శ్రీరామ-శ్రీకృష్ణులు మహాత్ములు. భగవదవతారులు-సాక్షాత్ భగవానుడు. అని బదులు చెప్పెను.

* * * * * * * *

'భగవంతరావు క్షీరసాగర్'- శిర్డికివచ్చి బాబాను దర్శించెను. బాబా అతనినిచూపించి అక్కడివారితో- "ఈబిడ్డ- తండ్రివలె విఠోబానుపూజించి నైవేద్యము లొసఁగఁడు విఠోబాను- నన్ను పస్తుపెట్టుచున్నాఁడు. ఈతని తండ్రి నా మిత్రుఁడు. అందుచే నితని నిటకుఁ బిలిపించితిని. తండ్రి కావించిన విఠ్ఠలపూజ పునరుద్ధరింపుమని యితని కాదేశించుచున్నాఁడను".

* * * * * * *

అన్నమున నేతి నభిఘరించి ధునియందు వేల్చి, పిదప నాకొసంగుము. అని 'సగున్- మేరు- నాయక్' తో బాబా ఒక సమయమునఁ బలికెను.

## దైవము నెఱుఁగవలయునుగాని- పలువరాఁడు.

భగవంతునిఁ గూర్చి యేమియో వచించుచున్న నొకనిఁ జూచి "దేవుఁడు" "దేవుఁడు"- అని యేమియో చెప్పెదవేమి? "దేవుఁడు నా జేబులోనున్నాఁడు!"- అని బాబా అనెను.

* * * * * * *

చంపువాఁడే సంరక్షకుఁడు- సంరక్షకుఁడే చంపువాఁడు.

* * * * * * * *

బాబా- టి. ఏ. కార్ణిక్ తో- "భగవంతుఁ డంతెమూరమున గలఁడా?

గగనోపరి స్థలంబున
నెగడుఁడు - పాతాళమందు నిలువఁడు, సతముఁ
దగ నీదు దఱినిఁ గలఁ, డా
భగవంతుని నెమక నెందుఁ బఱతువు? బిడ్డా!"

అని. బోధించెను.

## గురుష్ఠ — అవసరము.

గురువు అనుగ్రహ మవసరము. గురు కృపాదృష్టిచేతనే జీవి తరింప వలయును. మఱియొక మార్గము లేదు. నాదృష్టియందు గురువు తప్ప మఱియొక వస్తువు లేదు. నా ప్రాణము - చూపునందు, చూపు - గురువునందు లీనమొందినది. నా ధ్యానము గురువు. ప్రశాంతముగ వినతిఁ గావించితిని. గురువు అనుగ్రహము చేతనే తనకుఁదా ఎఱుక గలిగినది. నా ప్రయత్నము లేశమేని లేదు. గురువనుగ్రహము సాధన. జ్ఞానము దాన సిద్ధించును.

గమ్యస్థానము చేరుటకు పెక్కు మార్గములు కలవు. కాని నీకు (భక్తునకు) మాత్ర మీ మార్గము వలయును. ఆమార్గమునందు ఎగుడుదిగుడులు కలవు. పులులు, ఎలుఁగులు మొదలగునవి ఆమార్గమున గలవు. ఎఱిఁగిన తోడున్న సులభముగఁ జేరనగును. తోడు లేనిచో కష్టనష్టములు కలుగును. తుదకు నరకకూపమునఁ గూలివఁ గూలవచ్చును.

"గురు వినా కోఇ బతావే వాట్"- కబీరు.
"గురువులేక మార్గ మెఱుకపడదు".

ఇతరగురువు లెంత గొప్పవారైనను నీ గురువునే నమ్మియుండుము, నీ గురువును విస్మరింపరాదు. ఎప్పు డంటి యుండవలయును. దృఢముగ నతనియందే మనసు లగ్నము చేయవలయును.

వేపచెట్టు మూలమున 'కబీరు' గోరి
కలదు, కావున నిది నాకు నెలవు సుమ్ము!
ప్రాగ్గురుఁడు కబీర్;- గురు శుక్రవాసరముల
నగరు ధూప మిందిడువారు- సుగతిఁ గందురి.

* * * * * *

## శిష్యుఁడే గురువును సంపాదించుకొనవలయును.

ధనికురాలొకర్తుక పళ్ళెరమునిండ రూపాయలనింపి బాబాను జేరి, ఆ దక్షిణగొని తన్ను శిష్యురాలుగాఁ జేసికొనుమని బాబాను కోరెను. ఆమె యొసఁగు దక్షిణను నిరాకరించి బాబా యిట్లనెను.

"గురువు తనకుఁ దా నీ- 'నీకు' గురువుగాఁడు
విశ్వసించి, నీ వాతనిఁ బ్రేమఁ గొలిచి
చేసికొనదగు గురువుఁగా, చిల్లపెంకుఁ
గొలిచి కనుగొమ్ము! సిద్ధి చేకురునొ? లేదొ?"

## గురువులద్వారా బ్రహ్మజ్ఞానము పడయు విధము.

ఒక దినమున నానాసాహెబ్ చంధోర్కరు- (డిప్యూటికలెక్టరు- సంస్కృతము బాగుగ నభ్యసించినవాఁడు) మసీదునందు బాబాపాదము లొత్తుచు మనస్సున భగవద్గీతలోని శ్లోకము పఠించుచుండెను. ఏమి గొణుగు కొనుచున్నావు? నానా! అని బాబా ప్రశ్నించెను.

"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్వ దర్శిన;"

(భగ. గీత- 4-34)

శ్లోకమును చంధోర్కరు చదివెను. దాని అర్థమేమిగ్రహించితివి అని బాబా అడిగెను. తా నెఱిగిన యర్థము చంధోర్కరు చెప్పెను. దానిని బాబా యిట్లందలి యర్థమును వివరించెను.

హృదయ వచశ్శరీరములనెల్ల సమర్పణసేయు బుద్ధి పెం
పుఁదనర సాగిలంబడుచు మ్రొక్కుటతే "ప్రణిపాత" మేదియో
చదురున, వేఢ్కకేని, నలసత్వము పేర్మిఁ, బరీక్షకేనిఁ గా
కెదఁ బరమార్థకాంక్షఁగను పృచ్ఛతెపో "పరిప్రశ్న" నాఁబడున్.

స్వేచ్ఛబుద్ధిఁజేసెడి సేవ సేవకాదు;
తన తనూనియంతగఁ దాను దలఁపరాదు:
తనువు వాఙ్మనంబులు గురు ధనములగుట
గురువుసేవార్థ మని వాని నెఱుఁగవలయు.

వాఙ్మనముల కందనిది యా బ్రహ్మమగుట,
బహ్మమే జ్ఞానమగుటను- బ్రహ్మ విదులు
శ్రుతున 'కజ్ఞాన' మెవొ భాషింతుర్రి; దాన
సమయు నజ్ఞత,- జ్ఞాన భాస్కరుఁడు వెలుఁగ.

పరికింప శ్రుతి మసత్తగు
నెఱుఁగంగాఁబడునిదెల్ల నెప్పు డసత్తౌ;
గురుఁడును శిష్యుఁ డసత్తగు
గురూపదేశం బసత్తగుఁజా జగమందుఁజా.

స్వచ్ఛ జలము నాచునఁ గప్పఁబడిన యటుల
జ్ఞాన మజ్ఞానమున నిటుఁ గప్పవడియె;
నాచుఁ దొలఁగింప జలము గానంగనగును;
నీరుఁ జేర్ప నేపని? యందె నీరుగలదు.

గ్రహణమున చంద్రసూర్యులు గలరుమింటఁ;
గాని, రాహు కేతులు వారిఁ గప్పుచుందురు.
రాహు కేతు లావలకుఁ దొలఁగిరేని
నిందు భాను తేజంబు లెల్లెడల వెలుఁగు.

కనుల కలిమి నీ సర్వంబుఁ గాంచఁగలము,
కనులకుఁ బొరక్రమ్మినఁ గాంచలేము;
పొరను దొలఁగించ వైళము పొరయుఁ జూఁపు;
పొరయె యజ్ఞానమని యిట నరయఁ జెల్లు.

ఇట్టిదని స్పష్టముగ నిరూపించరాని
మాయచే కల్పితంబు బ్రహ్మాండమెల్ల;
అరయ నజ్ఞానమిందు మాయాఖ్యఁ బొలుచుఁ;
గనిన నజ్ఞాన మజ్ఞానమున వెలుంగు.

* * * * * *

"ప్రణిపాతములుఁ బరి ప్రశ్నముల్ సేవ
లన యంబు గురు కరుణాప్తికిఁ దోవ";
స్వాంతమందు జగంబు సత్యమగు దృష్టి
భ్రాంతి మూలంబగుఁ, బ్రాణికి నష్టి;
చీకటి యవనికఁజేసి జ్ఞానంబు
ప్రాకటముగఁ గప్పఁబడియెఁ జోద్యంబు!
అజ్ఞాన మనెడి నీ యవనిక తెగుడు
ప్రజ్ఞాన బ్రహ్మంబు భాసిల్లునపుడు.

* * * * * *

కనఁగ సంసృతి బీజ మజ్ఞానమగును;
గురుని కరుణాంజనంబుఁ జక్షువులఁదాల్చ
జనున కీ మాయ యను తెర సమసిపోవు
జ్ఞానమది శేషమొంది చక్కఁగ వెలుంగు.

జ్ఞానమనునది కార్యంబుగాదః యెప్పు
డది స్వతస్సిద్ధమగుచు సత్యముగఁ దనరు
కారణాంత్యముల్ పాసఁగు నజ్ఞానమునకు;
కనుమి భేదత్వ మజ్ఞాన కారణముగ.

కారణమడంగ శేషించు జ్ఞానమపుడు
* * * * * *
రజ్జు వజ్ఞానమునను సర్పముగఁదోఁచు
నట్టి యజ్ఞానమెడల సత్యము వెలుంగు
అరయు నజ్ఞానగతి పూర్వ పరములందు
రజ్జువే కాని యెపుడు సర్పంబులేదు.

* * * * * *

సాధనలు. సద్గ్రంథ పఠనము.

బాబా జ్ఞానసిద్ధికి సాధనములుగ- పురాతనవిగ్రహములు, ప్రతిమలు, పాదుకలు- బాబా స్పృశించియిచ్చిన నాణెములు- పటములు (శ్రీరామ-శ్రీకృష్ణాదిరూపములుగలవి- బాబాచిత్రపటము) పూజించఁదగునని బోధించెను. సద్గ్రంథములుగూడ పఠింపదగునని తనభక్తులకు సాయీప్రభువు తెలిపియుండెను.

"అనుదినమ్ము నాధ్యాత్మ రామాయణమ్ముఁ
గాని, యేకనాథకృత భాగవతమైనఁ
గాని, గీతా రహస్యంబుఁగాని పఠన
జేయుటలు శ్రేయమగును దీక్షితు! నీకు".

అని కాకా దీక్షిత్‌తో బాబా చెప్పెను. ఇవి మహారాష్ట్రీయ గ్రంథములు. (తెనుగు వారు పైవానిని తెనుగు కావ్యములు (శ్రీమద్రామాయణము- అధ్యాత్మ రామాయణము- భాగవతము- భగవద్గీతలు- మొదలగు సద్గ్రంథముల పఠింపదగును.)

ఒక సందర్భమున ఉపాసనీ బాబాతో, మఱియొక సమయమున 'కపర్థి' తో 'పంచదశి' ని గూర్చి "ఏ తో హమారా ఖజానా హై" (ఇది మా ధనపుకొట్టు) అని పలికియుండెను.

ముకుందలేలే శాస్త్రితో నారాయణోపనిషత్తు తైత్తరీయోపనిషత్తు పారాయణచేయుమని బాబా నియమించెను.

బి. వి. దేవ్‌తో- "జ్ఞానేశ్వరి"- (భగవద్గీతలకు మహారాష్ట్రవ్యాఖ్య) పారాయణచేయుమని నియమించెను. మఱియొక భక్తుని 'రామ విజయము' మృత్యుంజయ ప్రీతికొఱకు పఠింపుమని బాబా నియోగించెను.

గురుపూర్ణిమనాడు శిర్డియందు భక్తులు చేరుదురు. బాబా స్పృశించి యిచ్చుటకు వారివారికి ఇష్టములగు గ్రంథముల వెంటఁగొని వచ్చెడివారు. బాబా ముందుంచెడివారు. బాబా ఎవరుతెచ్చినవి వారికిఁగాని- ఒకరుతెచ్చినది మఱియొకనికిఁగాని యిచ్చెడివాఁడు. అందులో నొకభక్తునితో (R)? నీవు ఏ గ్రంథమును చదువకుము— నన్ను మనస్సున నిలుపుకొనుము చాలు. గ్రంథములందు భ్రమతప్ప బ్రహ్మ లేఁడు.

"గ్రంథ సముదయంబు గాలించి శోధించి
బ్రహ్మ నెమక నేల శ్రమలఁ బడెదు?
గ్రంథ శోధనంబు భ్రమ కారణంబని
యెఱిఁగి తలఁపుమెపుడు హృదిని హరిని".

శ్రీరామ-శ్రీకృష్ణ-మృత్యుంజయాది నామజపములు- శ్రీసాయీనామ జపము- సాధనములుగ బాబా తెలిపియుండెను. (చూడుము. మంత్రోపదేశములు.)

## సా ధ న లు.

### బాబా సర్వాంతర్యామిగ ధ్యానింపుము. పూజింపుము.

బాబా ఒకదినమున నానా గోవింద్ చందోర్కరును పూర్ణపోలీ తయారుచేసి తెమ్మని కోరెను. పూర్ణపోలీ అనుపాకములతో సిద్ధము చేసి తెచ్చి చందోర్కర్ బాబాముందుంచెను. తినుమని ప్రార్థించెను. బాబా కొంచె మాగుమనెను. ఇంతలో చీమలు, ఈగలు దానిపై చేరెను. ఆ పళ్ళెరముం గొనిపోయి భుజింపుమని బాబా చందోర్కరుతో చెప్పెను. ఏమి? బాబా! పూర్ణపోలీ తెమ్మంటివి. తెచ్చినదానిని భుజింపకే తిరిగి తీసికొనిపోయి నన్ను భుజింపుమనెదవు. నీవు కొంచెము తినినంగాని నేను తీసికొనిపోనని చందోర్కర్ పట్టుపట్టెను. నేను తింటిని- నీవు కొనిపోయి భుజించిరమ్మని బాబా పలికెను. తెచ్చినవి తెచ్చినట్లుండ నీవు తింటివనెద వేటిమాట? నీవు తినినంగాని నేను గొనిపోవనని చందోర్కరు ద్వారకామాయి మసీదునుండి వెడలిపోయి చావడిలో ఆకలితో పరుండెను.

తనబిడ్డలు ఆకటం గుర్తించుటలోర్వని బాబా నానాను పిలిపించెను. పోలీ పళ్ళెరముల గొనిపోయి భుజంచిరమ్మని నియమించెను. కాని చందోర్కరు అందుకు సమ్మతింపక పట్టుదల చూపెను. అప్పుడు బాబా అతనితో నిట్లనెను.

పదియునెనిమి దేండ్లయ్యె నా పజ్జఁజేరి,
ఇంతదనుక గ్రహించిన దిదియ యేమి?
నన్నుగూర్చి నీవెఱింగిన దన్న! యిదియ?
'సాయి' యనిన నారడుగుల కాయమేమి?

చీమలుగాగ నొక్కెడ భుజించెద, నీఁగలరూపుఁదాల్చి యేఁజ
దోమగనేని, లేక యెటుఁదోఁచిన నా తనువంది, నాశ్రితుల్
ప్రేమ నొసంగువానిఁ బరితృప్తిగఁ దిందును; నీదుపోలి ని
చ్ఛామతిఁ దిన్నవాఁడ; మతి జాడ్యము వీడుము; విశ్వసింపుమా!

అని బాబా బోధించెను. అంతట చందోర్కరు బాబా! నీవిట్లు చెప్పినను నేను యథార్థము గ్రహింపలేకున్నాను. నే నేమి చేయఁగలను? నేను గ్రహించునట్లు చేయుదువేని యీ పళ్ళెరముల గొనిపోయెదను, అని పలుక సాయీప్రభువు ఏదో సైగచేసెను. ఇతరుల కెఱుఁగరాకయే నానా కా రహస్య మవబోధమయ్యెను. నానా సమ్మతపడి బాబా తన అంతర్యామియు మక్షికా పిపీలికాది సమస్త భూతాంతర్యామియు నను ఎఱుక గలిగి పళ్ళెరములఁ గొనిపోయెను.

## సాధనలు - ప్రకృతి దృశ్యములు.

సుందర ప్రకృతిదృశ్యముల వీక్షించుటచేత ప్రకృతిరూపమగు పరబ్రహ్మమునందు మనసు లయించును. బాబా అప్పుడప్పుడు అస్తమించు సూర్యునివంక తేరిపాఱఁజూచువాఁడు. చిలుకలగుంపులను బరిశీలించుటయుఁ గలదు.

కె. జి. భీష్మ,- బల్వంత్ కపర్దే అను వారిరువురు ఉదయమున విహారమునకేగి మంచున దిరుగుచు ఉదయించు సూర్యునకు వెనుముఖముగ నిలుచుండిరి. వారినీడ పాదములవద్దనుండి పడమట ఇంద్రధనస్సువరకు వ్యాపించినట్లు గమనించి జీవాత్మ పరమాత్మలో ఐక్యమైనస్థితిని గాంచినట్లానందించిరి. వారు తిరిగిరాగా జి. యస్. కపర్దే వారలతో బాబా మీకు పరమాత్మైక్యలీల అనుగ్రహించినాఁడనెను. వారు బాబాను సమీపింపఁగా తన సమ్మతి సూచకముగ బాబా చిఱునవ్వు నవ్వెను.

## సాధనలు - సంగీతము

1890 వరకు బాబా మసీదునందు గేయములు కీర్తించువాడు. తరువాత అప్పుడపుడు గానముచేయువాడు. సంగీతము మనస్సునకు ప్రశాంతిని గూర్చి బ్రహ్మానంద సౌఖ్యమనుభవింపజేయును.

వీణా వాదన తత్త్వ
జ్ఞానియు, శ్రుతి జాతి విధి విశారదుడును తా
లా మూ నజ్ఞుండును మో
క్షానంద పదంబు నొందజాలినవారల్.

(యాజ్ఞవల్క్య స్మృతి)

* * * * * * *

హృది స్వరబ్రహ్మమౌ హృషీకేశ పాద
కమల తతుల లీనమొంద దివ్యకాలముతను
ధ్యాన దివ్యతుధార్ద్ర వీచీ నిచయిని
నోలలాడు నాదమునకు జేలుమోడ్తు.

భగవద్గుణ లీలల గేయరూపమున కీర్తించుట మనస్సు పరవస్తువునందు లయమగుటకు సాధనమని బాబా బోధించినాడు. దాస్ గాణూ మహారాజు శిర్డికి వచ్చినపుడెల్ల బాబా సమక్షమున భగవత్కథలు, సాధుల చరిత్రలు గేయరూపమున గీర్తించి భక్తులందఱకానందము గలిగించువాడు.

## నైతికబోధ - చక్కదిద్దుట

షడ్రిపులు:- కామము - క్రోధము - లోభము - మోహము - మదము - మాత్సర్యము.

బాపుసాహెబుజోగ్:- బాబా! అనన్యభావమున నింతకాలమునుండి నీసేవ చేయుచున్నాను. నా సేవ ఫలించినదని నేనెట్లు తెలిసికొనగలను,

సా. బా:- నీవు నావలె సర్వ బంధములనుండి విడివడి నాభావము పొంది నావలె కఫ్నీ ధరించి భిక్షించి జీవించ నేర్చినపుడు మన ఇరువురి హృదయము లానందింపఁజేయు నీసేవ సఫలమైనదని గ్రహింపుము.

## కామము.

సాయీప్రభువు సన్యాసిద్వై దేవదాసున కిట్లు బోధించెను.
1 వైరాగ్యముగలిగి యుండుము. 2 యతులకు స్త్రీలు ప్రతిబంధకములని గ్రహింపుము. 3 సౌఖ్యములందు వ్యామోహము- భ్రాంతుల నుడుగుము. 4 భగవంతుని ధ్యానింపుము- అజ్ఞానముత్యజింపుము. 5 కామమునుజయింప నేరనివానికి భగవత్సాక్షాత్కారము లేదు. 6 చక్కనిరూపములఁ జూచినపుడు అట్టివస్తువును రచింపనేర్చిన వాఁడెంత చక్కనివాఁడో తలంచుము. ప్రపంచమునందలి స్త్రీలు- తల్లులు తోబుట్టువులుగ భావించుము.

## క్రోధము.

రామదాసి- అనునతఁ డొకదినమున నేదో పుస్తకము విషయమై తన మిత్రునిపై ఆగ్రహము వహించి పోట్లాడెను. తరువాత బాబాదగ్గరకు వెళ్ళెను. బాబా అతనినిఁ జూచి.

ఏమి! నీవు 'రామదాసి' అని చెప్పుకొందువు. ప్రతిదినము భాగవతము అధ్యాత్మరామాయణము పారాయణఁ జేయుదువు. కాని నీ హృదయము నిర్మలము కాలేదు. విష్ణు సహస్రనామములు పఠింతువు. నీ కష్టములు తీరలేదు. నీవు రామదాసివే అయిన ప్రాకృతవస్తు విముఖుఁడవుకమ్ము. మమత వర్జింపుము. సమత నార్జింపుము. బాలునివలె పుస్తకమునకై పోట్లాడెదవు. ధనము వెచ్చించిన లక్షలు పుస్తకములు సంపాదింపఁగలవు. మిత్రులను సంపాదింపఁ జాలవు.

ఎవ్వఁడే నన్నుపై నాగ్రహించెనేని
వాఁడు నన్ను నొవ్వించినవాఁడ సుమ్ము!
ఒరుని దూరుదే నేఁ బాధనొందుచుందు;
సైచి శాంతిఁ గాంచెదవేని సంతసింతు.

ఉన్న నిమ్ము లేకుండిన నూఱకొమ్ము
యాచకులు డీను లేతెంచి వేచుచున్న;
ఈసడింపకు మెప్పు డాగ్రహింపఁబోకు
శాంతిఁ గోలుపోవుటలు శ్రేష్ఠంబుఁ గాదు.

పదిమాట లెవ్వరేనియు
వదరినఁ, బలుకంగనెంతువా! యొకమాటఁ
మది శాంతివిడక పలుకుమి
సదమదమునఁ బోరుసలుపు జాడలుడుగుమీ!

## గర్వము

ఉత్తమవంశమున జన్మించినవాఁడనని, ధనవంతుఁడనని, విద్యావంతుఁడనని గర్వము వహింపఁదగదని బాబా బోధించెను.

ఒకసందర్భమున దక్షిణాఫ్రికానుండి యొక బ్రాహ్మణుఁడైన వైద్యుఁడు (doctor) శిర్డికి వచ్చెను. మామ్లత్ దారు వెంటనుండ నతఁడు ఆ వైద్యుని బాబా సందర్శనమునకు రమ్మని పిలిచెను. నేను రామభక్తుఁడ, నితరులకుఁ దలనొగ్గనని ఆ డాక్టరు పలికెను. ఊరకచూచి వచ్చుదువుగాకని అతని వెంట బెట్టుకొని మామ్లత్ దారు ద్వారకామాయి మసీదు జేరెను. ఆసమయమున ఆరతి జరుగుచుండెను. దూరముననున్న ఆ డాక్టరు లోపలకు తోసికొని వచ్చి బాబాపాదములపైఁ బడెను. ఏల యిట్లుకావించితివని మామ్లతదారు

పరీక్షింప నీలమేఘశ్యాముడైన శ్రీరాముడుగ బాబా నాకు ప్రత్యక్ష మయ్యెను. శ్రీ సాయి యోగ సంపూర్ణావతారుడు ఇందుకు సందేహము లేదని ఆడాక్టరు సమాధానమిచ్చెను.

నాశిక్ నుండి మూలేశాస్త్రి అనునతడు శిర్డికి వచ్చెను. బాబా బూటీని పిలిచి క్రొత్తగావచ్చిన ఆ నాశిక్ విప్రునివద్దనుండి దక్షిణ గొని రమ్మని చెప్పెను. మూలేశాస్త్రి మసీదుదగ్గరకువచ్చి అందు ప్రవేశించిన తనకు దోషమాపాదించుననని దూరమున నిలచియుండెను. బాబాకూర్చున్న వైపుజూడగా ఆస్థానములో అతనిగురువు గోచరించెను. వెంటనే మెట్లెక్కి పరుగునవచ్చి జై! గురు! జై! ఘోలప్ గురుమహారాజ్! జై! జై! అనుచు బాబాపాదములపైబడెను. బాబా దక్షిణ ఇమ్మని అడిగెను. కాషాయవస్త్ర ధారియగు ఘోలప్ గురువు అదృశ్యుడయ్యెను. అచట బాబాయుండెను. మూలేశాస్త్రి వెంటనే దక్షిణ యొసంగెను.

*      *      *      *      *      *      *

ఒకసందర్భమున బాబా చందోర్కరుతో నిట్లనెను.

చదువుల్ నేర్చితినంచు గర్వము వహించజారాదు; నీకున్న యూ
చదువేపాటిది? విద్యకుజ వినయమే సద్రూపమౌ; నేర్వద
గ్గది యెంతేన్గలదంచు గర్వ దురహంకారంబులజ బాయుమీ
హృది దానజ ఘటియించెదజ సుగతి; ఏమీ, నిన్నుపేక్షింతునా?

## మాత్సర్యము- ఈర్ష్య

షడ్వికారములందు మాత్సర్యము-ఈర్ష్య- మిక్కిలి తేలికగాజయింపద గినది. దీనివలన నీకుకలుగు లాభముగాని నష్టముగాని లేదు. ఇతరుల లాభా న్నత్యములగూర్చి ఓర్వలేనితనమిది. ఇతరునకు గొప్ప భాగ్యము- అధికారము గలిగిన మన కోర్వలేము. వానిని నిందింతుము. నిరసింతుము. ఇతరునకు

నష్టముకలిగిన ఆనందింతుము. ఇది మంచిదా? ఎదుటివాడు భాగ్యవంతుఁడైన మనకుకలిగిన నష్టమేమి? వాఁడుచెడిన మనకుగలుగు లాభమేమి? కాని జనులు ఈవిషయము గ్రహింపఁజాలరు. ఇతరునకు మేలు మంచి కలిగిన అతనితో సంతోషించుదము. మనకుకలిగినట్లానందించుదము. మనకుగూడ కలుగునట్లు ప్రియత్నించుదము. మనకోరిక మనబుద్ధి అపథముగ నుండవలయును. మనదగ్గరనుండి ఎవటివాఁడు తీసికొనిపోయినది లేదు. వాని పూర్వాకృత సుకృత విశేషముచే వానికట్టి భాగ్యాన్నత్యములు కలిగినవి. దానికై మన మేల విచారపడవలయును. కావున నానా! ముందు ఈర్ష్యను (మాత్సర్యము) జయింపుము. అని బాబా బోధించెను.

పరుల కలిమికి సంతోషపడుట మేలు
ఇతరులకుఁ జెట్టఁ గలనేని నెంచఁబోకు;
మొరుల కలిమిలేముల నీకు తరుగు పెఱుగు
లేమి? యెల్లవిధంబుల నీర్ష్య విడుము!

## లోభము – అత్యాశ

"ఇతరులకష్టమును- ధనమును వ్యర్థముగ దీసికొనకుము. నీ జీవితమున నిది ముఖ్యనియమముగఁ బాటింపుము." అని, ఇంటిపైనుండి క్రిందికిదిగుటకు నిచ్చెన తెచ్చిన యొకనికి రెండురూపాయలిచ్చుచు బాబా ఈమాటలుపలికెను.

## సాయిభయ్యా. – బడేబాబా.

సాదు భయ్యా (సదాశివదండిరాజు) **15-2-1915** న హార్డాయందొక స్నేహితునితోగూడి సాయంత్రము నాలుగు గంటలకు విహార మేగెను. బాబా అతని కెదురుగవచ్చి అతనిచేతిలో పన్నుకట్టుపుడక నిడి అదృశ్యమయ్యెను. నాస్తికుడగు స్నేహితుఁడదియేమి? అని అడిగెను. "మనమువచ్చినపుడు నాచేతిలో పన్నుకట్టు పుడక లేదు. అది నిజము. ఇప్పుడు కలదు. బాబా దీనినాకిచ్చినాఁడు"- అని భయ్యాసమాధానమిచ్చెను.

ఈవిషయముషిర్డీకివ్రాసి కనుగొనుమని ఆస్నేహి తుఁడనెను. భయ్యా, శ్యామాకువ్రాసెను. శ్యామా, భయ్యాను షిర్డీకి రమ్మనెను. శిర్డీకివెళ్ళి భయ్యా యీవిషయము బాబా ఎదుట చెప్పెను. శ్రీ సాయీప్రభువు బడేబాబాను పోయి చెప్పమనెను. భయ్యా బడేబాబాకుచెప్పెను. బడేబాబా ఖిన్నుఁడై సాయీప్రభువుదగ్గరకువచ్చి "ఏమి బాబా! నీవు నాకు ఎప్పుడు ధనము మాత్రమే యిచ్చుచుంటివి భయ్యాకు సాక్షాత్కారమిచ్చితివి?" అని విలపించెను. "నేనేమిచేయఁగలను ఎవరేమికోరిన నది వానికి లభించును". అని బాబాపలికెను.

బడేబాబా గొప్ప ధనముసంపాదించెను. రాబడిపన్నులు చెల్లించెను. తుదకు సర్వధనము కోల్పోయి దుఃఖమున మరణించెను.

అస్థిరంబు నల్పమౌ లోక విషయాళి
నంద నాతురతయు - నాశ లెంత
లెంతనుండు నీకు నంతంతదూరంబు
నగుదు నీశ్వరునకు ననుచుఁ గనుమి!

## ధ న ము

## (a) ద క్షి ణ

R. B. పురందర్ అను భక్తుఁడు "బాబా! నీవేల అంతలేసిధనము నీదగ్గరకుఁ జేరినవారి నడుగుదువు?"- అని ప్రశ్నించెను. "నే నందఱ నడుగుదునా?- భగవంతుఁడు నిర్దేశించినవారినే అడుగుదును. దానికి పదిరెట్లీయుదును- నా స్వప్రయోజనమున కడుగను- నాకేమి బిడ్డలు- పాపలుకలరా!" అని బాబా సమాధాన మిచ్చెను.

(i) సుఖరోగములచే బాధపడు నొకఁడు శిర్డికివచ్చి బాబాకు 500 రూపాయ లీయఁబోవ "నీచుఁడా! నీ ధనము నాకేల? నీ యింట నొక కొలట నుంచికొంటివిగదా? దానికిచ్చుకొను" మనెను. దానితో నాతఁడు సగము చచ్చి ఆవలకు తొలఁగిపోయెను.

(ii) "నీచులారా! ఆ యీ పాపకర్మములుచేసి నాదగ్గరకు వచ్చుదురా? మీకేమి మేలుచేయఁగలను? పొండు. దూరముగపొండు". అని బాబా కోపముతో నఱచుచుండెను. ఆక్షణమున కొందఱువచ్చి గొప్పకానుకలు బాబాముందుంచిరి. "మీసంగతే నేనిప్పుడుచెప్పునది. మీ కానుకలు తీసికొని ఆవలకు తొలఁగిపొండ" ని బాబా వారిని నిరసించెను.

* * * * * * * *

"ఎవ్వనిఁ గరుణింప నిచ్ఛగింతునొ వాని
యఖిలవిత్తంబు నే నపహరింతు"

S. R. V. జయకర్ అను నతఁడు బాబా చిత్రపటమును రచించి ద్వారకామాయి యందుంచెను. ఒకనాఁడతఁడు తనజేబులో రు 2-8-0 లు ఉంచికొని బాబాఎదుట నిలచియుండెను. బొంబాయినుండి యొక బ్రాహ్మణుఁడటకువచ్చి "బాబా! సత్యవ్రతము చేసికొనవలయును ధనములేద" నెను. నీకెంతకావలయునని బాబా అడిగెను. రు 2-8-0 కావలయునని ఆవిప్రుడు చెప్పెను. జయకరును చూపించి యితనిదగ్గరనున్నది తీసికొనుమనెను. ఆవిప్రుడు ప్రార్థింప జయకర్ తనదగ్గిరనున్న ఆధనమంతయు ఇచ్చివేసెను.

P. R. అవస్తే అనునతఁడు ఇందూరు కోర్టు ఉద్యోగి బాబాభక్తుఁడు. భార్యయు పుత్రుఁడు వెంటరా శిర్డికివచ్చెను. కొమారునిపెండ్లి జరుపఁబోవుచుండెను. 300 రూ. భార్యదగ్గర. 400 రూ. కుమారుని దగ్గర ఉంచెను. పిల్ల సొమ్ముకని ఆధనము కూడఁబెట్టెను. బాబానుచేరగా వారిదగ్గరనున్న ధనమంతయు పలుమారులుగ నడిగి తీసికొనెను. ధనమంతయు పూర్తియైనది. బాబా ఇఁక అడుగలేదు. విచారముగ అవస్తే వెడలిపోవుచుండ. బాపు

సాహెబుజోగ్ అతని వీపుతట్టి "నీవు అదృష్టవంతుఁడవు సుమా! బాబా నీదగ్గరనున్న ధనమంతయు తీసికొనినాఁడు. నీకు పది రెట్లిచ్చుటకే అవిధముగఁ గొనినాడు" అనెను. నాకది తెలియదు. పెండ్లికి వెళ్ళుటకైన నాదగ్గర కాని లేదనెను. నీకేమి కావలయునని జోగ్ ప్రశ్నింప నూరురూపాయలు కావల యునని అవస్తే సమాధానమిచ్చెను. జోగ్ వెంటనే రు 100/లు ఇచ్చెను. బాబా రు 600/లు తీసికొనుటలో నీకు నెలకు రు 50/లు వేతనాభివృద్ధి కలుగఁగలదని జోగ్ చెప్పెను. అవస్తే శంకించెను. కాని కోర్టుశెలవలైన తరువాత తనకు రు 50/లు వేతనాభివృద్ధియైనట్లు అవస్తే తెలిసికొనెను.

తొలిఫలము, దక్షిణల రూపమున బాబా తీసికొని ఆయా భక్తుల ననుగ్రహించిన సందర్భములు అనేకములుగలవు.

## ఆస్తులు

(గడ్డివామి)

మార్వాడీ బాగ్‌చంద్ గడ్డివామి నిప్పంటుకొనెను. బాబాదగ్గరకు వచ్చి తనకుగలుగు నష్టము నివారింపుమని అతఁడుకోరెను. అంతట బాబా "లాభనష్టములు పుట్టువులు చావులు దైవాధీనములు. ఆ భగవంతుని నీవు మఱతురుసుమా! లాభము కలిగిన నుబ్బుదురు. నష్టమైన దుఃఖింతురు. ఏల? 'ఇది నాది'- అందురు. దాని భావమేమి? ఆవామి మార్వాడీదికాదు. అది గడ్డిగాని అతనిశరీరముకాదు. విత్తనములవలన నేలపై మొలచినది. మేఘ ములనుండి కురిసిన వర్ష జలముచే సూర్యరశ్మిచే పెఱిగినది. నేల- మేఘములు సూర్యుఁడు దాని అధిపతులు. ఈతఁడు (మార్వాడి) తనది అనుట అర్థము లేనిమాట, ఈమూటియందు అగ్నిగలదు. అది ఆవామిని దహించుకొనినది. మనము ఆవామికి అధిపతులముకాము. భగవానుఁ డొకచేతితో నిచ్చును. మఱొకచేతితోఁ దీసికొనును. ఓ శ్రేష్ఠీ! ఇంటికిఁబొమ్ము. మఱియొకవామిపా నమున నీ నష్టము తిరిగి రాబట్టుకొందువుగాక!"- అని చెప్పెను.

## ఆ జ్ఞ

"కాకా దీక్షిత్ దగ్గరనున్న ఆవు జాల్నా పనిషికిచెందినది. అంతేగాక బూర్వము ఔరంగాబాదు వానిది. దానికిముందు పహాల్నాపుదది. అదిఠెవ రిదో భగవానునకెఱుక!

"పరమాత్మ యిడున చెప్పటిని జెడదు
నరుఁడొసంగునది యెంతయు నిల్వఁబోదు."

ఒకసందర్భమున బాబా- నానాసాహెబుతో నిట్లనెను.

కనుమీ మూరెఁడు చింపిప్రాత-తొడు గంగా లంగోటిఁ గుప్పియుఁ
దినఁగామూకుడు; త్రావఁపాత్ర, గల యీదీనుఁ దయఁ మాలి యీ
జనముల్ వేతురు భోగభాగ్య వివిధైశ్వర్యాదులఁ గోరి; యే
మని పల్కుందగు వీరలందఱకు? నానా! నీవ యోజింపుమా!

---

## పేద ఱికము

బాబా ఒకసందర్భమున నిట్లు చెప్పెను.

పేదతనంబుకంటెఁ బృథివిఁ విభవంబులు లేవు; రాజ స
మ్మోద పదంబుకంటె నది పోల్పఁగ వేయివిధాల మేలగుఁ
పేద సహోదరుండు హరి; పేద యథార్థము చక్రవర్తియౌ,
పేదఱికంబు రూపఱదు; వేగమ తూలును రాజ్యసంపదల్.

---

## ఈశ్వరుని శ్రద్ధ

బాబా యిట్లు బోధించెను—

ఈశ్వరుఁడు తనబిడ్డలయెడఁజూపు శ్రద్ధవిషయమై ఎన్నఁడును శంకించ రాదు. తమకవలసినవి యోగ్యములైనవి తప్పక సమకూర్చునని నిండు మనమున జీవి విశ్వసింపవలయును.

తిండి గుడ్డలకొఱకుఁ జింతించుచుండు
వ్యర్థముగ నీ మనుష్య ప్రపంచ మకట!
సకల విశ్వంభరుండైన సాయివిభుఁడు
స్వీయ భక్తజనుల నుపేక్షించునేమి?

బాబాచేసిన ప్రతిజ్ఞ—

ననుగొలుచువాని గేహం
బునఁ గుడువఁగఁ గట్టఁ గొఱత పొసఁగదెపుడుః నా
తని నతనికుటుంబంబును
బనివడి నే వేయికనులఁ బరిరక్షింతున్.

---

# నైతికబోధ

-:సంతృప్తి — శరణాగతి:-

భగవానుఁడొకఁడె యారాధ్యుఁడు
భగవానుఁడె ప్రభువు విశ్వభరణుం డతఁడే;
భగవానుతోడ నెవ్వరు
నెగడఁగ సరిపోల్పఁదగరు నిఖిలమునందున్.

ప్రాణులనెల్ల సృజించును
ప్రాణుల బోషించు, ద్రుంచుఁ బ్రాణిచయము; ని
త్యానంద ధాముఁడౌ భగ
వానుండా ప్రభుని లీల వశమే యెఱుఁగన్?

విశ్వంభరుండు కల్పించిన విధమున
సంతృప్తమనమునఁ జనుట లెస్స.
దేవు నిచ్ఛలకు నధీనులమై యుండి
మెలపినచొప్పున మెలఁగఁజెల్లు,
ఏమి ప్రాపించిన దృఢమతిఁ గైకొని
తృప్తి మోదముల వహింపనగును,
వ్యాకులపడఁదగ దాకైన నల్లాడ
దా పరంధాముని యాజ్ఞలేక.
ఋజుపథంబున వర్తించి, ధృతివహించి,
సాధుమతిగల్గి, గుణ దోషసరణి నెఱిఁగి,
స్వీయ కర్మంబులను ఫలాపేక్షలుడిగి
జీవితంబును బుచ్చిన శ్రేయమొదవు.

స్వాంతమందున మోహ విభ్రాంతి నొంది
తాన సర్వకర్మము లస్వతంత్ర కార
ణంబుగా జేసి తలఁప యుక్తంబుగాదు;
అరయ దైవమే కర్త - నియంత-సుమ్మి!

దైవమె స్వతంత్రుఁడగు నస్వతంత్రులెల్ల
ప్రాణు లా మహాప్రభువు నధీనులగుసు;
ఎల్లచెయ్వులాతని వ-చేయించు నతఁడె,
యని, యెఱింగిన కర్మబంధనము లడఁగు.

ఆకసంబునకై యెగఁబ్రాక చూచు
టరయ యవివేకమైన కార్యంబు సుమ్మి!
దైవ మిందుఁ జేకూర్చిన దానితోడ
తనివినొంది వివేకి సంతసముపొందు.

అని శ్రీ సాయీప్రభువు 'దామియా' తో నొకసమయమున వచించెను.

---

## భూతదయ

బాబా ఒకసందర్భమున చెప్పినమాటలు.

ఎల్లప్రాణుల సతము ప్రేమించఁ దగును
వైరబుద్ధి, ప్రతీకారవాంఛ తగదు;
పరులఁ దెగడుట, లాఘవ పఱచుటెపుడు
కానిపని; మానవునకది హానిగూర్చు.

ఒరులు నినుఁదూలనాడిన నోర్చి యవల
తొలఁగిపొమ్ము, మనంబునఁ గలతఁ గనకు;
దూషణోక్తులు నీమేను దుర్గిస్పృశనవు;
ఒరులు తమకృతిఫలము తా రొందుచుందు,
పొందఁగలవీవు నీదు చెయ్వుల ఫలంబు.

ఆలసత

నిముసంబేని గాలము వ్య
ర్థము సేయంగరాదు; దీశ్వర ధ్యానమొ, నా
మము స్మరియించుటొ, సద్గ్రం
థములను బఠియించుటో హితంకరము సుమీ!

సంశయము విడచి విశ్వాసము వహింపుము.

ఒక ప్రార్థన సమాజసభ్యుఁడు బాబాను సందర్శించుట కేగెను. శిర్డికి చేరు పూర్వ మొకమిత్రునితో చర్చించుచు. భగవద్గీతలందుఁ జెప్పఁబడిన "స్థితప్రజ్ఞుని లక్షణములు బాబాయందు కలవా?" అని తర్కించెను. సమాధానము కుదురని మనస్సుతో చలించు విశ్వాసమున నతఁడు బాబాను సమీపించెను. బాబా, శ్యామానుచూచి "ఈతనిఁగొనిపోయి బోధింపుము" అని ఆజ్ఞాపించెను. శ్యామా అతని దీక్షితో వాడకుఁ గొనిపోయి యీవిధముగ బోధించెను.

లోకులు కాకులు- వారలు
వాకొను వ్యర్థంపు నుడులు పాటింపంగాఁ
బోకుము- సాయీపదములు
మే కొన మదినిల్పు- నీకు మేలగుఁ బొమ్మీ!

అని తెలియఁజెప్పెను. వారిరువురు బాబాదగ్గరకేగిరి. శ్యామా చేసిన బోధ ననుసరింపుమని బాబా ఆ ప్రార్థన సమాజ సభ్యునితోఁ జెప్పెను.

## అమితత్వము తగదు.

బాబా ఉపవాసముల నంగీకరింపఁడు. భుజించవలయునుకాని - అధికముగ భుజించుటయుగాని తగదని - ప్రతివిషయమున మితి తప్పరాదనియు బాబా బోధించెను.

"ఉచితమైన యాహారము సుచితమౌ వి
హారమర్హ కర్మముల వ్యాపారము, మఱి
మెలకువయు, నిద్రఁ దగినట్లుగల యతండు
వ్యసనమును బాపు నీ యోగ మందుచుండు".

భగవద్గీతామృతము. 6-17.

## యోగము - ఉల్లి భక్షణము

ఒక దినమున నానాసాహెబ్ చందోర్కరు తనవెంట నొక యోగాభ్యాసిని గొని బాబాను సందర్శింప నేగెను. యోగాభ్యాస మతనికిఁ గల సందియములను బాబానడిగి తెలిసికొనఁ దలఁచెను. వారు వెళ్ళుసరికి బాబా ఉల్లిపాయలు తినుచుండెను. బాబా తామసాహారము గొనువాఁడు తనకు యోగవిషయమగు సందేహమేమి తీర్పఁగలఁడని అనుకొనెను.

సా.బా:- నానా! జీర్ణించుకొను శక్తి కలిగిన (తామసగుణము నతిక్రమించు సామర్థ్యము గలిగిన) ఉల్లి భక్షించిన నేమి దోషము?

యోగాభ్యాసి, తన మనస్సులోని సందేహము గ్రహించిన బాబా యోగీశ్వరేశ్వరుఁడని నిశ్చయించి బాబాపాదములకుఁ బ్రణమిల్లి క్షమాపణ తెలిపికొనెను.

## బోధ - గమనిక

బాబా ఒకసమయమున త్రాగుడు అలవాటుపడిన D. V. సంచారితో నిట్లనెను.

"బిడ్డా! నీ వేల యిట్లు ప్రవర్తింతువు? నీకీ హెచ్చరిక చేయుచున్నాను. త్రాగుడు మానితివా సరే. లేనియెడల నీకు మరలఁ జెప్పను. నీకర్మము నీవనుభవింతువు.

అంతమందున దుర్గతి నందఁగలవు.
ఒకటి రెంట వారింతు; నీ వౌనర నాదు
బోధ పాటించి సన్మార్గమునను జనెద
వేని మేలగు; లేనిచో హాని గలుగు.

ప్రసవ సమయాన మాతృగర్భంబునందుఁ
బెడ తిరిగియున్న పట్టున బిడ్డనేని
కత్తితో కండె తుంటెముల్ గాగ నఱికి
వెలువరింతురు;- నీవు నావిధముఁ గనుమ!

## బాబా - అడఁకువ.

1917 సంవత్సరమున బొంబాయినుండి తల్లిబిడ్డలు (Mrs. T. & Master T.) బాబాను సందర్శింప శిర్డికి వచ్చిరి. వీరు బాబాదగ్గరకు పలుమారులు వచ్చుచుండువారు.

సా. బా:- బిడ్డా! ఎనిమిది రూపాయలిమ్ము.
బాలుఁడు:- బాబా! నాదగ్గర ఎనిమిదిరూపాయలు లేవు.
సా. బా:- వెళ్ళుము. బాపుసాహెబ్ జోగ్ ను అడిగి తెమ్ము.

బాలుడు బోగ్ దగ్గరకు వెళ్ళెను. వారచట భాగవతములోని ధ్రువచరిత్రచదువుచు వ్యాఖ్యానము చేయుచుండిరి. ఆ సందర్భమున "సాధువులు భగవంతుడుకావన్నను ఆయన అనుగ్రహమున కొన్నిశక్తులు పొందఁగలరు" అని యేమియో చెప్పుకొనుచుండిరి. ఆబాలుడు కోపముతో ఆ చోటువదలి బాబా దగ్గరకు వేగముగఁ జేరెను.

బాలుఁడు:- బాబా! నన్నక్కడకేల బంపితివి?

సా.బా:- ఏమి? ఏమిజరిగినది?

బాలుఁడు:- నిన్ను వారక్కడ కించపరచుచున్నారు. నీవు మానవుఁడవే కాని భగవంతుఁడవు కావని- ఏమేమో చెప్పుకొనుచున్నారు.

సా.బా:- అందసత్యమేమి కలదు?- బిడ్డా! నే నెవఁడను? ఒక అల్పుఁడగు ఫకీరును. నేను దేవుఁడనుకాను. దేవుఁడెంతగొప్పవాఁడు! ఆప్రభువుతో నెవరు సరిపోల లేరు.

బాలుఁడు:- నీ విట్లుపలికి కమ్ము మోసగించుచున్నాఁడవు. నీవు భగవానుఁడవని మేము గాఢముగ నమ్మితిమి. ఎవరేని నిన్ను లాఘవపఱచిన నేనెట్లు సహింపఁగలను? సాధువులను కించపఱచు చోట క్షణమేని నిలువరాదుగదా?

సా.బా:- అవును.

బాలుఁడు:- భగవానుని నిందించిన ఆతఁడాగ్రహించునఁట. ఆయన భక్తులను దూషిన భగవంతుఁడు క్షమించఁడు. అవునుగదా?

సా.బా:- అవును.

బాలుఁడు:- ఆసాధువు గొప్పవాడు ఈసాధువు తక్కువవాఁడు - అని తారతమ్యములనిరూపించు చర్చలవినుటవలనిప్రయోజనమేమి?

సా.బా:- సాధువును నిందించుచోట క్షణమేని నిలువరాదు. (బాలుని శిరము ప్రేమతోఁ దట్టుచు) భాగవతము పఠింపుము. నామ జపము చేయుము.

బాలుఁడు:- మధ్య ఆపిన ప్రత్యవాయము కలుగును. కావున నేను చేయును.

సా. బా:- (తల్లివంక చూచి) అమ్మా! నీబిడ్డవిషయమై పూర్తి భారము వహించువాఁడను.

తల్లి:- బాబా! మాయందలభారము వహించునది నీవే కదా!

(తల్లి బిడ్డలు బాబాకు మ్రొక్కిరి- ఇంతలో మరికొందఱువచ్చిరి)

సా. బా:- (ఆ వచ్చినవారితో) నా భక్తులనుగూర్చి నేనెప్పుడు ఆలోచించు చుందును. భక్తుఁడెవడేని గూలనున్న నా నాలుగు చేతులు చాచి, నాలుగు చేతులపై నెత్తికొని నిలుపుదును. నా భక్తుని నెప్పుడేని పడనీయను.

బాలుఁడు:- బాబా! నీవిప్పుడు "నేను దేవుఁడనుకాను-ఒక పేద ఫకీరు" నని చెప్పితివి. నీవు నాలుగు చేతులెట్లుకలిగి యున్నావు?

(బాబా సమాధానముచెప్పలేదు - ఆబాలునివంక ప్రేమతో చూచి అంగీకారసూచకముగ చిఱునవ్వు నవ్వెను)

---

## పూర్వకర్మ. (దేహప్రారబ్ధము.)

R. S. దేవుతో శ్రీ సాయిప్రభు వీ విధముగఁబలికెను.

ఈజన్మలో నీవు తెలిసికొనజాలిన కృషిఫలము ఈజన్మలోకావించిన కర్మఫలమగును. తెలిసికొనజాలనిఫలము పూర్వకర్మ లబ్ధము. ఒకేపనిచేయు నిరువురకు కలుగు వేఱు వేఱు ఫలములు వారి పూర్వ కర్మానుసారములని తెలియనగును.

పూర్వకర్మ ననుసరించి ఊహింపరాని - తెలిసికొన సాధ్యముగాని మంచి చెడుఫలములు మనముకావించు పనులవలన కలుగుచుండును, కావున గర్వించుటగాని దుఃఖించుటగాని తగదు. ఇతరుల నిందించుట ఎంతమాత్రము కూడదు. నైతిక ధర్మము కలదనియు- అదియే కర్మ ఫలకారియని ఎఱుఁగ నగును. కావున లేశమేని జంకక నైతికధర్మము ననుసరింపుము. అట్లు నీవను సరించి నీ విధ్యుక్తకర్మములఁ గావించిన దానికనుగుణ్యమగు ఫలమీజన్మమున

బాలుఁడు బోగి దగ్గరకు వెళ్ళెను. వారచ్చట భాగవతములోని ఋషభచరిత్రమును వ్యాఖ్యానము చేయుచుండిరి. ఆ సందర్భమున "సాధువులు భగవంతుడు కాకున్నను ఆయన అనుగ్రహమున కొన్నిశక్తులు పొందఁగలరు" అని యేమియో చెప్పుకొనుచుండిరి. ఆబాలుఁడు కోపముతో ఆ చోటువదలి బాబా దగ్గరకు వేగముగఁ జేరను.

బాలుఁడు:- బాబా! నన్నక్కడకేల బంపితివి?

సా.బా:- ఏమి? ఏమి జరిగినది?

బాలుఁడు:- నిన్ను వారక్కడ కించపరచుచున్నారు. నీవు మానవుఁడవే కాని భగవంతుఁడవు కావని- ఏమేమో చెప్పుకొనుచున్నారు.

సా.బా:- అందసత్యమేమి కలదు?- బిడ్డా! నే నెవఁడను? ఒక అల్పుఁడగు ఫకీరును. నేను దేవుఁడను కాను. దేవుఁడెంతగొప్పవాఁడు! ఆప్రభువుతో నెవరు సరిపోల లేరు.

బాలుఁడు:- నీ విట్లుపలికి నన్ను మోసగించుచున్నావు. నీవు భగవానుఁడవని మేము గాఢముగ నమ్మితిమి. ఎవరేని నిన్ను దూషణ పలికిన నేనెట్లు సహింపఁగలను? సాధువులను కించపరచుచోట క్షణమేని నిలువరాదుగదా?

సా.బా:- అవును.

బాలుఁడు:- భగవానుని నిందించిన అతఁడాగ్రహింపఁడు. ఆయన భక్తులను దూషించిన భగవంతుఁడు క్షమించఁడు. అవునుగదా?

సా.బా:- అవును

బాలుఁడు:- ఆసాధువు గొప్పవాఁడు ఈసాధువు తక్కువవాఁడు - అని తారతమ్యములనిరూపించు చర్చలవినుటవలన ప్రయోజనమేమి?

సా.బా:- సాధువును నిందించుచోట క్షణమేని నిలువరాదు. (బాలుని శిరము ప్రేమతోఁ దట్టుచు) భాగవతము పఠింపుము. నామ జపము చేయుము.

బాలుఁడు:- మధ్య ఆపిన ప్రత్యవాయము కలుగును. కావున నేను చేయుదును.

సా.బా:- (తల్లివంకచూచి) అమ్మా! నీబిడ్డవిషయమై పూర్తి భారము వహించువాడను.

తల్లి:- బాబా! మాయందలిభారము వహించునది నీవేకదా!

(తల్లి బిడ్డలు బాబాకు మ్రొక్కిరి- ఇంతలో మఱికొందఱువచ్చిరి)

సా.బా:- (ఆ వచ్చినవారితో) నా భక్తులనుగూర్చి నేనెప్పుడు ఆలోచించుచుందును. భక్తుడెవడేని కూలనున్న నా నాలుగు చేతులు చాచి, నాలుగు చేతులపై నెత్తికొని నిలుపుదును. నా భక్తుని నెప్పుడేని పడనీయను.

బాలుడు:- బాబా! నీవిప్పుడు "నేను దేవుడనుకాను-ఒక పేద ఫకీరు" నని చెప్పితివి. నీవు నాలుగు చేతులెట్లుకలిగి యున్నావు?

(బాబా సమాధానముచెప్పలేదు - ఆబాలునివంక ప్రేమతో చూచి అంగీకారసూచకముగ చిఱునవ్వు నవ్వెను)

---

## పూర్వకర్మ. (దేహప్రారబ్ధము.)

R. S. దేవుతో శ్రీ సాయీప్రభు వీ విధముగబలికెను.

ఈజన్మలో నీవు తెలిసికొనజాలిన కృషిఫలము ఈజన్మలో కావించిన కర్మఫలమగును. తెలిసికొనజాలనిఫలము పూర్వకర్మ లబ్దము. ఒకేపనిచేయు నిరువురకును కలుగు వేఱు వేఱు ఫలములు వారి పూర్వ కర్మానుసారములని తెలియనగును.

పూర్వకర్మ ననుసరించి ఊహింపరాని - తెలిసికొన సాధ్యముగాని మంచి చెడుఫలములు మనముకావించు పనులవలన కలుగుచుండును, కావున గర్వించుటగాని దుఃఖించుటగాని తగదు. ఇతరుల నిందించుట ఎంతమాత్రము కూడదు. నైతిక ధర్మము కలదనియు- అదియే కర్మ ఫలకారి యని ఎఱుంగ నగును. కావున లేశమేని జంకక నైతికధర్మము ననుసరింపుము. అట్లు నీవనుసరించి నీ నిస్వార్థకర్మములు గావించిన దానికనుగుణ్యమగు ఫలమీజన్మమున

గలుగకున్నను మనుజన్మమునైనఁ గలిగి తీరును. నీ యీ జన్మవాసనలకు నీవు పూర్వజన్మముల ననుష్ఠించిన నైతికధర్మమే కారణమనుట స్పష్టము. నిర్వివాదము. కావున నైతికధర్మ నిష్ఠగలిగి ఆ ధర్మమార్గము ననుసరించిన నీ గమ్యమును - నైతికధర్మ పదస్థితుని - భగవంతునిఁ జేరఁగలవు.

"కోసికొందువు విత్తికొనియున్న దాని
తీసికోఁగలవు ప్రీతిని నిడుదాని"

## సత్సంగము - యమ నియమములు.

బాబా ఒక సందర్భమున తనభక్తులతో నీవిధముగఁ బలికెను.

"సమకూర్చు శుభముల సాధుసంగంబు
సమయించు నరుని దుర్జన సంగమంబు".

## యమ నియమములు

1 నిషిద్ధ ఆహార పానీయముల వర్జింపవలయును.

2 ఆహార విహారాదులందు మితి దప్పరాదు.

3 వాగ్వివాదాదు లేమాత్రము తగవు.

4 అసత్యములు పలుకరాదు.

5 వ్యర్థాలాపములు తగవు. తగుమాత్రము సంభాషింపుము.

6 వాగ్దానముల పాలింపుము - ఆర్జవము కలిగి యుండుము.

7 కామబుద్ధిని విసర్జింపుము. లోకములోని కాంతలను నీకంటె పెద్దవారిని తల్లులుగ తక్కినవారిని తోబుట్టువులుగ భావింపుము. భార్యయెడల నేని యుక్తరీతి వర్తింపుము. గార్హస్థ్యసుఖము ననుభవింపఁదగును. కానివానికి బానిసీడు గాకుము. కామవ్యామోహితునకు ముక్తి దుర్లభము. సంభోగాపేక్ష మనస్సును తాఱుమాఱు చేయును. ధృతిని దూలించును. సర్వనాశనము కావించును. దీనిచే విద్యావంతులేని చెడుదురు.

వశము గాని పశువుల మెడలకు గుదిబండ గట్టుదురు. అవి వాని పెడ నడకలను నిరోధించును. వివేకము (యుక్తాయుక్త పరిజ్ఞానము) అను గుది కొయ్యను మనస్సునకు దగిలించి సంభోగేచ్ఛనుండి దాని మరలించవలయును.

కోరికలను స్వాధీనము గావించుకొనవలెను. వానిని నీ యదుపునందుంచుకొనవలయును. కోరికలకే మాత్రము లొంగరాదు. మనస్సును ఇంద్రియములను జయించి యంతశ్శత్రువుల నీవిధముగ స్వాధీనము గావించికొనుము ఏవిషయమునను మితి తప్పరాదు.

1 కామము:- భార్యా విషయమున
2 క్రోధము:- దుష్ప్రవర్తనము నెడ
3 లోభము:- హరినామజపమున. భగవన్నామము స్మరించుటయందు.
4 మోహము:- ముక్తికొఱకు
5 మత్సరము: (అసూయ) చెడుపనులు చేయుటయందు
6 మదము:- (గర్వము) భగవద్దాసానుదాసుడననితలంచుటయందు వర్తింపజేసిన నీకు ఎల్లశ్రేయములు సమకూరును.

రావుసాహెబ్ గాల్వాంకరు నెదుట బాబా ప్రత్యక్షమై "నీకేమి కావలయును?". అని అడిగెను. "నాకు ప్రేమ కంటె నేమియు వలదు" అని యతడనెను. "ఇచ్చి యొసగితిని". అని బాబా పలికి అదృశ్యుడయ్యెను. అదిమొదలు గాల్వాంకరు హృదయము ప్రేమరసపూరిత మయ్యెను.

రాజబల్లి మహమ్మద్ బాబాదగ్గరకువచ్చి మ్రొక్కగా నీకేమి కావలయునని బాబాప్రశ్నించెను. ఆ మహమ్మద్ "నాకు (ఇమాం) విశ్వాసము (భక్తి) అనుగ్రహింపుము" ని కోరెను. అంత బాబా "(అల్లా అచ్ఛాకరేగా) దైవమనుగ్రహించును" అని అభయ మిచ్చెను.

## మరణ భయము.

బాబా ఒకసందర్భమున అప్పా కులకర్ణి మృతికై విలపించు నతని భార్యతో నిట్లనెను.

ప్రాణి చచ్చుటకే యిందు ప్రభవమొందు;
మనుజులెల్లరు మృతికినై జననమొంది
రీవు, నేనును, మఱి యిట నెల్లవారు
నేడొ, రేపొ, మాపో, మరణింపవలయు.

పుటుక చావులు దైవ సంఘటితములగు
వాని రెంటిని నీవు వేర్పఱుపలేవు;
ప్రాణులన్నింట నా పరాత్పరుఁడు పొలుచు
రత్నహారంబునందు సూత్రంబుపగిది.

వాస్తవముగ నెవ్వఁడు పుట్టువాఁడు లేఁడు
అటుల మరణించువాఁడు నెన్నటికి లేఁడు;
కనుము లోఁజూఁపుఁబఱపి నిక్కంబు తోఁచు,
దైవమునకు నీ కెందు భేదంబుఁగనవు.

చినిగిపోయిన వసనముల్ మనుజుఁడెట్లు
తలఁగఁజేసి వినూత్నవస్త్రములఁ దాల్చు;
నటుల జీర్ణంబులైన దేహముల వదలి
యన్య నూతనకాయము లాత్మ పొందు

'అప్ప' నాకంటె ముందుగ నతని జీర్ణ
వస్త్రమును దోసి నూతన వసనమూన
దలంచినాఁడు; వారింపఁగ వలదు-తగదు.
ఆతని 'సుధి' ఁదెమ్ము! ఇమ్మని య్మడుగరాదు.

జనన మరణముల్ లాభ నష్టంబులెల్ల
ఈశ్వరుని హస్త గతములై యెసఁగుచుండు;
అకట! మోహాంధులై జను లశ్వరమగు
విశ్వమునునమ్మి యీశ్వరు విస్మరింతుౖ.

ప్రాణమున్నంతదనుకఁ గాపాడికొనుము,
మృతి సమీపించెనేని చింతింపఁదగదు;
పుటుక చావుల కెందేని మోద ఖేద
ములమ పొందఁడు జ్ఞాని, విమూఢుఁడొందు.

పంచవిధ ప్రాణములఁ బరాత్పరుఁ డొసంగె,
నిడిన తనవాని నా ప్రభువే గ్రహించె;
ఆకసం బాకసంబు, నా యనిల మనిల,
మగ్ని యగ్ని, నంబువు లంబు, నవని యవనిఁ
జేరె; ననివార్య ఘటనకై చింతయేల?

---

## జననము.

బాబా భక్తబిడ్డలతో - జీవుల పుట్టుకచావులగూర్చి యోచింపవలసిన పనిలేదని యీవిధముగఁ దెలిపెను.

మరణము విధాన జననము నెఱుఁగఁదగు, స
నాది ప్రకృతి కార్యంబులయందు నొకటి
గాగ: గర్వకారణమిది కాదు: దీన
మనసునందు నుప్పొంగఁగాఁ బనియు లేదు.

అవని బీజంబులను దాల్చు, నంబుదంబు
వానిపై నీరు వర్షించు, భాస్కరుండు
ప్రీతిఁ గిరణముల్ ప్రసరించి వేడినొసఁగు
భూమియందలి బీజముల్ మొలకలెత్తు.

వసుధ- యంబుదయుతములు- భాస్కరుండు
వారి లీలల నెల్లెడఁ బఱపుచుందు;
రిట్టు మొలకలు పుట్టిన గిట్టినఁ బ్రమో
దంబు ఖేదంబుఁగనరు మనంబులందు.

అటుల నీవును జీవుల పుటుక చావు
లందు మోదఖేదంబుల నందవేని
ఇంక బంధకారణమైన దేమికలదు?
వ్యసనముల్ లేమియే మోక్షమనఁగఁ బఱగు.

## దుఃఖము - స్వార్థపరత.

దీర్ఘకాలవ్యాధిచే బాధపడి యొకఁడు బాబాను స్మరించుచు నసువులఁ బాసెను. అతనిభార్య (50 సంవత్సరముల వయస్సుగలది) బాబాకట్టెదుటకు వచ్చి యేడ్చుచుండ సాయీప్రభు వక్కడివారితో నిట్లనెను.

వినుఁడి! యీ యభాగిని విలపించు విధము;
"ఇంక నాగతియేమి? నాకెవరు తిండి
గుడ్డల నొసంగి యిందు సాకుదురు? నాథ!"
అనెడి;- పతి మోద ఖేదముల్ గనఁగఁబోదు!

శ్రీ సాయీ కరుణ
తృతీయ లహరి
సమాప్తము.



ఓమ్

శ్రీ గణేశాయనమః

శ్రీసాయీనాథాయనమః

# శ్రీ సాయిబా కరుణ

## చతుర్థ భాగము

### బాబా ఇతర సాధువులుగ దర్శనమిచ్చుట.

(i) S. B. నాచ్నే బొంబాయిలో శస్త్రచికిత్స పొందవలసి వచ్చెను. తమ స్వగ్రామమైన 'దహాను' యందతని సోదరుడు - కుటుంబములోనివారు విచారముననుండిరి. ఒకసాధువు వారియింటికివచ్చెను. నాచ్నే వదిన ఆసాధువుకు ఆహారమొసంగెను. అది సాయంకాలము - మధ్యాహ్నము వండిన బెండకాయకూర వేయుట తగదని దానిని దాచి తక్కినపదార్థములు వడ్డించెను. ఆసాధువు బెండకాయకూర తెమ్మనెను. ఆమె తెచ్చి వేసెను. భోజనమైనతరువాత బొంబాయిలో శస్త్రచికిత్స జయప్రదముగ జరిగెననియు క్షేమముగా నాచ్నే యింటికి తిరిగివచ్చునని ఆసాధువుచెప్పి వెడలిపోయెను.

3 సంవత్సరములైనతరువాత నాచ్నే శిర్డీకి వెళ్ళి బాబాను సందర్శించెను.

సా.బా:- (అక్కడనున్నవారితో - 'నాచ్నే' ని వ్రేలుపెట్టి నిర్దేశించి) ఈతనియింటికి నేను వెళ్ళినాడను. ఈతని వదిన బెండకాయకూర వేసినదికాదు.

§ ఆవచ్చిన సాధువునకు బాబాకు ఏమి పోలికలేదు. అతడొక హైందవ సన్యాసి ఆకారమునుండెను. బాబా ఇతరసాధువులకు తనకుగల అభేదతత్వమిట్లు ప్రదర్శించెను.

బాబా:- తపోవనమున సాధువు అభేదస్థితి.

(ii. శ్రీ బాలకృష్ణగోవింద ఉపాసనీశాస్త్రి (Proffessor of Sanscrit, Poona) ఒకసమయమున హరిద్వారము - తపోవనము (స్వర్గాశ్రమము) దర్శింప నేగెను. అచట నొకసాధువు ఉపాసనీ వంశజులు పూజించు సాలిగ్రామము తానొసంగినదియే యని తెలిపెను. ఆ శాస్త్రి-తా మెవరని ప్రశ్నింపగా "అహో! ఒక వృక్షముగలదు. ఇరువు రాచెట్టె క్కిరి. ఒకరు క్రిందికిదిగిరి. మఱియొకరు పైకిప్రాకి వెళ్ళిరి. నీవు తెలిసికొందువు" అని హిందుస్థాని భాషలో పలుకుచు అదృశ్యుడయ్యెను.

కొన్ని సంవత్సరముల తర్వాత (1911 లో) బాలకృష్ణ ఉపాసనీ తన చిన్న తమ్ముడైన కాశీనాథ ఉపాసనీ (ఉపాసనీ బాబా) జాడల నరయుచు కోపర్గాం చేరి అచటి మామ్లత్‌దార్ ప్రార్థనపై శిర్డికి వెళ్ళెను. శ్రీ సాయీ ప్రభువును సందర్శించెను.

సా.బా:- ఖండోబా దేవాలయమునకుఁ బొమ్ము!

బా.గో.ఉ: బాబా! నీ సందర్శన మాత్రమున సకలదేవతా సందర్శన భాగ్యము నాకు లభించినది.

సా.బా:- ఖండోబా దేవాలయమునకుఁ బొమ్ము!

బాలకృష్ణ ఉపాసనీశాస్త్రి మసీదునుండి వెలుపలికి వచ్చి బాబా ఆజ్ఞ దెలుపఁగా 'కాశీనాథ ఉపాసనీ' ఖాండోబా దేవాలయమున నున్నాడని అచ్చటిజనులు తెలిపిరి. బాలకృష్ణశాస్త్రి తనవిషయము తెలిసికొన లేదు. అతనిసంబంధము- అన్వేషణము- బాబా గ్రహించెను. బాలకృష్ణ ఉపాసనీ ఖాండోబా దేవాలయమునుండి తిరిగిరాగానే- పూర్వము తపోవనమున సాధువు హిందూస్థానీ భాషలో పలికినమాటలు "అహో! ఒక వృక్షముగలదు. ఇరువురాచెట్టు నెక్కిరి. ఒకరు క్రిందికి దిగివచ్చిరి. ఒకరు పైకిఁ బ్రాకిపోయిరి". అని పలికెను.

ఈ విధమున తపోవనమునందలి సాధువునకు తనకుఁగల అభేదస్థితి బాబా ప్రదర్శించెను.

## బాబా యతిరూపమున "దేవ్" ఇంటికి పోవుట.

(iii) B.V. దేవ్ ఉద్యాపనము చేయనెంచెను. సంతర్పణముగూడ గలదు. అతడు బాబాను తన నివాసమగు 'దహాను' గ్రామమునకు విందునకు వచ్చునట్లు చేయవలసినదిగా ప్రార్థించుచు శిర్డిలో 'జోగ్' నకు ఉత్తరము వ్రాసెను. జోగ్ బాబాకు ఆవిషయము విన్నవించెను. మఱి యిరువురతోఁగలసి విందునకు తప్పకవచ్చెదననియు - భక్తుని ప్రార్థన మెన్నటికి వ్యర్థముచేయనని 'దేవు' నకు ఉత్తరము వ్రాయుమని బాబా పలికెను.

ఉద్యాపనదినమున (దేవు) అంతకుపూర్వము ఎఱిఁగిన ఒక సన్యాసి మఱి యిరువురతోఁగూడి దేవు ఇంటికివచ్చి "నేను చందా ధనముకొఱకు రాలేదు - విందుభోజనమునకై వచ్చితిని" - అనిచెప్పి భుజించి వెళ్ళెను. 'బాబా మాటచెల్లించినవాఁడు కాఁడు' అని దేవు శిర్డిలోని జోగ్‌నకు ఉత్తరము వ్రాసెను. ఆ ఉత్తరముతో జోగ్ బాబాదగ్గఱకు వెళ్ళెను. ఆ ఉత్తరము తెఱచుటకు పూర్వమే "ఆహా! ఉద్యాపన విందుభోజన మారగింతునని మాటయిచ్చి తప్పినాఁడనని 'భావు' తలంచుచున్నాఁడు. ఇరువురతోవచ్చి విందుభోజనము గొంటినని తెలుపుము. అతఁడు నన్ను గుర్తించినవాఁడు కాఁడు. నేను చందాధనముకొఱకు రాలేదని, ప్రత్యేకము విందుభోజనమునకై వచ్చియుండినట్లు అప్పుడే తెలిపితినని వ్రాయుము" అని బాబా పలికెను. జోగ్ ఉత్తరము వ్రాసెను. వాస్తవముగ సన్యాసిరూపమున బాబా తనయింటికివచ్చి విందారగించెనని 'దేవు' తెలిసికొనెను.

## బాబా - మార్వాడీ భిక్షువు. (అభేదస్థితి)

(iv) బాంద్రాలోని ఆదామ్ దలాలి బాబా భక్తుఁడు. అతనియింటికి ఒక మార్వాడిభిక్షువు అన్నముపెట్టుమని వెళ్ళి అడిగెను. ఆదామ్ అతనికి ధనమిచ్చి మార్వాడిహోటలునకు పంపెను. తరువాత ఆదామ్ దలాలి శిర్డికి వెళ్ళి బాబాను దర్శించెను.

బాబా: (ఆదామ్ దలాలీని వ్రేలుపెట్టి చూపుచు అచ్చటివారితో) "ఈతనియింటికి వెళ్ళితిని. కాని ఈతఁడు నన్ను తిండికై మార్వాడి 'హోటలు' నకు పంపెను" - అని పలికెను.

## బాబా : కుక్కరూపమున సొపులు.

(v) G. S. కపర్ది భార్య ప్రతిదినము మసీదునకు నైవేద్యము గొని వచ్చి అర్పించుచుండెను. బాబాను తన ఇంటికి విందుకైరమ్మని కోరుచుండెను. బాబా వచ్చెదనని మాటయిచ్చెను. కాని వెళ్ళలేదు. ఒకదినమున ఆమె వంటకములు సిద్ధముచేసికొనఁగా ఒకకుక్క అచటకువచ్చెను. దాని అసహ్యరూపము చూచి అదివచ్చి వంటకములఁదాకి మైలపఱచునని ఒక కొఱివికట్టె దానిపై విసరివైచెను. ఆకుక్క పఱుగెత్తెను. ఆమె నైవేద్యము గొని మసీదుఁజేరెను.

కపర్ది భార్య:- బాబా! మావిడిదికి భోజనమునకు రమ్ము!
సా. బా:- అలాగే! నేనువచ్చినపుడు మండుచున్న కొఱివికట్టె నాపై విసరితివి గదా!

§ సమస్త భూతములందు తన ఇష్టదైవమును జూడ నేర్వవలయు నని బాబా ఆమెకు బోధించెను.

---

## బాబా - శరణాగతుల కర్మ విమోచనము.

### (i) డాక్టరు. C. పిళ్ళె - (నారకురుపు)

డాక్టరు. C. పిళ్ళె బాబాఆశ్రితులలోనొకఁడు. అతడునారకురుపుచే మిక్కిలిగ బాధపడుచుండెను. శీర్డియందుండగా H. S. దీక్షిత్‌తో నతఁడిట్లనెను. "కాకాసాహెబ్! దీనిబాధ మిక్కుటముగానున్నది. మరణమే మేలనిపించుచున్నది. ఇది పూర్వకర్మఫలమనుట సత్యము. ఈబాధనివృత్తి చేసి ఆకర్మఫలము మఱి పదిజన్మలలో అనుభవించునట్లుచేయుమని బాబాతో విన్నవింపుము"— అనికోరెను.

దీక్షిత్ ఆవిషయము బాబాకు విన్నవించెను. అంతట బాబా "భయపడవలదని చెప్పుము- పదిజన్మలేల? పది దినములలో ఆబాధనివృత్తి యగును. ఆశ్రితులకు ఆధ్యాత్మిక లౌకిక శ్రేయములు కూర్చుటకే సాధువు లవతరింతురు. 'పిళ్ళే'కు మాత్రము మరణము కావలయును! అతని నిటుగొని రమ్ము. భ్రాంతి నొందనీయకుము". అని పలికెను.

'పిళ్ళే'- బాబాను జేరెను. బాబా తనదిండు అతనికిచ్చి "దానినై ఆనుకొని పరుండుము. కాళ్ళుజాపుము. విశ్రాంతి తీసికొనుము.

భువి నెంతవారికేని బూర్వకర్మ ఫలంబు
లనుభవింపక తీరవయ్యా! నిజము;
కలిమిలేములు, సౌఖ్య కష్టముల్, గౌరవా
గౌరవాదులు, కర్మ కారణములు;
కష్టాదులందున కటకట పడరాదు,
సౌఖ్యాదులను గర్వసరణి తగదు;
ప్రాగ్భవ కర్మ సంభవములై ప్రాప్తించు
వాని నోరిమి సైపవలయు నరుఁడు.

దైవ మీ భువనాళి కాధారభూతుఁ
డతఁడె సంరక్షకుండు, నియంత యతఁడె;
అతనిఁ దలఁపుము - శరణొందు మతని సర్వ
గతుల;- నిన్నెట్లు మనుచునో కనెదవీవ."

అని బాబా బోధించెను.

పిదప నానాచందోర్కరు ఆ కురుపుపై కట్టుకట్టఁగా తీసి వేయుమని బాబా ఆజ్ఞాపించి "కట్టుకట్టిన ప్రాణాపాయము. ఒక కాకియొకటి వచ్చి ఆపుండును పొడుచును దానితో బాధ నివారణమగు" ననెను.

మఱుదినమున పిళ్ళై దిండు నానుకొని మసీదునందు పరుండెను. 'అబ్దుల్' ఇవతలకు వచ్చుచు పొరబాటున చూడకుండ పిళ్ళై కాలి గాయమును తొక్కెను. ఆ వాపులోని చీము- పురుగులన్నియు నొక్కమారుగ వెలువడెను. పిళ్ళై పెద్దపెట్టున కెవ్వని కేక పెట్టెను. అంతటితో సరిపోయెను. కాకి వచ్చునా? అని పిళ్ళై అడుగ. "కాకి (అబ్దుల్) వచ్చి దానిపని చేసి పోయినది. పురుగులన్నియు వెలువడినవి. నీవు వాడకు వెళ్ళి విశ్రమింపుము. 'ఊధి' లోనికి తీసికొనుము- గాయముపై వేయుము" అని బాబా ఆజ్ఞాపించెను. వేరే చికిత్స లేకుండ ఆ నారుకురుపు నివారణమయ్యెను.

---

## (ii) భీమాజి పటేల్ - క్షయ వ్యాధి.

పూనా జిల్లాలోని జున్నేరు గ్రామమున భీమాజి పటేల్ కలడు. అతనికి క్షయవ్యాధి ప్రాప్తించెను. నోటినుండి కళ్ళైవెంట రక్తము పడుచుండెను. ఇంకను ఉదర సంబంధమగు బాధలు కలవు. పెక్కు చికిత్సలు చేయించెను. కాని అన్నియు వ్యర్థమయ్యెను. నానాసాహెబ్ చందోర్కరు అతనిని బాబా వద్దరకు పొమ్మని చెప్పెను. భీమాజి శిర్డి చేరెను. శ్యామా మఱి ముప్పురు పట్టి బండినుండి దింపి పట్టుకొని బాబాదగ్గఱకు గొనిపోయిరి.

సా. బా:- శ్యామా! ఈ దొంగను నాదగ్గఱకు గొనివచ్చి అలవిమాలిన బరువు నామీపుపై పెట్టితివేమి?

అంతట భీమాజి బాబాపాదములపై తలనిలిపి "దీనబంధూ! దిక్కు లేనివాడను. ఈ దీనునిపై కనికరముంచి రక్షింపుము. నీకంటె నన్య శరణ మెఱుగ. నీకరుణ నొకించుక వీనిపై ప్రసరింపుము"- అని ప్రార్థించెను.

సా. బా: (ప్రేమసూచకముగ చిఱునవ్వునవ్వి) "ఇక్కడనుండుము.

వగపుల బాయుమి బిత్త! యింతటను ఏ ప్రారబ్ధ దుష్కర్మం బా
యంగ నీ శిరిడిం జేరినాండ, వెవరే నార్తుల్ సుఖా దుఃఖ దు
ర్భగు లీ ద్వారకమాయి మందిరము సోపానంబులన్ మెట్టు మా
త్రింగనన్ నేర్తురు నిత్యసౌఖ్య విభవార్థశ్రీ పరానందముల్.

శరణుంజొచ్చిన వారి రక్షణముం గూర్ప
దక్షు డిప్పటువెలసిన దైవమూర్తి;
ఎల్లజీవుల పైం బ్రేమ నిత్యుండు పఱపు,
సామి యాతండు సత్కరుణామయుండు!

పొమ్ము! భీమాబాయి యింటియందుండుము". అని బాబా నియమించెను. ఆదినమున బాబా స్వహస్తముగ ఊధి అతనిముఖమున నుంచెను. అభయహస్తమున నతనిని స్పృశించెను. భీమాజిపటేల్ బాబా ఆజ్ఞపొంది స్వయముగనడచి వెళ్ళి బండెక్కి, భీమాబాయి యింటికిం జేరెను. ప్రతిదినము ధుని యందలి ఊధిని మాత్రము సేవించుచుండెను.

బాబా అతనికేమియు మందుమాకులీయలేదు. అంతకంటె బలీయమైన చికిత్సలేచేసెను. భీమాజి రెండుకలలుంగనెను. "మొదటిసారి కల" యందతండు పిల్లవాండు. అతని గురువు పాఠములు బోధించుచుండెను. ఏదో లోపము జరుగ బెత్తముతో పంతులు బాగుగకొట్టెను. నిద్రలో భీమాజి పెద్ద పెట్టున నేడ్చెను. "రెండవ కల" యందు ఎవరో భీమాజి రొమ్ముపై నెక్కిరి. పెద్ద దొర్లుడుబండను అతనిరొమ్ముపై ముందుకు వెనుకకు త్రిప్పిరి ప్రాణమువిసిపోవునంత బాధకలిగెను. మేల్కొనెను. ఈ రెండుస్వప్నములతో నాతనివ్యాధి నిర్మూలమయ్యెను. ఆమరునాడు మెల్లగ మసీదువద్దకు నడచి వెళ్ళి బాబాకు మ్రొక్కెను, అట్లు ఒక నెల శిర్డియందుం గడపి బాబా అనుగ్రహమున సంపూర్ణముగ ఆరోగ్యవంతుడై యింటికి తిరిగివెళ్ళెను.

## బాబా ఇతరుల మనస్సులను చక్కదిద్ది అటంకముల తొలగించుట

### B. V. దేవ్ B. A., మామ్లత్‌దార్.

B. V. దేవ్ అనునతఁడు - మామ్లత్‌దార్ - ఆయన "జ్ఞానేశ్వరి" పారాయణము చేయఁదలంచెను. ఎప్పుడు ప్రారంభించిన నేదొక అటంకము కలుగుచుండెను. బాబా నియమించు నంతవరకు పారాయణ ప్రారంభింపఁ గూడదని నిశ్చయించికొనెను. దేవ్- శిర్డికివెళ్ళి జ్ఞానేశ్వరి గ్రంథమును ఒక రూపాయిని బాబాచేతిలో నుంచి ఆగ్రంథము బాబా తిరిగి యీయవలయు నని కోరెను.

సా. బా:- ఒకరూపాయి ఎందుకు? ఇరువది రూపాయలు తెమ్ము!

దేవ్ 20 రూపాయలిచ్చెను. పారాయణమునుగూర్చి బాబా ఏమియు పలుకలేదు. ఆరాత్రి బాబా అనుగ్రహమునకుఁ బాత్రుఁడై ఆధ్యాత్మికముగ నున్నతస్థితి పొందుచున్న 'బాలక్‌రామ్ మాన్కర్' తో సంభాషించుచు బాబానుగూర్చిన యాతని అనుభవములు- బాబా అనుగ్రహముసంపాదించిన విధముఁ జెప్పుమనికోరెను మరునాటిసాయంత్రము ఆతఁడుచెప్పెదననెను. మరుదినము ఉదయము బాబా దేవ్‌ను పిలువనంపి "20 రూపాయలిమ్ము" అనెను. ఆతఁడు ఆపైకమిచ్చి బాలక్‌రామ్ దగ్గరకు వెళ్ళెను. బాలక్‌రామ్ తన అనుభవములఁ దెలుపఁబోవుచుండెను. ఆక్షణమున బాబా - దేవ్‌ను తన దగ్గఱకుఁ బిలిపించెను దేవ్ వెళ్ళెను.

సా. బా:- ఎవరితో నెక్కడ ఏమి మాట్లాడుచుంటివి?

బి. వి. దేవ్:-దీక్షిత్ వాడయందు బాలక్ రామ్‌తో మీ గొప్పతనమునుగూర్చి మాట్లాడుచుంటిని.

సా. బా:- 25 రూపాయలు తెమ్ము.

దేవ్ తెచ్చియిచ్చెను. బాబా అతనిని మసీదునందు తనదగ్గఱకూర్చుండుమని నియమించెను. అంతట బాబా ఆగ్రహావేశుఁడై "నా ప్రాత పేలికలు దొంగిలించెదవేమి? ముసలివాఁడవయ్యు నిదియేనా నీవు చేయదగిన పని? నిన్నిప్పుడే నఱకెదను"- అనెను.

దేవ్‌కు ఆ ప్రాత పేలికలేవియో ఆక్షేపమేమి చేయుచున్నారో అర్థము కాలేదు. పదినిముసములట్లు కోపముననుండి బాబా, దేవ్‌ను పంపెను. అరగంటయైన తరువాత దేవ్‌ను తిరుగ పిలిపించెను. తక్కినభక్తులు మసీదు నందుఁ జేరిరి. అప్పుడు బాబా దేవ్‌ను ఉద్దేశించి "తంబీ భావ్! ప్రాత పేలికలనుగూర్చి పలుకుచు నిన్ను నొప్పించితినా? ఏదైన దొంగతనమున్న తెలుపవలయును, వేఱు మార్గము లేదు. కానిమ్ము. దైవము సర్వమునుఁ జక్కఁ బెట్టును". అనిపలికి 2 రూపాయలు దక్షిణ తెమ్మనెను. దేవ్ సేకరించి యా పైకమిచ్చెను.

సా.బా:- ఏమి చేయుచున్నావు?

దేవ్:- బాబా! ఏమియు లేదు.

సా.బా:- దీక్షిత్ వాడయందుఁ బ్రతిదినము పారాయణము చేయుము. నేను నీకు చక్కని చిక్కు చెదరని సాలువ నీయఁదలఁచఁగా ప్రాత గుడ్డల దొంగిలించనేల?

దేవ్ 'జ్ఞానేశ్వరి' పారాయణము ప్రారంభించెను. అది మొదలు ఎట్టి ఆతంకము లతనికి కలుగలేదు. దేవ్ స్వానుభవమున బాబా అద్భుతశక్తుల గ్రహింపఁగలిగెను. అది మొదలు ఇతరుల అనుభవములఁగూర్చి తెలిసికొనవలసిన పని యతనికి కలుగలేదు.

§ స్వానుభవమున తెలిసికొనుటయే బాబా ప్రసాదించు పట్టుసాలువ యనియు, ఇతరులవలన తెలిసికొనునది ప్రాతగుడ్డలు దొంగిలించుట వంటిదని దేవ్ తెలిసికొనఁ గలిగెను.

దేవ్ ఎట్టి ఆటంకములులేక జ్ఞానేశ్వరి పారాయణము చేయుచుండెను. బాబా స్వప్నమునందోంచి "నీవుచదువునది బోధపడుచున్నదా?" అని ప్రశ్నించెను. "బాబా! నీ కరుణాలేశములేక నాకెట్లవగాహనమగును?-సుబోధమగునట్లనుగ్రహింపు" మని ఆనందబాష్పములతోఁ బ్రార్థించెను. "నాసమీపమున గూర్చుండి యనుదినము పారాయణము చేయుము. నీకు సర్వము సుబోధము కాఁగలదు"- అని ఆశీర్వదించి అదృశ్యుఁడయ్యెను. దేవ్ మేల్కాంచి పరమానందభరితుఁడయ్యెను.

---

## R. S. దేవు- తలంపులు- ఉపదేశము.

R. S. దేవు అకల్‌కోటకు వెళ్ళుచు శిర్డీకిఁజేరి బాబానుదర్శించెను. బాబా అతనినిఁజూచి "నేను అకల్‌కోటను పోవలయును" అని అనెను. సర్వహృదయాంతర్వర్తియని, దేవు, బాబానుగ్రహించెను.

R. S. దేవునకు అతని వంశానుక్రమాగతుఁడగు నొక గురువుండెను. అట్లున్నను బాబానుజూచి "బాబా! నాకుపదేశము గావించి నాకు గురువు అగుము" అని కోరెను.

అంతట బాబా

"గురువులతోడ నేమిపని? కోరిక లీరికలెత్త నిట్టటుల్
తిరుగఁగనేల? నీవగు హృదిన్ వెలుగొందుచు సాక్షియౌ జగ
ద్గురువునుగన్మ, పల్కుపలుకుల్ విను, మాతనియాన తొఁదలన్
బఱపు, మతండెచేర్చు ననపాయపదం; బిది విశ్వసింపుమీ!"

అని, R. S. దేవు హృదయములోని తలంపులను ప్రకటితములు చేసి యాతని కానందము కలిగించెను.

## అంతర్జ్ఞానము - ( సర్వాంతర్యామి ప్రజ్ఞ)

ఒక దినము మధ్యాహ్న హారతి ముగిసినతరువాత బాబా ఒకరినుద్దేశించి యిట్లు పలికెను.

ఎచటనున్న నేమి చేయుచున్న
నేమి పలుకుచున్న నెంచుచున్న
నేను వానినెల్ల నెఱుఁగఁగాజాలుదు
ననుచు లెస్స తెలిసికొనుమి, బిడ్డ!

ఈ విషయము శ్రీ సాయిప్రభువునందు గాఢ భక్తిగలవారి కందఱకు వారివారి నిత్యానుభవములందు వేద్యము.

### i గజానన్ మహారాజు నిర్యాణము.

'షీగోను'- నందు గజానన్ మహారాజు భౌతిక దేహము విడిచెను ఆసమయమునషిర్డీలో బాబా "ఆహా! నాగజాననుఁడు పోయినాఁడుగదా!" అని అనెను. వెంటనే షిర్డీలోనివారు షీగోనుకు ఉత్తరము వ్రాసిరి. తిరుగు టపాలో బాబాపలికిన క్షణముననే గజానన్ మహారాజు పరమపద మొందినట్లు సమాధానము వచ్చెను.

### ii వాసుదేవానందస్వామి — కొబ్బరికాయ.

ఒకసమయమున దాసగణూమహారాజు రాజమహేంద్రవరము చేరి యచట వాసుదేవానందస్వామిని (సుప్రసిద్ధయోగీశ్వరుని) సందర్శించెను. ఆస్వామి ఒక కొబ్బరికాయను గణూదాసునకిచ్చి తనవందనములతో దానిని బాబాకు సమర్పింపుమని చెప్పెను. దాసగణూ- అతనిమిత్రులు తరువాత శిర్డికివచ్చుచు దారిలో ఆకొబ్బరికాయ పగులగొట్టి తినిరి. గణూదాసు

షీర్డీ చేరి బాబాను దర్శించెను. వెంటనే బాబా "ఇదుగో దాంగ! ఏది? సాహోదరుడొసగిన కొబ్బరికాయ ఏది?" యని అడిగెను. గాణూ- తను గావించిన తెలివిమాలిన పనికి క్షమాపణ చెప్పుకొనెను. బాబా కరుణించెను.

## iii కాకా మహారాజ్ నిర్యాణము.

దోపేశ్వర్‌లో కాకా మహారాజు- ఠానాలోని ప్లీడరు H.G. జోషి అను నతనికి అతని మిత్రునకు శిర్డికివెళ్ళి బాబా దర్శనము చేసికొనుడని అనుమతి నిచ్చెను. వారు కొంతతడవు వేచియుండిరి. కాకా మహారాజు గతించెను. తరువాత వారు షీర్డికివెళ్ళిరి. బాబాను దర్శించిరి. "ఆముదుసలిని చంపి వచ్చినారా?" అని బాబా వారినిప్రశ్నించెను.

* * * * * * *

§ 'ఏమి, నిన్ను పేక్షింతునా!'- అను గ్రంథమున గాణూ దాస్ కథ యందు ఈవిషయము విపులముగ వ్రాయబడినది.

## చిదంబర్- కేశవ గాడ్గిల్- బాబాను దర్శించుట.

పూనాలోని భీమశంకర దేవాలయమునందు వసించుచున్న ఒకసాధువు గాడ్గిల్‌ను శిర్డికివెళ్ళి బాబాను దర్శించుకొనుమని చెప్పెను. గాడ్గిల్ మొదటి సారిగ శిర్డికివచ్చి-శ్యామానుసమీపించి "ఇచట ఎవరేని సాధువుగలడా?" అని ప్రశ్నించెను. "ఇచట ఎవరులేరు- అదుగో ఆ కనబడు మసీదులో నొక పిచ్చి మహామ్మదీయ ఫకీరుమాత్ర మున్నాడు" అని శ్యామాపలికెను. గాడ్గిల్ మసీదు జేరెను- బాబా ఆగ్రహముతో "ఈమసీదు మెట్లెక్కకుము- నేనొక మహామ్మదీయుడను. వెళ్ళి ఆభీమశంకర్ దేవాలయము నందలి సాధువుకాళ్ళపైబడుము" అని పలికెను. బాబా అంతర్యామియని గాడ్గిల్ తెలిసికొని యది మొదలు బాబాయందు మిక్కిలిభక్తి కలిగియుండెను.

రెండవతూరి గాడ్గిల్ - L. G. మున్నే - వామన్‌రావు అను మరొక యువకునితో శిర్డీకి ప్రయాణమయ్యెను. దారిలో బాబాకు సమర్పించుటకని ఖర్జూరములు - ఒక రూపాయి - అగరువత్తుల పొట్లము ప్రత్యేకించియుంచెను. శిర్డీకిచేరి సాయీప్రభువును దర్శించెను. వెంటనే "ఏదీ? ఖర్జూరములు, రూపాయి, అగరువత్తుల పొట్లము, ఇటు తెమ్ము!" అని బాబా అడిగెను. గాడ్గిల్ సమర్పించెను.

---

## డాక్టరు ముల్కీ - లోపములు.

డాక్టరు D. M. ముల్కీ పెద్దజబ్బుపడెను. వ్యాధి నివారణమైన పిదప శిర్డీకివెళ్ళి బాబాదర్శనము చేసికొందునని మ్రొక్కెను. వ్యాధి నివారించెను. కాని మాట చెల్లించుకొనలేదు. ఒకతూరి మన్మాడ్ వరకు వచ్చెను. అచట రైల్వే బుకింగు గుమాస్తా "బాబా అవినీతిపరుఁడు. అపాయకారి" యని ఏమేమో ఆ డాక్టరుతో చెప్పెను. ఆమాటలు నమ్మి ముల్కీ తిరిగి బొంబాయి చేరెను. అచట అతని వదినె యతని అవివేకమును దెగడి శిర్డీకి పొమ్మని ఉద్బోధించెను. ముల్కీ వేఱుగతిలేక శిర్డీ చేరి బాబాను సందర్శించెను. అతని మ్రొక్కుబడి - మన్మాడ్ స్టేషను బుకింగ్ గుమాస్తా పలికిన పలుకులు మొదలగు విషయములన్నియు బాబా అతనికిఁ దెలిపి, "లోకులు కాకులు వారిమాటలు విశ్వసింపకుము. నీబుద్ధికి గురుకృపచే తోచినవిధమున ఆచరింపుము" అని, బోధించెను. డాక్టర్ ముల్కీ తన అవివేకమునకు సిగ్గుపడి బాబాను క్షమింపుమని ప్రార్థించెను బొంబాయికి తిరిగివెళ్ళుటకు అనుజ్ఞ నిమ్మని కోరెను. "పొమ్ము - జ్ఞానేశ్వరి పారాయణము చేయుము. ఉన్నత వేతనముపై బీజాపూరునకు నీవు బదిలీ చేయబడిన ఉత్తరువు నీబల్లపైనుండును పొమ్ము" అని, బాబా సెలవొసంగెను. డాక్టరు బొంబాయి చేరగా బాబా పలికిన విధమున ఉత్తరువు బల్లపై నుండుటగని బాబాను వేవిధములఁ గొనియాడెను.

## S. B. నాచ్నే- సెలవు.

S. B. నాచ్నే మొదటిసారి బాబా సందర్శనార్థము శిర్డికి బయలు దేరెను. కోపర్గాంస్టేషన్ చేరెను. "బాబా మిక్కిలి టక్కరి. మాంత్రికుఁడు. దేశమున మనముచూచు గారడివాండ్రవలె ప్రజలను మోసగించుచున్నాఁడు" అని స్టేషన్ మాస్టరు నాచ్నేతోచెప్పెను. ఆమాటలకు నాచ్నే మనస్సొకింత చలించెను. శిర్డి చేరి బాబాను సందర్శించెను.

సా.బా:- మామ్లత్ దారువద్ద సెలవుగొనకయే వచ్చితివా! ఏమి?

నాచ్నే:- అవును.

సా.బా:- అట్లెన్నటికిఁ జేయకుము.

తాను మామ్లత్ దారు గుమాస్తా యనియు- యజమాని సెలవులేకయే తానువచ్చినసంగతి బాబా ఎఱుంగుట నాచ్నేకు ఆశ్చర్యము కలిగించెను. అట్లుచేయుట తగదని చేసినబోధకు సంతోషించెను. బాబా తన అంతర్జ్ఞానము ప్రేమతోగూడిన బోధ- కోపర్గాం స్టేషన్మాస్టరు పలుకులవలన అతనికి గలిగిన మానసికసంచలనము నివారించుటకే ప్రకటించెనని అతఁడుగుర్తించెను.

---

## నాచ్నే - రెండణాలు.

ఒకతఱి నాచ్నే శిర్డికి వచ్చుచుండ నొకభక్తుఁడు ఒక కొబ్బరికాయ అగరువత్తులు- రెండణాలు బాబాకు సమర్పింపుమని అతనికిచ్చెను. నాచ్నే శిర్డికిఁజేరి కొబ్బరికాయ మొదలగు వస్తువులు బాబాకు సమర్పించెను. రెండణాలసంగతి మఱచెను.

నాచ్నే:- బాబా! వెళ్ళివచ్చెదను. సెలవిమ్ము.

సా.బా:- మంచిది. 'చితాలి' మీదుగపొమ్ము. కాని, బీదబ్రాహ్మణుని రెండణాలు ఏల దాచికొనెదవు?

నాచ్చే వెంటనే రెండణాలసంగతి జ్ఞప్తికిఁదెచ్చుకొని బాబాకు సమర్పించి క్షమాపణము చెప్పుకొనెను.

సా. బా:- నీ వేదేని నొకపనికిసమ్మతించిన దానిని సంపూర్తిగనిర్వహింపుము లేదేని ఆపని పెట్టుకొనకుము.

---

## N. లోండా - జాత్యహంకారము.

‘నివాస్’ అను పట్టణమునుండి నగవారి లోండా మఱికొందఱు బాబా సందర్శనార్థులై శిర్డికిఁ జేరిరి. మార్గమధ్యమున తాను బ్రాహ్మణ వంశమున జన్మించి ముసల్మానగు బాబాపాదముల కెట్లుమ్రొక్కుదునా? అని లోండామాత్రము సంకోచించుచు మసీదు జేరెను. తక్కినవారందఱు బాబాపాదములవ్రాలి దక్షిణలు సమర్పించిరి. వారిని బాబా ప్రేమతో ననుగ్రహించెను.

లోండా బాబాదగ్గఱకుఁ జేరవలయునని ద్వారకామాయి మసీదు మెట్లెక్కుచుండ బాబా భయంకరమగు చూపులు ప్రసరించి “ఇక్కడకుఁ జేర సాహసింపకుము. వచ్చితివా? జాగ్రత్త! పొమ్ము”- అని కటువుగఁ బలికెను. ఎన్నిమారులతఁడు ప్రయత్నించినను బాబా ఆవిధముగనే శాసించెను. మసీదువిడిచి బాబాయొక్క ‘బ్రాహ్మణ భక్తుఁడు’ ఉపాసనీమహారాజు నివసించుచున్న ఖాండోబా దేవాలయముఁ జేరెను. అచ్చటఁగూడ తిరస్కరింపఁబడెను.

ఉపాసనీమహారాజు కాళ్ళుచాచుకొని కూర్చుండెను. లోండా ఆ మహనీయునిఁ జేరఁబోవఁగా కాళ్ళుముడుచుకొని “నీవుబ్రాహ్మణుఁడవు- సాయీబాబా దర్శనము చేసికొనఁదగవు. ఇక్కడ నాతో నీకేమిపని?— పొమ్ము”. అని, నిరాకరించెను.

---

## హరికనోబా - పాదరక్షలు.

హరికనోబా- అనునతఁడు బాబాసామర్థ్యము పరీక్షించుటకై మిత్రులతోఁగలసి బొంబాయినుండి శిర్డీఁజేరెను. తలపైజరీతలపాగయు, పాదముల క్రొత్తచెప్పులు ధరించెను. చెప్పులుదూరమున విడచి, మసీదులోనికిఁబోయి బాబాను దర్శించెను. తిరిగి వెలుపలకురాగా చెప్పులుకనఁబడలేదు. వెదకి నిరాశనొంది విడిదిఁజేరెను.

బాబా ఆచెప్పులజత ఒకమహారాష్ట్రబాలునకుఁజూపి "వీనిని నీకర్రకొనకుఁదగిలించి "హరీకా బేటా!జరీకా పేటా!" (హరిబిడ్డా! జరీతలపాగా) అని అఱచుచుఁబొమ్ము. ఎవరేని ఆచెప్పులుతనవియని అనిన-నీవుహరిబిడ్డవా?- నీకు జరీతలపాగా కలదా?- అని ప్రశ్నింపుము- అతఁడే అయిన పాదరక్షలిచ్చిరమ్ము"- అని బాబా నియమించెను. ఆబాలుఁడు అట్లు అఱచుచు హరికనోబా ఉన్న విడిదిఁజేరఁగా బొంబాయినుండివచ్చిన యాతఁడు వెలుపలకువచ్చి తానే హరికుమారుడనని తన జరీతలపాగను చూపి ఆచెప్పులు తనవేయని చెప్పెను. ఆబాలుఁడు పాదరక్షలాతనికిచ్చెను. కనోబా అతని తండ్రి. హరికనోబా- అతనిపేరు. బాబా తనపేరెట్లు తెలిసికొనెనా? యని ఆతఁడాశ్చర్యపడెను.

---

## సోమదేవస్వామి - బాబా ధ్వజములు.

1911 లో సోమదేవస్వామి. బాబా సందర్శనార్థమై శిర్డీకి వెళ్ళెను. ద్వారకామాయి మసీదుపై రెండు పెద్దజెండాలు ఎగురుచుండెను. "గర్వచిహ్నములగు నీ జెండాల నెగురవేయించుట సాధు సాధుత్వమునకు దీఅనికళంకము" అని తనలోఁదలంచి, బాబాను చూడఁదలఁచుకొన లేదని తన తోడివారలతో నతఁడు పలికెను. కాని అతనిస్నేహితుల ప్రోద్బలమువలన సోమదేవస్వామి బాబాను దర్శింపక తప్పినదికాదు. ద్వారకామాయిమసీదు

ముందు మంటపమునుండి బాబాను అతఁడుచూచెను బాబానేత్రము లాతనిఁ బరవశునిఁ జేసినవి. ఆనంద బాష్పములు స్రవించినవి. నోటమాటరాక దిగ్భ్రాంతిఁ బొందెను. ఆపాదమస్తకమానందమునఁ గంపించెను. కాని, యతడు బాబాను చేరఁగా సాయీనాథుఁడు మిక్కిలి ఆగ్రహించుచు "పొమ్ము. నీయింటికిఁ దిరిగిపొమ్ము - మసీదులోనికి ప్రవేశించితివా? జాగ్రత్త! జెండాలు కెక్కి తెసుర వేసికొనువాని దర్శనమునీకేల? అది సాధువుల చిహ్నమా? ఇఁక నీవిక్కడ క్షణమేని నిలువరాదు. పొమ్ము" - అని బాబా పలికెను. బాబా సంపూర్ణ అంతర్జ్ఞానమున కాతఁడు భయ సంభ్రమాశ్చర్యము లొంది, క్షమింపుమని బాబాపాదముల వ్రాలి వేడికొనెను.

---

## గుర్జార్ - ఒక రూపాయి.

దండిరాజ్ - V. గుర్జార్ (వకీల్) బాపుసాహెబ్ శిర్డీకి ప్రయాణమగుచుండ 'కనిత్కార్' అను భక్తురాలు బాబాకు సమర్పింపుమని ఒక రూపాయి ఇచ్చెను. బాపుసాహెబ్ శిర్డీఁజేరి 2, 3 దినములుండెను. ప్రతి దినము బాబా దక్షిణ నడుగుచుండెను, అతఁడిచ్చుచుండెను.

మూఁడవనాడు "ఏమి బిడ్డా! ఈ మూఁడు దినములనుండి నేనువింతగా గమనించుచున్నాను. నేనడిగినప్పుడెల్ల నీధనము దక్షిణయిచ్చుచుంటివి. ఆ అమ్మ యిచ్చిన రూపాయి నీజేబులోనే దాచియుంచితివి. దాని నిప్పుడైన ఇచ్చెదవా?" - అని బాబా అడిగెను. వెంటనే బాపూసాహెబ్ జ్ఞాపకము తెచ్చుకొని 'కనిత్కార్' ఒసంగిన రూపాయిని బాబాకు సమర్పించెను.

---

## బల్లి - పలుకులు

మసీదులందొక బల్లి పలుకుధ్వనిచేసెను. అచట నున్నవారిలో నొకఁడు దానిభావమేమని బాబాను ప్రశ్నించెను. ఔరంగాబాదునుండి తనసోదరి వచ్చుచున్నదని అది ఆనందించుచుండెనని బాబా సమాధానముచెప్పెను.

తోడనే ఒకరు ఔరంగాబాదునుండి గుఱ్ఱముపై శిర్డీకివచ్చి మసీదు జేరెను. సంచినుండి గుగ్గిళ్ళను క్రిందపోసెను. అందుండి ఒకబల్లి చెచ్చెర పాఱుచు మసీదుగోడపైనున్న బల్లిదగ్గఱకుఁ జేరెను. ఆరెండు బల్లులు ఆనందించెను.

## చోల్కార్ - పంచదారతోఁగూడిన తేనీరు.

'చోల్కారు' అనునతఁడు బాబా అనుగ్రహమున పరీక్షయందు గెలుపొంది ఉద్యోగము పడసెను. శిర్డీకిఁజేరి బాబాసందర్శనము చేసికొన వలయునను మ్రొక్కు తీర్చుకొనవలసియుండెను. అతనిజీతము చాలస్వల్పము. అతఁడు పంచదారలేని తేనీరు త్రావుచు పంచదారకై వెచ్చించుధనము శిర్డీ ప్రయాణమునకై కూడఁబెట్టుచుండెను. ఆ కూడబెట్టిన ధనముతో శిర్డీకిఁజేరి బాపుసాహెబ్ జోగ్ ఇంట విడిసి జోగుతోఁగూడి బాబాను సందర్శించి పాదములవ్రాలి నమస్కరించెను "జోగ్!- ఈతనికి లెస్సగా పంచదార తోఁగూడిన 'తేనీరు' ఇమ్ము"-అని చిఱునవ్వుతో బాబాచెప్పెను.

## పండరిన్యాయవాది- కపటము- పరనింద.

కాకాదీక్షిత్తు మిత్రుడైన పండరిలోని న్యాయవాదియొకఁడు శిర్డీకి తన మిత్రులతోఁగూడివచ్చి బాబాపాదములవ్రాలి నమస్కరించి దక్షిణనొసంగెను.

"భావూ! ఈ జనులెంత మోసగాండ్రు! పాదములవ్రాలి నమస్కరింతురు. దక్షిణలర్పింతురు- కాని చాటుగ మనమున నిందించుచుందురు!"- అని బాబా ఆన్యాయవాదినిచూచి పలికెను.

కాకా దీక్షిత్తుతో ఆ న్యాయవాది బాబా పలికిన పలుకులు తనకు సంబంధించిన వేయని పండరీపురమున జరిగిన సంఘటనముంగూర్చి యిట్లు చెప్పెను.

పండరీపురమున 'నూల్కర్' సబ్ జడ్జిగా నుండెను. ఆయన బాబాకు కూర్చుభక్తుడు. ఆ సబ్ కోర్టులోని ప్లీడర్లు అందరు 'బార్ రూమ్' లో కూర్చుండి "ఇంతచదువుచదివి ఈ సబ్ జడ్జి నూల్కర్ చదువులేని ఒక ఫకీరు దగ్గఱకు కంటిజబ్బు- అతిమూత్రవ్యాధి- మొదలగు బాధ్యములు నివారించుకొనుటకై పోవుచున్నాడు"- అని నిందించిరి వారిలో తానుగూడనున్నట్లు ఆ న్యాయవాది దీక్షిత్ తో చెప్పెను.

---

## V.H. టాకూరు – [illegible]

V. H. టాకూరు (B. A,) సర్వే డిపార్టుమెంటులో ఒక గుమాస్తా. ఆయన ఒక కన్నడయోగి- 'అప్పా' అను మహాత్ముని సందర్శించెను. అప్పా- నిశ్చల దాసరచిత 'విచారసాగరము' అను పుస్తకమును టాకూరునకిచ్చి నీవిచటనుండి ఉత్తర ప్రదేశము వెళ్ళునపుడొక మహాసిద్ధ యోగపురుషుని సాక్షాత్కారిని దర్శించుభాగ్యము కలుగునని, ఆయనవలన బోధ ప్రాప్తించునని పలికెను. ఆ టాకూరు తన ఉద్యోగవిధుల నిర్వర్తించుటకై కొండప్రదేశములందు దున్నపోతుపైస్వారిచేసెను. అతని దేహమంతయు నుగ్గునుగ్గయ్యెను. కొన్ని నెలల తరువాత నాతడు శిర్డికి వెళ్ళి బాబానుసందర్శించి మ్రొక్కెను. "ఆ కన్నడయోగి 'అప్పా' నావలన నీకు బోధకలుగునని చెప్పెను. ఈ ఆధ్యాత్మిక పథము చాల కఠినమైనది. కొండప్రదేశముల దున్నపై స్వారి వలె ఇచటగూడ నీవు చాల శ్రమపడవలయును" అని బాబా పలికెను. ఆమాటలు 'టాకూరు' నకు తక్క తక్కినవారికెవ్వరికి బోధపడలేదు.

## మోదక్ స్నేహితుఁడు

ఈయఁదలచినదానిలో కొంతచేయుట.

V. L. మోదక్ తనమిత్రునితో గూడి శిర్డికి వెళ్ళెను. బాబాకు దక్షిణ నీయవలయునని రెండేసిరూపాయలు ప్రత్యేకించి వారిజేబులలో పెట్టుకొని వెళ్ళి సాయీప్రభువునకు మ్రొక్కిరి.

సా. బా:- (మోదక్‌తో) నాకు దక్షిణనిచ్చెదవా?
మోదక్:-తప్పక ఇచ్చెదను. (రెండురూపాయలుతీసి యిచ్చెను)
సా. బా:- (మోదక్ మిత్రునితో) నాకు దక్షిణనిత్తువా?
మో. స్నే:-తప్పక ఇత్తును- (ఒకరూపాయితీసి యిచ్చెను)
సా. బా:- కొందఱుమనుష్యు లెట్టి అసత్యవర్తనులు? ఫకీరునకిచ్చుటకై 2 రూపాయలు ప్రత్యేకించి జేబులో పెట్టుకొనిరి. ఇపుడు ఒక రూపాయ మాత్రమే యీయనేల? ప్రయాణపు ఖర్చులకు చాలదేమో అని అనుకొనిన ఆవలజేబులో పుష్కలముగ ధనములేదా?

మోదక్ మిత్రుడు తన లుబ్ధత్వమునకు సిగ్గుపడి తక్కిన రూపాయి సమర్పించి బాబాను క్షమింపుమని ప్రార్థించెను.

---

## G. S. కపర్దేకుమారుఁడు - దక్షిణ.

కపర్దేకుమారుడు ఒకరాత్రి బాబాతనయింట భుజించినట్లు కలఁగనెను. మఱునాడు బాబాదగ్గరకు వెళ్ళెను. ఆవిషయము ప్రశ్నింపఁదలచెను. ఆతని నోట ప్రశ్నవెడలుపూర్వమే "రాత్రి భోజనము పెట్టితివి. దక్షిణ ఇచ్చినవాఁడవుకావు. ఇప్పుడు దక్షిణనిమ్ము" అని బాబా అడిగెను. ఆతడుబాబా పాదములకు మ్రొక్కి దక్షిణ సమర్పించెను.

---

## V.S. ముల్లీకర్ "పక్కాభక్తుఁడు"

బాంద్రాలో నొకగవర్నమెంటు ఆఫీసులో పెద్దగుమాస్తా ముల్లీకర్ అతడు నానాసాహెబ్‌చందోర్కర్ మఱికొందఱితోగూడి శిర్డికివచ్చుచు 'కోపర్గాం' స్టేషన్‌లో నొకరితో "నానాసాహెబ్‌చందోర్కర్ 'పక్కాభక్తుఁడు'" అని యనెను. వారు శిర్డిచేరి బాబాను సందర్శించిరి? "నానా 'పక్కాభక్తుఁడు' నీవు "కచ్చాభక్తుఁడవా?"- అని బాబా ముల్లీకర్‌ను ప్రశ్నించెను.

---

## D. D. రసానే- ఇంకను జేబులో పైకముగలదు.

D. D. రసానే- అతనిమఱదియు బాబానుజేరి దక్షిణలు పలుమారు లిచ్చిరి. ఇంకను 25 రూపాయలు జేబులోనుండెను. పైకమునకై యింటికి ఉత్తరముల్రాసిరి. బాబాదక్షిణ తెమ్మని అడుగ తమదగ్గర పైకములేదని వారు సమాధానముచెప్పిరి. "అబద్ధములాడెదరేల? జేబులో 25 రూపాయలుకలవు గదా? ఇంకను ఇంటివద్దనుండి పంపుడని వ్రాసియుంటిరి. పైకమురానుండెను!" అని బాబా వారితోననెను.

---

## బాబూరావు బొరావ్కే - మఱచిపోయిన రూపాయి.

చిన్నవాఁడైన బాబూరావు షిర్డికిపోవుచుండెను అతనిదగ్గర పైకములేదు. దారిలో అతని పినతండ్రిదగ్గఱకు వెళ్ళెను. రిక్తహస్తములతో సాధువులదగ్గఱకుఁ బోరాదని ఒక రూపాయి అతనికిచ్చెను. బాబూరావు సాయీప్రభువునుజేరి నమస్కరించెను. రూపాయి దక్షిణతెమ్మని బాబా అడిగెను. తనదగ్గర రూపాయిసంగతి మఱచి లేదనెను. నీజేబులోనున్నది చూడుమని బాబాపలుక రూపాయిసంగతి గుర్తెఱింగి బాబాకు సమర్పించెను.

---

## ముద్రణశాలోద్యోగి - పన్నుగడను వెలిపుచ్చుట.

బొంబాయినుండి ఒక ముద్రణాలయోద్యోగి- ఆతని మిత్రుడు "కొలాంబో" అనువారు బాబాదర్శనార్థమై శిర్డికిఁజేరిరి. ఆ ఉద్యోగి తన దగ్గఱ పైకములేదని ధైర్యముగా చెప్పవచ్చునని తనపైకమును కొలాంబో దగ్గఱనుంచెను. ఇరువురు బాబానుసందర్శించి మ్రొక్కిరి. (కొలాంబోను నిర్దేశించుచు) "ఆతనిదగ్గఱనుండి తీసికొని రెండురూపాయలు దక్షిణనిమ్ము"- అని బాబా ఆ ఉద్యోగినడిగెను. బాబా కనుబ్రాముట దుర్లభమనిగ్రహించి ఆతడు రెండురూపాయలు తనమిత్రుని దగ్గఱనుండి తీసికొని బాబాకు సమర్పించెను.

---

## తార్కాడ్ - చేసినతప్పును సరిదిద్దుకొనదగును.

బొంబాయిలో తార్కాడ్ అనునతడు ఇంటినుండి కచేరీకి వెళ్ళుచుండ నతనిభార్య పైకమేమైనను నిమ్మనెను. తనదగ్గఱలేదనిచెప్పి క్రిందికివచ్చెను. జేబులో రూపాయియుండుట గమనించియు మేడపైకివెళ్ళి యిచ్చుటకు ప్రాలుమాలి కచేరీకి వెళ్ళెను. కొన్నివారములు గడచినతరువాత భార్యాభర్త లిరువురు శిర్డికివెళ్ళి బాబాను దర్శించిరి. "అమ్మా! ఈరోజులలో మనుష్యులు ఎంతమోసగాఁడ్రు! జేబులో రూపాయిఉంచుకొని లేదందురు" అని బాబా అన- కొన్నివారములక్రిందట జరిగిన విషయము- తార్కాడ్- అతనిభార్యతో చెప్పెను.

తప్పుచేసిన వారది తప్పుగాగఁ
దెలిసియును గప్పిపుచ్చుకోఁ దలఁపరాదు;
తాము చేసినపని యది తప్పెయైన
దప్పని క్షమాపణంబుఁ దాఁ జెప్పుటొప్పు.

---

## లాలా లక్ష్మీచంద్.

1910 లో లక్ష్మీచంద్ అనునతఁడు తాను మున్నెప్పుడు చూచియెఱుగని వాఁడును- నెఱసినగడ్డముగలిగి భక్తులతోఁ గూడికొనియున్న ఒక వృద్ధునిఁ గలలోఁ జూచెను. తరువాత గాణూబాబానొద్దగల పటమునుజూచి తాను స్వప్నమునఁగాంచినది శ్రీ సాయీ ప్రభువని తెలిసికొని శిర్డికివెళ్ళి బాబాను దర్శింపఁదలఁచెను. 15 రూపాయలు చేబదులుతీసికొని శిర్డీకి ప్రయాణమయ్యెను. దారిలో శ్రీ సాయీ బాబానుగూర్చి విశేషములు తెలిసికొనుటకు వారిని వీరిని ప్రశ్నించెను. బాబాను సందర్శించి మ్రొక్కెను.

సా.బా:- "నీచుడు!- చూచినవారినందఱను ప్రశ్నించును తనకన్నులతో తానుచూచుచుండగా నితరులనడిగి తెలిసికొనవలసిన పనియేమి? తాను కలలోఁగనినది సత్యమా? కాదాయని తానె అనుభవపూర్వకముగఁ దెలిసికొనఁదగును. మార్వాడిదగ్గర అప్పుతీసికొననేల? దర్శనమున కంత త్వరయేల? ఇప్పటికి మనస్సు తృప్తికలిగినదా?" అని బాబాపలికెను. లక్ష్మీచందు సిగ్గుపడెను.

## బాబా- భక్తులయెడ ప్రేమ.

### (a) వినాయక- S- గిరిధర్ — (మాలాడ్ పురము)

గిరిధర్ భార్య- బాబాయందు గాఢమగు భక్తిగలది. మిక్కిలి శ్రమపడి పెద్దపూలమాల కూర్చి తనభర్త చేతికిచ్చి సాయీప్రభువునకు పంపెను. గిరిధర్ శిర్డికి వెళ్ళి బాబాను సందర్శించి ఆపూలమాల సమర్పించెను. బాబా ఆపూలమాల ప్రేమతోఁ గైకొని కంఠమునధరించి చాలసేపు ఉంచుకొనెను. "నాబిడ్డ దీనిని మిక్కిలి శ్రద్ధాభక్తులతోఁ గూర్చినది. ఈవిధముగ ప్రతి గురువారము పూలమాలనుగూర్చి మీయింటగల నాపటమునకు సమర్పింపుమని చెప్పుము"- అని బాబా గిరిధరునితోఁబలికెను.

(చూడుడు- పుట. 35- తేండల్కార్ కాంత వృత్తము)

## (b) R.B. పురందర్

(i) చూడుడు. పుట 23. "మఱువఁబోను.........నే నారగింప"

(i) చూడుడు. పుట 23.

(ii) "పురంధర్ నీవు ఇల్లుకట్టుకొనుము. ఎవరిని ఒక పైసాయైన అడుగ వలదు. నేను ధనముసమకూర్తును పొమ్ము". అని బాబాపలికెను. పురంధర్ తన ఆఫీసులో 500 రూపాయలు అప్పుతీసికొని ఊరికి వెలుపలగ మైదానమున గృహము నిర్మించుకొనెను. తరువాత శీర్డికి వెళ్ళి బాబానుదర్శించుకొనగా "నీవుఒంటరిగనుంటివనిభయపడకుము. నేనక్కడ ఉండి నిన్నునీభార్యను వేయికనులఁ గాపాడుచుండెద" ననెను. వారికెట్టి ఆపదలు కలుగలేదు.

(iii) 1915 బాబాకు చాలజబ్బుచేసెను. ఉబ్బసవ్యాధి ప్రకోపించి ఆయాసపడుచుండెను. ఈవిషయము తెలియకయే పురంధర్ శీర్డికివెళ్ళి బాబా మిక్కిలి ఆయాసపడుటచూచి ఏడ్చెను.

సా.బా:- ఏల ఏడ్చెదవు?

పురం:- బాబా! నీ కష్టస్థితి చూడలేకున్నాను.

సా.బా:- భయపడకుము. 2, 3 దినములలో తగ్గిపోవును. దైవ మీవ్యాధి నాకొసంగినాడు. ఆగడువులోపల శమించును. నీవు ఏడువవలదు. 2, 3 దినములనుండి నిన్నుగూర్చి అనుకొనుచుంటిని. కాకాదీక్షిత్తుతో నీకు ఉత్తరము వ్రాయుమని చెప్పియుంటిని. (దీక్షిత్తు ఉత్తరము చేరుపూర్వమే పురంధర్ శీర్డికి వెళ్ళెను)

(iv) పురంధర్ తల్లి పండరిపురమునకు విఠోబా దర్శనార్థమై వెళ్ళదలఁచెను. శీర్డిలోం దొకనాడామెయు, పురంధర్ భార్యయు ద్వారకామాయి మసీదు జేరిరి. అచట పాండురంగవిఠల్ - రుక్మిణి రూపమున బాబా దర్శనమిచ్చెను. వారు సంతృప్తి సంతోషములొందిరి.

(తరువాత)

సా.బా:- అమ్మా! పండరిపురమున కెప్పుడు వెళ్ళెదవు?
పురందర్ తల్లి:- నా దైవ మీశిర్డియందే యున్నాఁడు. ఇదియే నా పండరిపురము.

"శిరిడి మాఝే పంఢర్‌పూర్ - సాయిబాబా రమావర"
(ఆరతి—భజన)

(v) సా.బా:- (పురంధర్‌తో,

ఎందు బొంకఁబోక యిచ్చినమాటను
జక్కఁదీర్ప నేర్చి, సహనబుద్ధి
నన్నువిశ్వసించి యున్న నిజ విపక ర
క్షింతుఁ, గూర్తు నెల్లశ్రేయములను.

పురం:- బాబా! కరుణించి నన్నట్లు ప్రవర్తింపఁజేయుము.
సా.బా:- ఎవ్వరితోఁ గలహింపకుము, పోరాడకుము. నీ వితరులతో కల హించుచున్న మనస్సున నొచ్చుకొందును. వినువునొందుదును.
పురం:- బాబా! నన్ను చక్కదిద్దుము.
సా.బా:- దైవ మనుగ్రహించును!

---

## (c) నంపరామ్- మార్వాడి

ఈయనయింట బాబా అనుదినము రొట్టె భక్షించికొని పోవువాఁడు. షిర్డియందు ప్లేగు వ్యాపించెను. అతనికి జ్వరముతగిలెను. శిర్డి విడచి యెక్కడికేని వెళ్ళెదనని బాబాతో చెప్పికొనెను. "వెళ్ళవద్దు — నీవు మరణించవు. నేను మృతినొందువరకు నిన్ను మృతినొందనీయను." అని బాబాపలికి 'ఊధి' నొసఁగెను. జ్వరముతగ్గి సుఖముగనుండెను.

---

## (d) శ్రీ సాయి "శబరి"

1914 సంవత్సరమున శ్రీరామనవమి దినములు. శిర్డియందు జనులు వేలకొలది గుమిగూడియుండిరి. వారిలో నొక వృద్ధవనిత ద్వారకామాయి మసీదుముందు పెద్దగ అఱచుచుండెను.

వృ. వ:- ఓ బాబా! నాయందు దయవహింపుము. ముసలిదానను. నీదర్శనమిమ్మా!

శ్యామా వెలుపలకువచ్చి ఆమెను వెంటఁగొని గుంపులను దోసికొనుచు బాబాదగ్గరకుఁగొనిపోయెను. ఆనందబాష్పములుస్రవింప బాబానడుము రెండుచేతులఁ బట్టికొని సంతోషమొందెను.

సా. బా:- అమ్మా! నీకొఱ కెంతకాలమునుండి నిరీక్షించుచుంటిని! తినుటకు నాకేమైనిఁ దెచ్చివచ్చితివా?

వృ. వ:- బాబా! ఇదిగో ఒక రొట్టెముక్క- ఒక ఉల్లిగడ్డ గలదు. ఇంటనుండి బయలుదేరుచు నొకరొట్టె రెండు ఉల్లిగడ్డలు కొనివచ్చితిని. మార్గమున అలసిపోయి ఉత్తము మొక చెట్టియొద్దున సగమురొట్టె ఒక ఉల్లిగడ్డ తింటిని. శేషించినదిదిగో- నీవు తినుము!

సా. బా:- (మిక్కిలి ఆతురతతో అందుకొని ఆనందమున భక్షించుచు) అమ్మా! నీరొట్టె ఎంత మధురముగానున్నది!

---

## (e) సాయీ- "కుచేలుఁడు"

1913 లో నాకుసప్తాహము జరుగుచుండెను. బాబాచుట్టు గుంపులు గుంపులుగ భక్తులు కూర్చుండిరి. "శ్యామా! నీవు వెళ్ళుము- ఆవెలుపల ఒక వృద్ధుఁడుకూర్చున్నవాఁడు- అతని మూటలో కలకండ యున్నది; అతనినడిగి నాకు కొంచెము కలకండ తెచ్చిపెట్టుము"- అని బాబాపలికెను. శ్యామా వెలుపలకు వెళ్ళెను. అచట ఒక ముదుసలి కూర్చున్నవాఁడు. అతనినోటి

వెంట చొంగ కారుచుండెను. అతని ముక్కుపుటముల ఒకపుటమునుండి చీము కారు చుండెను. ఈఁగ లాతని ముసురుచుండెను. చినుఁగుపాతలాగొకటి ధరించి యుండెను. చినిగిన పాత ఉత్తరీయము నందొకకొనయందు కలకండముక్కను భద్రము చేసికొని యుండెను. శ్యామా అతనిని వెంటగొనివచ్చి బాబా ఎదుట నిలిపెను. బాబా తన వరదాభయకరమున నాతని శిరము స్పృశించి దీవించి, ఆమాతనిభుజమున వ్రేలాడుమూటలోని కలకండ కొంచెముతీసికొని తిని, తక్కినది యామూటలోనే తీసికొనిపొమ్మని అనుగ్రహించెను. అతఁడు దానిని మహాప్రసాదముగ గొనిపోయెను.

---

## (f) అరటిపండ్లు.

బస్సీనుండి బాబా వాఖర్ కార్ అనునతను అరటిపండ్లగెలను ఒక మనిషిద్వారా సాయిప్రభువునకు పంపెను. ఆపండ్లు తెచ్చినవాఁడు బాబాకు సమర్పింపక దూరముగ ఎదుటనిలిచియుండెను.

సా.బా:- (అపండ్లు తెచ్చినవానితో) ఓరీ! ఆ గెలనుండి ఒక పండుతుంచి నాకిమ్ము. అతఁడు (వాఖర్ కార్) ఇంకను భోజనము చేయలేదు, బాబా అరటిపండు తినినాడని తంతినిమ్ము - అప్పుడాతఁడు భుజించును.

బాబా పలికిన పలుకులు తనయజమాని మాటలగుటచే ఆశ్చర్యపడి వెంటనే బాబాకు ఆ అరటిపండ్లగెల సమర్పించెను. ఒక అరటిపండు బాబాతినెను.

---

## తార్కాడ్ కాంత - మిఠాయి

సా. బా:- (గోవింద బలరామ్ మాన్కర్ తో) నాకేమేని తెచ్చితివా?

గో.బ.మా:- బాబా! ఏమియు కొనిరాలేదు.

సా. బా:- నాకిమ్మని యెవరు నీకేమియు నీయలేదా?

గో.బ.మా:- లేదు-బాబా!

సా. బా:- బిడ్డా! బాంద్రానుండి నీవుబయలు దేరునపుడు ఆతల్లి-ఆశార్ఖాడ్ కాంత- భక్తి ప్రేమలతో- నాకిమ్మని మిఠాయి నీకిచ్చి పంపలేదా?

గో.బ.మా:- అవును బాబా! నాకిప్పుడు జ్ఞప్తికివచ్చినది. [అని ఆతడుదానిని తీసికొనివచ్చి బాబాకు సమర్పించెను)

ఆ మిఠాయి చాలదినములక్రిందట చేసినది. బాబాకు నివేదింపఁబడిన దేమూన్కర్ ద్వారా బాబాకుపంపుట కేమియు లేనికారణమున ఆయమ ప్రాత మిఠాయినే అత్యధిక ప్రేమతో పంపించెను. అమృతతుల్యముగ బాబా దాని నారగించెను.

## G. S. కపర్దిసతి - నైవేద్యము.

ద్వారకామాయి మసీదునందు కూర్చుండెను. పలువురుభక్తులు గొని వచ్చి సమర్పించిన భక్ష్యభోజ్యాదుల నిండిన పళ్ళెరములు బాబా ముందుండెను. బాబా అందొక్కదానినేనియుఁ దాకలేదు. G. S. కపర్దిసతి భక్ష్యాదులతో నింపిన పళ్ళెరము గొనివచ్చి బాబాకు సమర్పించెను. వెంటనే బాబా ఆపదార్థములు రుచిచూచెను.

శ్యామా:- ఏమి! దేవా! ఇది ఎట్టివిచక్షణ? ఇతరులు కొనివచ్చినవి తుదకు తాకినవాఁడవుకావు. ఈయమ తెచ్చినవెంటనే రుచిచూచితివి!

సా.బా:- ఈకపర్దిసతి లోగడ నొకజన్మమున నొక కోమటిదగ్గర ఆవై పుట్టి నాకు లెస్సగ క్షీరమొసఁగినది. పిదప తోటమాలి బిడ్డయై పుట్టెను. ఒక క్షత్రియునిఁ జేరెను. ఒక వర్తకుని వివాహమాడెను. ఈజన్మమున బ్రాహ్మణకాంతగ జనించెను. పెద్దకాలముగడచిన తరువాత తిరిగి యీమెనుచూడఁగంటిని. ఈమె నాకొసగినపదార్థము ప్రేమ రసభరితము- మధురతర మైనదిసుమా!

## బాబా - కుష్ఠురోగులయెడదయ.

### (a) కుష్ఠురోగి – మిఠాయి

ఒకనాడు మురికిగుడ్డలలో మిఠాయి మూటగట్టుకొని చెడ్డకంపు ప్రసరించుచు బలహీనుడగు కుష్ఠురోగియొకడు ద్వారకామాయి మసీదు మెట్లెక్కుచు వచ్చెను. ఆమిఠాయి బాబాకు సమర్పించి అందు కొంత ప్రసాదముగ తిరిగి స్వీకరించదలంచెను. మెల్లగ మెట్లెక్కి 'ధుని' దగ్గరకేగి 'ఊధి' తీసికొని బాబాదగ్గరకేగి యిచ్చెను. సిగ్గు, భయములు పెనగొన ఆమిఠాయి బాబాకు సమర్పింపకయే తిరిగిపోవుచుండెను. ఆసమయమున బాబాదగ్గఱ నున్నవారిలో 'మేనేజరు-సతి'- ఆ చెడ్డకంపునుండి విముక్తినొందినటులఁ దలఁచి "ఈపీడ నివృత్తియైనది బ్రతికినాను దేవుడా!"- అని తనమనస్సులో అనుకొనెను సర్వాంతర్యామియగు బాబాకు తెలియనిదేమికలదు?

సా.బా:- (నిశితదృష్టిని ఆమెపైఁ బఱపుచు) ఎవరురా? ఆ పోవుచున్న మనుష్యుని తిరిగి రమ్మనుము!

ఆ కుష్ఠురోగి తిరిగివచ్చి తాను తెచ్చిన మిఠాయిపొట్లము బాబాచేతిలో నుంచెను. బాబా ఆపొట్లము తీసికొని. "ఆహా! ఏమిది. మిఠాయియా?"- అని, అందు కొంచెముతీసి 'మేనేజరు-సతి' చేతిలోపెట్టి 'తినుము'- అనెను. బాబా తానుకొంచెముతినెను. ఆకాంతకు చచ్చినంత పనియైనది. తోడిమానవులను ఆదరించదగుననియు- గురువును విశ్వసింపదగునను పాఠము బాబా తనకుఁ గఱపుచున్నాఁడని తెలిసికొని మాటాడక దానిని మ్రింగెను. మిగిలిన మిఠాయి "ప్రసాదముగఁ గొనిపొమ్ము"-అని బాబా-కుష్ఠువానికొసఁగెను.

* * * * * * *

(b)

సా.బా:- భీమాబాయి! ఈ కుష్ఠువనితను ఇంటికిఁ గొనిపోయి ఆమె నాద రింపుము.

భీమా:- కాని, బాబా! ఆమె కుష్ఠురోగి.

సా.బా:- అదిపాటింపకుము. అయిననేమి?- ఆమె నా సోదరి. ఇంటికిఁ గొనిపొమ్ము!

భీమాబాయి ఆమెను దనయింటికి గొనిపోయి ఒకనెల పోషించెను. పిదప ఆకుష్ఠురోగి మరణించెను.

(c)

సా.బా:- (బాలాజీపటేల్ నవాస్కర్‌తో) బాలా! ఇంటికి వెళ్ళకుము. ఇక్కడ ఉండి ఈ దగ్డుభావ్ (మహమ్మదీయ కుష్ఠురోగి) విషయము కనుగొనుచుండుము.

బాలాజీ బాబా ఆజ్ఞకు బద్ధుఁడై యటనుండి ఆకుష్ఠురోగికి ఆహార పానీయములొసగి పోషించెను ఒకనెలతరువాత ఆకుష్ఠురోగి మరణించెను.

---

## నిర్మల మనస్సుతో నొసగు కానుకలు

(గార్డే- మామిడిపండ్లు- పండిట్- లడ్డు శేషము)

K. K. గార్డే- B. A, L. L. B., అప్పటిలో నాగపూరు సబ్‌జడ్జి- శిర్డికి బాబా సందర్శనార్థమై వచ్చుచు పూనాలో రే మార్కెట్‌నందు మంచి చక్కని మామిడిపండ్లు మూడు కొనితెచ్చి బాబాకు సమర్పించెను.

సా.బా:- (వానిని స్వీకరించుచు) ఆహా! ఈపండ్లను నాకొఱకై పూనా మార్కెట్టులో ఈ (గార్డే) యన విలిచి యుండేమియు తినక తెచ్చియిచ్చినాడునుమా! నిన్నటిదినమున ఆ పండిట్- నాకీయ వలయునని లడ్డు ఒకపొట్లముకట్టి గోదావరిలో స్నానము చేసి, ఆకలినొందుటచేఁ గొన్నిభక్షించి శేషించినవి నాకుతెచ్చియిచ్చెను. ఆలడ్డవలె యీపండ్లు (ఉచ్ఛిష్ట) భుక్తశేషములుంకావు.

## మలినచిత్తముతో నొసంగు కానుకలు.

(భిక్షూబాయి- పూలు- తర్బ్యాజ్ పండ్లు- పాలకోవా)

భిక్షూబాయి అహమ్మద్ నగరమునుండి శిర్డికి తిరిగివచ్చుచు ఒక పెద్దపూల మాల, పుష్పములు, సీమరేగుపండ్లు, తర్బ్యాజ్ పండ్లు, పాలకోవా— బాబా కొఱకు కొనితెచ్చెను. కోపర్గాందగ్గర గోదావరినదిదాటుచు అచట తన మిత్రుమునకు గలిగిన దుర్మరణముఁ దలంచికొని దుఃఖించుచు, తనచెలిని అట్టి దుర్మరణమునుండి తప్పించలేదని తనమనస్సున బాబాను నిందించెను. శిర్డికిఁ జేరెను. ఈవిషయమంతయు మఱచెను. ద్వారకామాయి మసీదులోనికి వెళ్ళి ఆతెచ్చినకానుకలు బాబాకు సమర్పింపఁబోయెను.

సా.బా:- మలినచిత్తముతో నొసగు ఈపూలమాల, కానుకలు నాకువలదు. తీసికొనిపొమ్మ.

కాని ఆమె, పూలమాలను బాబా మెడలో వేయుటకు రెండు చేతులతోఁబట్టి పైకెత్తి బాబాదగ్గఱకేగెను. ఆశ్చర్యముగ ఆపూలమాల మూఁడు ముక్కలై నేలపైఁబడెను. ఫలములను, పాలకోవా నీయఁబోయెను, బాబా నిరాకరించెను.

సా.బా:- ఈయమ గోదావరిదగ్గర ఏడ్చుచు, దుఃఖించుచు, మలినచిత్తముతో వీనినిఁ గొనివచ్చినది. కావున నివినాకు గ్రాహ్యములు కావు.

---

## సంకుచితబుద్ధితో నొసఁగు కానుకలు

[ కానిత్కార్ కాంత— ద్రాక్షపండ్లు ]

కానిత్కార్ సతి- తనకుమార్తెలను వెంటఁబెట్టుకొని, ఒకబుట్టనిండ ద్రాక్షపండ్లు ప్రేమతో తీసికొనివెళ్ళి శ్రీ సాయీప్రభువును సందర్శించెను.

సా. బా:- [దయతో] ఏమి తెచ్చితివి? ద్రాక్షపండ్లా?

కా. కాం:- అవును బాబా! నీకొఱకు నాశిక్ నుండి తీసికొనివచ్చితిని. అంతట ద్రాక్షపండ్లబుట్ట బాబాముందుంచెను. బాబా ద్రాక్షగుత్తుల నొకటిరెండు అటునిటుకదిలించుచుండెను. కానిత్ కార్ కుమార్తె బానుతాయి "ఈపండ్లనన్నిటిని బాబా అందఱకు పంచిపెట్టివ్యర్థము చేయును"- అని అనుకొనెను.

వెంటనే బాబా ఆపండ్లబుట్టను కానిత్ కార్ సతిపై పునకు పెట్టి 'మీవి మీరుతీసికొనిపొండు'- అని పలికెను.

కానిత్ కార్ సతికి పైప్రాణము పైన పోయినట్లయ్యెను. బాబా ఆమెనుగూర్చి చింతించి యొకటి రెండు వాడి వత్తలై పనికిమాలిన పండ్లను గొని "ఇక వెళ్ళుము- మిగిలినవానిని మీబిడ్డలను దిననిమ్ము"-అని ఆపండ్ల బుట్ట నామెకు తిరిగి యిచ్చెను.

కానిత్కార్ సతి ఆమెకుమార్తెలం విడిదికిఁజేరిరి. "అమ్మా! నీవుబుట్ట బాబాకు సమర్పింపగా- 'బుట్టెడుపండ్లు బాబాకు ఇచ్చినది. వానిని వ్యర్థముగా బాబా అందఱకు పంచిపెట్టును. ఆయన యేమియు తినఁడు. తన కేమియు మిగులవు'- అని అనుకొంటిని. ఆతలంపు ఎందుకుఁ గలిగినదో నాకు తెలియదు"- అని బానుతాయి తల్లితోఁ బలికెను.

బాబా పలుకులు చెయ్వులు తల్లి తలంపుల నాదరించినవయ్యె తన యెల అనమ్మతికారణముగ ఆకానుకను నిరాకరించినవయ్యెను.

---

## తన భక్తుల కొఱకు బాబా స్వార్థత్యాగము

### (a) బల్వంత్ G. కపర్దే ప్లేగుజ్వరమును బాబా ఆకర్షించుకొనుట

---

1911-12 లో శిర్డియందు ప్లేగువ్యాధి వ్యాపించెను. G. S. కపర్దే కుమారుఁడు బల్వంతు కపర్దేకు ప్లేగుజ్వరము తగిలెను.

G. S. కపర్దేసతి:- బాబా! వెళ్లుటకు మాకు సెలవొసంగుము.

సా.బా:- అమ్మా! మబ్బులు క్రమ్మినవి. వర్షించును. పైరులు పెరిగి పండును. మబ్బులు విచ్చును. నీవు భయపడ నేల?

బాబా పలుకులు అర్థము చేసికొనక ఆమె విడిదికిఁ జేరెను.

సా.బా:- (మరునాడు తన కఫ్నీ పైకెత్తి తన శరీరముపై ప్లేగుబొబ్బలు చూపుచు) అమ్మా! చూడుము. నీ కష్టములు తొలఁగించుటకు నేను బాధపడవలసివచ్చినది!

బల్వంతు దేహమునుండి ప్లేగుజ్వరమును బాబా ఆకర్షించెను. బాబా జ్వరముతో పాటు బల్వంతుజ్వరము రెండుమూడు దినములలో శమించెను.

## (b) బాబా తన కంఠము నర్పించుట

R.A. తార్ఖాడ్ - మహాల్సాపతి - మఱికొందరు హిందువులు కంధహారు మహమ్మదీయుఁడు మీర్‌జమాన్ బాబాప్రక్కన చావడియందు నిద్రించుచుండిరి. అర్ధరాత్రివేళ మీర్‌జమాన్ నిద్రలేచి బాబాతో నిట్లనెను.

మీ. జ:- బాబా! ఈ హైందవులు - నిన్ను - ఇస్లాంమతమును చెడఁగొట్టుచున్నారు. నాకు సెలవిమ్ము. నా కత్తితో వీరల కుత్తుకల నుత్తరించెదను.

సా.బా:- నేనొక పిచ్చివాఁడను. నన్ను సేవించు ఈ హైందవులు పిచ్చివారలు. వారల మాఢ్యమునకు నేను బాధ్యుఁడను. నా మాఢ్యమునకు వారు బాధ్యులు కారు. ఎవరి కంఠము నేని ఛేదింపఁదలతువేని నా కంఠము నే ఛేదింపుము.

అంతట మాఱుమాటాడక మీర్‌జమాన్ పరుండెను.

## (c) బాబా తన ఆరోగ్యమును త్యజించుట

సా.బా:- (G.S. కపర్దితో 1910 యందిట్లనెను.) కడచిన రెండు సంవత్సరములనుండి నారకుపుచే మిక్కిలి బాధపడుచు రొట్టె నీరు మాత్రమే సేవించుచుంటిని. జనులు గుంపులుగుంపులుగ క్రమ్ముకొని

నాకు విశ్రాంతి నీయరు. ఎందుండి వచ్చితినో అచటకు జేరు వరకు ఈవిధముగ సాగవలసినదే. నాఆరోగ్యమునకంటె నాబిడ్డల సేమమే నేనెక్కుడుగ పాటింతును. కావున నా విషయము లెక్కింపను.

## బాబా భక్తుల ప్రార్థనలను మన్నించుట.

### a) తల్లిప్రార్థనము- (హరిభావ్ పన్సే)

"హరిభావ్- పన్సే- దహానుకర్"— అనునతఁడు తల్లి వలదనుచున్నను రామేశ్వర యాత్రకై పయనమయ్యెను. అతఁడు తిరిగి వచ్చునంతవరకు తల్లి ఉపవాసదీక్షఁ బూనెను. తనకుమారుడు శిర్డియందు బాబాదగ్గరకేగినట్లు తెలిసికొని "బాబా సత్యసాధువే యగునేని నాకుమారుని దక్షిణదేశయాత్ర మాన్పించి తిరిగి యింటికిఁ బంపించును"- అని ప్రార్థించెను. అక్కడ శిర్డి యందు బాబా హరిభావునుచూచి "దక్షిణనిమ్ము"- అని పలుమారులడిగి శిర్డినుండి రామేశ్వరము వెళ్ళివచ్చుటకు తెచ్చికొనిన పైకమంతయు తీసి కొనెను.

సా. బా:- (హరిభావుతో) ఇఁక యింటికిఁబొమ్ము. నీవు ఇల్లు విడచివచ్చినది మొదలు రామేశ్వరము పస్తుపడియున్నది. నీవిప్పుడు వెళ్ళవేని రామేశ్వరము అంతరించును. దానిస్థానమున భద్రేశ్వరముండును.

బాబామాటకు బద్ధుఁడై హరిభావు ఇంటికేగి తల్లి ఉపవాసము- ప్రార్థనవిషయము- తెలిసికొని బాబా అనుగ్రహమును గొండాడెను.

### (b) కుశలభావు- పవిత్రమైనకోరికను బాబా మన్నించుట.

రహాతాలోని బాబాభక్తుఁడు కుశలభావు—"బాబాదర్శనము చేసికొని చాలకాలమైనది— శిర్డికి వెళ్ళవలయు"-నని అనుకొనెను. ఆరాత్రి స్వప్నమున బాబా కనబడి "శిర్డికిరమ్ము" అని చెప్పెను. ఉదయము వెళ్ళుటకు అతనిటాంగాకు గుఱ్ఱములేదు, వెళ్ళఁజాలక తనకుబదులు తనకుమారుని శిర్డికి నడచిపొమ్మని పంపెను. అతనికుమారుఁడు శిర్డికిఁజేరుపూర్వమే-

సా. బా:- కాకా! ఒకటాంగా రహతాకు గొనిపోయి కుశలభావును వెంటఁ గొనిరమ్ము!

హరి సీతారామదీక్షిత్ - రహతాకు వెళ్ళెను, కుశలభావు వచ్చుటకు గుత్తము లేదని కారణముఁ దెలిపెను.

హ. సీ. దీ:- కావుననే టాంగాతీసికొని వెళ్ళి నిన్ను గొనిరమ్మని బాబా నియమించెను.

చాలదివసములనుండి బాబాదర్శనము చేసికొనవలయునని తలంచుచున్న కుశలభావు శిర్డీకివెళ్ళి సంతృప్తినొందెను.

---

## వాధవకర్ - ఆకలి

సదాశివ. T. వాధవకర్ అనునతఁడు బాబా ఎదుట కూర్చుండెను. మిక్కిలి ఆకలినొందియు చెప్పుటకు సంకోచించెను. ఒక 'దూధ్ పేడాలుం' గల పొట్లము బాబాదగ్గరకు గొనిరాఁబడెను. సాధారణముగ బాబా తాకుటే వాఁడుకాఁడు. ఆసమయమున పొట్లమువిప్పి ఒక 'పేడా' తీసి వాధవకర్ ఒడిలోవేసెను. అతఁడు దానిని చేతిలోఁబట్టికొనియుండెను.

సా. బా:- దానిని దగ్గఱ ఉంచుకొనుట కీయలేదు. తినుము!

అంతట వాధవకర్ దానినితినెను. ఆకలి సగముతీరెను.

బాబా మఱియొక 'పేడా' అతని తొడపై వైచెను దానిని వాధవకర్ చేతఁబట్టికొని యింటికిఁదీసికొని పోఁదలఁచెను.

సా. బా:- దానిని దాచిపెట్టుకొనుట కీయలేదు.

అతఁడా రెండవ 'పేడా' కూడ తినెను, ఆకలి పూర్తిగశమించెను. బాబా ఇఁకయేమియు నాతనికీయలేదు.

## B. V. వైద్య- ఆరోగ్యము- భద్రత.

i 1911 లో B. V. వైద్య అనునతడు కుటుంబముతో శిర్డికి రాత్రి 1 గంటకుఁజేరి సాతేవాడలో విడిసెను. అల్పాహారముచేసి పరుండెను. ఉదయమున ఆవాడలోని భక్తులు బాబానుచేరగా 'నాబిడ్డలువచ్చిరి- మీరెవరు వారివిషయము కనుగొనకుండిరి. వారిని పస్తుపెట్టినారు' అని వారిపై కోపించి తనదగ్గఱనుండి (ద్వారకామాయి మసీదునుండి) వెడలఁగొట్టెను.

ii శిర్డినుండి నాశిక్ వెళ్ళదలంచి బాబాదగ్గఱకేగి వైద్య సెలవుకోరెను. సా. బా:- నాశిక్ కు వెళ్ళుదువా? అచట కేల వెళ్ళవలెనను? అచట ప్లేగు గలదు. వెళ్ళవద్దు. నీ బిడ్డలను వెంటఁగొని యింటికిఁ దిరిగిపొమ్ము.

iii వైద్య బాబాచిత్రపటము గొనిపోయి బాబాచేతి కిచ్చెను. బాబా దానిని స్పృశించి (అతడు పూజించుకొనుటకై) తిరిగి యిచ్చుచు 'ఇఁక నీవు వెళ్ళుము'- అని నియమించెను. ఒక టాంగా నేర్పాటుచేసుకొని వైద్య తన కుటుంబముతో కోపర్గాంస్టేషన్ చేరెను. రైలుతప్పెను. వారి దురదృష్ట మనుకొని కొన్నిగంట లుండుండిరి. తరువాత రైలెక్కి 'మన్మాడ్' చేరి వేఱొక రైలెక్కిరి. అంతకుముందు పోయిన రైలులో శొకపెట్టె పడిపోయి తుత్తునియలైనట్లు తెలిసికొనిరి.

iv తరువాత ఒక పర్యాయము వైద్య శిర్డికివెళ్ళి సెలవుగడువు తరువాత 3 దినములు బాబా అతనిని నిలిపెను. 'ఊరకుండుము- భయపడకుము'- అని బాబా చెప్పెను. 3 దినములు తరువాత వైద్య- బాబా అనుమతిపొంది వెళ్ళి అదనపు సెలవు పెట్టుకొన G.I.P. రైల్వేఅధికారులు వెంటనే మంజూరు చేసిరి.

---

## బాబా- M.W. ప్రధాన్ బిడ్డ ఏడుపు అలించుట

M.W. ప్రధాన్ సతి ద్వారకామాయి మసీదునందు బాబాపూజ గావించుచుండెను. తటాలున బాబా ఆపూజ నాపించి,

సా.బా:- ఆపుము. మీ విడిదికి వెళ్ళుము.

ఆమె పూజనాపి విడిదికి వెళ్ళెను. బిడ్డ ఏడ్చుచుండెను. బిడ్డను పాలిచ్చి, నిద్రపుచ్చి, తిరిగి మసీదు చేరెను.

సా.బా:- ఇపుడు నీవు పూజకానిమ్ము.

ఆమెవిడిది మసీదునకుఁ జాల దూరముననున్నను బాబా సర్వవ్యాపి అగుటచేతనే ఆబిడ్డఏడుపు వినఁగలిగెను. ఈవిధమగు శ్రవణశక్తి ప్రసిద్ధ మగు గేయమున నిట్లు పేర్కొనబడినది.

"ముంగీకి పావ్‌మే అవాజ్ హెూవే ఓభి సాయి సునతాహై"॥

"చిన చీమ యడుగువేసిన సవ్వడేని
విన నేర్చు సాయి యీ పృథివి నెందేని".

## పురంధర్- మూర్ఖపు పట్టుదల

వెండిపాలకి కొనిరాబడెను. ఒకనాఁ డందలి వెండిఅలంకారముల నెవరో దొంగలించిరి. R.B. పురంధర్- అతని మిత్రులు- మసీదునకు ఉత్తరపువైపున ఒకగది కట్టఁదలంచిరి. ఆమసీదుగోడకు రంధ్రములు చేయు చుండిరి. బాబావచ్చి ఆపని నిలుపుమనెను. బాబా వలదనినను పురంధర్ ఆపని సాగించుచుండెను. భోజనము విషయముకూడ తలంచక ఆపనియందు మగ్నుఁడైయుండెను.

సా.బా:- చూడుము. ఎట్టి కూడనిపనియో? నామాట వినఁడు. ఇట్టిచర్యలు నేను సహింపవలసివచ్చినవి. (అని పురంధర్‌వైపు జూచి) నీవు భోజనమునకు వెళ్ళుము.

R.B. పురం:- బాబా! నేను వెళ్ళను. నేను చేసిన పనిని చెడగొట్టుదువు.

సా.బా:- చెడగొట్టను. నీవు భోజనమునకు వెళ్ళుము. (పురంధర్ వెళ్ళెను.)

సా.బా:- (అక్కడవారితో) ఏమిచేయఁగలను? బిడ్డ కాలిపై మలము విసర్జించిన కాలిని ఛేదింతుమా? లేక బిడ్డను ఛేదింతుమా? దానిని సహించనగును.

---

## వార్డే- మూర్ఖపు పట్టుదల

వార్డే:- బాబా! ఈ మసీదునందు సత్యనారాయణపూజ చేయుట కనుజ్ఞనిమ్ము.

సా.బా:- చేసికొనుము.

వార్డే వెళ్ళి అరటి పిలకలు తెచ్చి బాబా, సత్యనారాయణ ప్రతిమగాఁ దలంచి నాలుగువైపుల నుంచెను.

సా.బా:- అట్లు చేయవలదు. నేను సమ్మతించను.

అంత పెద్దపెట్టున వార్డే ఏడ్వఁదొడఁగెను. తుదకు బాబా సమ్మతింపక తప్పదయ్యెను.

వార్డే:- బాబా! పూజాసామగ్రి తెచ్చుటకు నావద్దఁ ధనములేదు.

సా.బా:- ఎంత కావలయును?

వార్డే:- రు 2-8-0 లు.

సా.బా:- (జయకర్‌ను వ్రేలితో చూపుచు) అతనిదగ్గఱ కలదు. అప్పు తీసికొనుము.

జయకర్ దగ్గఱనున్న పైకమామాత్రమే. అప్పునీయక తప్పినదికాదు. వార్డే సత్యనారాయణపూజ గావించెను.

---

## బాబా- ప్రేమతో తన బిడ్డలను కనిపెట్టి రక్షించుట

### i. ధూలియా బాహల్కర్ బిడ్డ వ్యాధి

1913 లో రావుజీ బాలకృష్ణ ఉపాసనీ బహల్కర్ చిన్నకుమారుని కు 5, 6 దినములు పెద్దపెట్టున జ్వరము తగిలెను. వైద్యుడు నిరాశ దెలిపెను. బాహల్కర్- ధులియా లోనితనగృహమున బాబాపటము ఎదుట కూర్చుండి బాబాను ప్రార్థించెను. ఆరాత్రి 2 గంటలకు బాబా తోచి బిడ్డకు ఊది అలదుచు "ఆందోళన పడకుము. రెండు గంటలలో చెమటలు పోయును. ఉదయమున బిడ్డకు ఆరోగ్యము కలుగును. బిడ్డకు బాగా నెమ్మది చిక్కినతరువాత నాదగ్గఱకు గొనిరమ్ము"- అని పలికెను. ఆ మఱునాటి ఉదయము 6-3-1913 న బిడ్డకు జ్వరముతగ్గి కుదుటబడెను.

7-3-1913 తేదీన

సా.బా:- (శ్యామాతో) మీ ధూలియా మిత్రుని యింటికి వెళ్ళినాడను.

శ్యామా:- ఎవరా మిత్రుడు? బాబా!

సా.బా:- ఉపాసనీ బహల్కర్ రావుజీ, అతనియింటికి ప్రతిదినము పోవుచుందును. అతనికి ఉత్తరము వ్రాయుము.

ఈ సంభాషణముఁ దెలుపుచు 8-3-1913 న శ్యామా-రావుజీకి ఉత్తరము వ్రాసెను. పదునైదు దినముల తరువాత రావుజీ, అతని కుమారుడు శిర్డీకి వచ్చుచుండిరి. కోపర్గాం దగ్గఱ టాంగాతోలువాఁడు జాగుచేసెను. "మీధులియా స్నేహితుఁడు వచ్చుచున్నాఁడు. బండితోలువాఁడు జాగు చేయుచున్నాడు. మధ్యాహ్న హారతి కొంచెముసేపు నిలిపి తరువాత ప్రారంభింపుడని బాబా- శ్యామాతో చెప్పెను. ప్రసాదము పెట్టబడుసమయము నకు రావుజీ అతని కుమారుఁడు బాబాను దర్శించుకొనిరి.

సా.బా:- (బాలునితో) బిడ్డా! నీవు జబ్బుగా నున్నపుడు ధులియాకు వచ్చి తిని జ్ఞాపకమున్నదా?

## బాబా - మిరికరునకు అభయమిచ్చుట - సర్పము

అహమ్మద్‌నగరు నుండి వచ్చిన సర్దారు మిరికర్ బాబాకు మ్రొక్కి సెలవు తీసికొనుచుండెను.

సా. బా:- మన ద్వారకామాయి యున్నదని నీవెఱుఁగుదువా?

(బాబామాటలు మిరికరునకు అర్థముకాలేదు. మనస్సున ఆందోళనము చెందెను.)

సా. బా:-
నీవు వసియించియున్నదే నిక్కువముగ
'ద్వారకామాయి' యని గ్రహింపంగఁదగును;
అతి దయాహృదయ 'మసూదిఆయి' సుమ్మి!
తనను నెఱనమ్మువారల తల్లియామె.
తనదు బిడ్డల గండముల్ తలఁగఁద్రోసి,
యాపదలఁ బాపి సుఖశాంతు లందఁజేయు
నొకట నీతల్లి శరణొంది యున్న వార
నెందునెట్టి సంకటముల నందఁబోరు.

(అని 'ఉధి' మిరికర్ చేతిలోఁ బెట్టుచు) ఈ పొడుగాటి పెద్దమనిషి నెఱుగుదువా? (బాబా రెండుచేతులు బారసాచి ఒకఅఱచేతిని త్రాచుపడగ వలె నాడించెను. అతఁడంత భయంకరమైనవాఁడు సుమా! కాని, అది ద్వారకామాయి బిడ్డల నేమిచేయఁగలదు? అది కనబడిన దానిని వింతగఁ జూచుదుము. ద్వారకామాయి రక్షణమందున్న బిడ్డను సర్పము తాకగలదా?

బాబా, మిరికర్ వెంట శ్యామాను వెళ్ళుమని నియమించెను. ఆ రాత్రి 9 గంటలకు 'చితాలి' అను గ్రామమున మారుతీదేవాలయమున మిరికర్-శ్యామా మఱికొందఱుండిరి. మిరికర్ వార్తాపత్రికలు చదువుచుండెను. తటాలున వార్తాపత్రికపై ప్రాకినచప్పుడు అచట సేవకుడు వినెను. లాంతరు పెట్టి చూచెను. మిరికర్ ఉత్తరీయము కొంతభాగ మావార్తాపత్రికపై నుండెను. ఆ ఉత్తరీయము కొనయందు సర్పముండెను.

సేవకుడు 'పాము' - 'పాము' అని అరచెను. ఆ సర్పము మిరికర్ వద్దనుండి తొలగిపోయెను. అచట జనులు చేరి దానిని కర్రలతో గొట్టి చంపిరి. మిరికర్ వింతగ చూచెను గాని భయపడలేదు.

## బూటీకి అభయము

నానాసాహెబ్ డేంగ్లే- జ్యోతిషమునందు పెద్ద పండితుడు. ఒక దినమున G. బూటితో "నీకీ దినమున గండము గలదు" అని చెప్పెను. ఆ యిరువురు బాబాను జేరిరి.

సా.బా:- నానా ఏమి చెప్పుచున్నాడు? నీకు మృత్యు ఆసన్నమైనదనియా? ఏమి? మనకు భయపడవలసిన పనిలేదు. తాకును! తాకును! నీ వేవిధముగ తాకి చంపుదువో చూచెదను!

తరువాత బూటి తన విడిదినుండి పెలుపలకు వెళ్ళెను. అచట నొక పెద్ద సర్పమును చూచెను. అతని సేవకుడు దానిని చూచి ఒక పెద్ద కర్రాతిని పైకెత్తెను. కర్ర మంచిది. క్షేమకరమని బూటీ అనెను. కర్రను తెచ్చు లోపల ఆసర్పము తొలగిపోయెను. గండము వచ్చెను. ప్రాణహాని లేకయే తొలగిపోయెను.

* * * * * * *

<u>సూచన:-</u> (ఇట్టివి అసంఖ్యాకములు గలవు. మచ్చునకొకటి రెండుమాత్రము పేర్కొనబడినవి.)

## బాబా- తన భక్తులకు సంతతిని అనుగ్రహించుట

## D.S. రసానే

దామోదర్ S. రసానే ఒక కాంతను వివాహమాడెను. సంతానము లేనికారణమున మఱియొక సతిని వివాహమాడెను. కాని రెండవభార్యవలన సంతతి పొందకుండెను. అతని జాతకమున పుత్రస్థానమున పాపగ్రహముండెను. తక్కిన గ్రహము లనుకూలములుగ లేవు. రసానే బాబాయందు గాఢమగు భక్తిగలవాఁడు. అతఁడు శిర్డికి వెళ్ళగా బాబా అతనికై నిరీక్షించుచుండెను. తనను జేరి మ్రొక్కినవెంటనే నాలుగు మామిడిపండ్ల నిచ్చి-

సా.బా:- దామియా! ఇవుడీపండ్లను తీసికొనుము. తిని చావుము!

దామియా అదిరిపడెను. సంతతిఁ బడసి సంసారబంధములఁ జిక్కికొనుటలు 'ఆధ్యాత్మికమృతి' అని అతఁడు గ్రహింపకుండెను.

సా.బా:- ఆ పండ్లను నీవు తినకుము. నీ భార్య కిమ్ము!

దా:- బాబా! ఏ భార్యకు?

సా.బా:- రెండవ భార్యకు. ఆమెనా పండ్లను దిననిమ్ము. ఆమెకు తొలుత నిరువురు పుత్రులు జనింతురు. పెద్దబిడ్డకు 'దౌలత్ షా' అనియు రెండవ బిడ్డకు 'తానాషా' అనియు పేర్లు పెట్టుము.

తరువాత, బాబా అతనికి మొత్తము ఎనమండుగురు బిడ్డలు కలుగుదురని చెప్పెను. ఆపలుకు యథార్థమయ్యెను. దామియాకు తొలుత నిరువురు మగబిడ్డలు కలిగిరి. మొదటిబిడ్డ పుట్టినతరువాత బిడ్డను బాబాదగ్గఱకుఁ గొనిపోయి "బాబా! ఈ బిడ్డ కేమిపేరు పెట్టుమనెదవు?" అని అడిగెను.

సా.బా:- నేను చెప్పినమాట మఱచితివా? నీ పుస్తకములో మూఁడవ పుటయందు వ్రాసికొనియుంటివి. ఈబిడ్డకు దౌలత్ షా అని పేరు పెట్టమని చెప్పలేదా?

## సపత్నేకర్

సపత్నేకర్- న్యాయవాద పరీక్షకు వెళ్ళుచున్న తనతోడి విద్యార్థినిఁ జూచి 'ఏమీ మిత్రమా! తగిన కృషి లేకయే పరీక్షలకు వెళ్ళఁదలచితివి. ఎట్లు జయము పొందఁగలవు?'- అని ప్రశ్నించెను. 'బాబా అనుగ్రహమున పరీక్ష అగుదును. నాచదువుతో నిమిత్తము లేదు.'- అని ఆతని మిత్రుడు సమాధానమిచ్చెను. ఆమిత్రుని- సాయిబాబాను- సపత్నేకర్ హేళనచేసి నిరసించెను. పరీక్షలయందు బాబా ఆశీర్వాదబలమున ఆతడు విజయము పొందెను. "ఏదో 'గుడ్డిపోటున'- పరీక్షలో నెగ్గితివి" యని సపత్నేకరు తన మిత్రుని హేళనచేసి, బాబాయెడ నిరాదరణము ప్రకటించెను.

సపత్నేకరు- అకల్‌కోటయందు న్యాయవాదవృత్తి నవలంబించెను. పదిసంవత్సరములు గడచినపిదప తన ఏకైక పుత్రునిఁ గోల్పోయెను. అతని మనస్సు బాధనొందెను. బాబాను సందర్శించి క్షమాపణ చెప్పుకొనఁదలఁచెను. అతఁడు శిర్డికివెళ్ళి బాబాపాదములకు నమస్కరించెను.

సా.బా:- వెడలిపొమ్ము.

(కొంచెముసేపు వేచి మరల నమస్కరించెను.)

సా.బా:- పొమ్ము- ఇక్కడనుండి వెడలిపొమ్ము.

సపత్నేకరు విచారముతో తన స్వగ్రామముఁ జేరెను.

సంవత్సరము గడచెను. కరుణామయుఁడగు శ్రీ సాయిప్రభువు సపత్నేకరు భార్యకు స్వప్నమునఁగాంచి ఆ దంపతులను శిర్డికి రమ్మని పిలిచెను. వారు శిర్డికిఁ జేరిరి. ఈపర్యాయము మిక్కిలి వినయముతోఁ దనపూర్వ అపరాధములను క్షమింపుమని వేడికొనెను. అంతట నచటనున్న ఒకగొల్లవనిత నుద్దేశించి సపత్నేకరు జీవిత విషయములన్నియు తనవిగా వివరించెను. ఆ మాటలు వినుచున్న సపత్నేకరు ఆశ్చర్యచకితుడై సర్వకాలముల సర్వప్రదేశముల జరుగు విషయములు బాబాగమనించుట గ్రహించి తనఅంతర్యామిగా బాబాను గుర్తించెను.

ఆ గొల్లసెలతో బాబా మరియు నిట్లనెను.

సా.బా:- (సపత్నేకరవంక వ్రేలుపెట్టి చూపుచు) ఈతఁడు తన బిడ్డను చంపినాఁడనని నన్ను నిందించుచున్నాఁడు. ఇప్పుడు ఆబిడ్డ జీవాత్మనే తిరిగి యీతని భార్యగర్భమున ప్రవేశపెట్టుదును. ♦

♦(41 వ పేజీలో- 'మృతినొందియున్న ............జూతువుషామ్మీ!' చూడుడు.

తనపాదములపై వ్రాలిన సపత్నేకరు శిరమునవరదాభయకరము నిలిపి

సా.బా:- బిడ్డా! విచారపడకుము. నీకోరిక త్వరలో నెర వేరును.

సపత్నేకర్ పరమానందభరితుఁడయ్యెను. బాబాయెడ భక్తి పెంపొందెను. ఆతని భార్యకుగల వ్యాధినిఁ దెలిపి దాని నివారణోపాయము దెలుప ఆతండ్రి అంతర్జ్ఞానమున కాతడాశ్చర్యపడెను. తనవిద్యార్థిదశయందు గల అవివేకమునకు సిగ్గుపడెను. బాబా ప్రత్యక్షదైవమను విశ్వాసము పొందెను. వారు సెలవుతీసికొను సమయమున బాబా ఆతనికొక నారికేళము ప్రసాదించి ఆతని భార్యపైటకొంగున ముడిచికొని సంతోషమున పొమ్మని నియమించెను. వారావిధముగ చేసిరి. 12 మాసములకు పుత్రుడు జనించెను. వారాబిడ్డను బాబాదగ్గఱకు గొనివచ్చి ఆశీర్వాదములు పడసిరి.

## ఔరంగబద్కర్ కాంత

షోలాపూరునందు సఖారామ్ ఔరంగబద్కర్ అను ధనికుఁడు గలఁడు. మొదటిభార్య మరణించుటచే ద్వితీయ వివాహము చేసికొనెను. 27 సంవత్సరములు కాపురముచేసిరి. వారికి సంతతి కలుగలేదు. ఆదంపతులు శిర్డికిఁ జేరిరి. శ్యామా ఆమెను మసీదు సమీపమున నిలిపి బాబా సంతోషముతోనున్న సమయమున పిలిచెదనని చెప్పెను. బాబా భోజనముచేసి లేచెను. శ్యామా నీరుపోయ బాబా చేతులు కడుగుకొనెను. చేతులు తుడిచికొని బాబా- శ్యామాబుగ్గ మెలియపెట్టెను. లేనికోపము ప్రకటించుచు "ఏమి- దేవా! నాబుగ్గ మెలియపెట్టుట నీకుఁ దగునా?"- అని శ్యామా అనెను.

సా.బా:- 72 జన్మలనుండి నీవు నాచెంతనున్నను నిన్నింతవరకు మెలియపెట్టలేదు. అట్లయ్యు నిప్పటికేని నిన్ను తాకుటకు కోపగింతువా?

"సంవత్సరములోపల నీకు బిడ్డ కలుగనియెడల యీతని తలపై కొబ్బరికాయ పగులఁగొట్టి ఈ మసీదునుండి వెలుపలకు లాగివేయు దును. అట్లు కావింపనేని నేను మాధవరావును కాను" అని పలుకుచున్నాఁడు.

సంవత్సరములోపల ఆయమకు మగశిశువు కలిగెను. 5 వ మాస మున వారాబిడ్డను శిర్డీకిఁ గొనివచ్చిరి. కృతజ్ఞతాపూర్వకముగ సఖారాము రు 500/- లు బాబాకు సమర్పించుకొనెను. ఆ ధనముతో బాబా గుఱ్ఱము (శ్యామకర్ణము) నకు శాల నిర్మించిరి.

## భక్తుల ప్రేమకు బద్ధుఁడై బాబా తనపూజకు సమ్మతించుట

1908 లో తొలిసారి నానాసాహెబ్ చందోర్కరుయొక్క 4 సంవ త్సరములబిడ్డ తనగృహమున దేవతావిగ్రహములకు గంధాక్షతలు సమర్పించు విధమున బాబాఫాలభాగమున గంధము త్రిపుండ్రముగా అలది అక్షతలుం చెను. ఆబిడ్డయొక్క ప్రేమకు సంతసించి బాబా సమ్మతించెను. తరువాత మహాల్సాపతి (బాబా ఆంతరంగిక భక్తుఁడు) ఆ విధముగ గంధాక్షతలతో బాబాను పూజించెను. బాబాకుమాత్రము తననట్లు పూజించుట లేశమేని ఇష్టములేదు. ఇతరులెవరు ఆవిధముగ బాబాను పూజించుటకు సాహసించిన వారుకారు.

ఒక దినమున డాక్టర్ పండిట్ బాబాను సమీపించి మొ్రక్కి ముఖ మున గంధాక్షతలు సమర్పించెను. బాబా ఊరకుండెను.

దాదాకేల్కార్:- బాబా! నీవెవరిని గంధాక్షతలతో నిన్ను పూజించనీయవే! ఇప్పుడేల సమ్మతించితివి?

సా.బా:- ఈ పండిట్ తన బ్రాహ్మణగురువగు ధోపేశ్వర్ కాకామహా రాజుగ నన్ను భావించుచున్నాడు. (ఆరూపమున బాబా అతనికి గోచరించెను) ఆతనిగురువునకు సమర్పించునట్లు గంధము సమర్పిం చినాఁడు. కావున నేను నిరాకరింపలేకుంటిని.

అబ్దుల్ రంగారి:- (కొంతసేపయిన తరువాత అక్కడకు వచ్చి) బాబా! ఇదేమి? నీ ముఖమున గంధము నలందినారు? ఇది మన ఆచారము కాదుగదా?

సా.బా:- జైసా దేశ్ వైసా వేష్. (పరిసరముల కనుగుణ్యముగ ప్రవర్తింప వలయును.) హిందువులు వారి దైవముగ నన్ను పూజించుచున్నారు. నేను వారి కేల మనస్సునకు కష్టము కలిగింపవలయును? అటుల వారు సేవించుటకు సమ్మతించితిని. నేను దైవమునకు భక్తుడను.

## బాబా - గురుపూర్ణిమ పూజ

1909 నుండి శిర్డియందు భక్తులు సమిష్టి పూజాహారతులు ప్రతిదినము ద్వారకామాయి మసీదునందు సలుపుచుండిరి. గురుపూర్ణిమనాడు ప్రత్యేక పూజ బాబాకు సలుపు ఆచార మప్పటికి లేదు. ఆ సంవత్సరము గురుపూర్ణిమ నాడు బాబా దాదాకేల్కారును పిలిపించి "ఈరోజు గురుపూర్ణిమ అని నీకు తెలియదా? పూజాద్రవ్యములఁ గొనివచ్చి గురుపూజ సలుపుము". అని నియమించెను.

ఆదినము కేల్కారు ఇతర భక్తులనుజేరి సమర్థ సద్గురువగు శ్రీసాయిబాబాను పూజించిరి. ఆదినము మొదలు ప్రతి సంవత్సరము గురుపూర్ణిమ నాఁడు (ఆషాఢ శుద్ధ పూర్ణిమనాఁడు) శ్రీ సాయిప్రభుభక్తులెల్లరు బాబాను పూజించుచుండిరి. ఆ యాచారము నేటికిని ఆచరింపబడుచున్నది.

## బాబా- భక్తులయెడ శ్రద్ధ

### i నానాసాహెబ్ చందోర్కర్

నానాసాహెబ్ చందోర్కరు పండరికి బదిలీ చేయఁబడెను. పండరికిఁ బోవుచు బాబాను సందర్శించి సెలవు తీసికొని వెళ్ళవలయునని శిర్డీకి వచ్చుచుండెను. ఆ సమయమున తన దగ్గఱనున్న మహాల్సాపతి- కాశీరామ్- అప్పాసింధే అనువారల నుద్దేశించి 'మనము నలువురము భజన చేయుదము. పండరిద్వారములు తెఱువబడినవి. ఆనందమున మనము భజన చేయుదము' అని బాబా ఈక్రింది విధమున భజన ప్రారంభింప నలువురు గానము చేయుచుండిరి.

పదరా! పండరి కేగుదము
ముదమున నట మనముండెదము
ఉందామట మనప్రభువున్నాడు
పొందుగ నాప్రభు వున్నాఁడు ॥పదరా॥

వారిట్లు పాడుచుండగా చందోర్కరు ద్వారకామాయి మసీదుఁ జేరి తన నేమఱక కనిపెట్టియున్న బాబాపాదముల వ్రాలి నమస్కరించెను.

### ii కల్యాణ్ లోని జోషి

ఠాణాలోని న్యాయవాది జోషి తమ్ముఁడగు జోషి కల్యాణ్ నందుండెను. అతనికి శిర్డి వెళ్ళవలయునని గాఢమగు కోరిక గలదు. కాని వెళ్ళజాలకుండెను. కొన్నిరోజుల తరువాత నొక కొంకణాస్థ బ్రాహ్మణుఁడు బొంబాయి వెళ్ళుటకు బాబాసెలవు కోరుచుండెను.

సా. బా:- (ఆబ్రాహ్మణునితో) ఈ ఊదిపొట్లముఁ గొనిపోయి రైలులో కొంచెము 'జాగానిమ్ము' అని నిన్నుకోరు వ్యక్తికీయుము.

కొం. బ్రా:- (ఆ ఊదిపొట్ల మందుకొని) నాకెవ్వరు సందర్భపడనియెడల ఈ పొట్లము తిరిగి మీకు పంపుదును.

సా. బా:- ఆ మనుష్యునిఁ జూతువు.

ఆ బ్రాహ్మణుఁడు కోపర్గాంనుంచి బొంబాయికి ప్రయాణము చేయుచుండెను. కల్యాణ్ స్టేషన్ వరకు ఎవరు కనఁబడలేదు. కల్యాణ్ స్టేషన్ దగ్గర రైలు పెట్టెలన్నియు క్రిక్కిరిసి యుండెను. జోషీ- అబ్రాహ్మణుఁడు కూర్చున్న పెట్టెలో నెక్కి తనకు కొంచెము జాగా ఇమ్మని కోరెను. ఆవిప్రుఁ డతనికి జాగాయిచ్చి ఊధిపొట్లము చేతులందుంచెను.

గమనిక:— i ఆశ్రితులగు తనబిడ్డల ప్రయాణములందు- నిత్యవ్యవహారములందు- వివాహాదికార్యములందు అధివ్యాధులందు బాబా ఏమఱక రక్షణ మొసంగిన విషయములు అసంఖ్యాకములు కలవు.

ii భూతప్రేతాదులు సోకినవారు- శాతబడులవలన బాధపడినవారు పలువురు బాబాను ఆశ్రయించి స్వస్థచిత్తులై సుఖములు పొందిన విషయము లనేకములు గలవు.

iii తనబిడ్డల పూర్వజన్మ వృత్తాంతములను దెలిపి వారిని ప్రతిజన్మము నందు విడువక కాపాడిన విధములు బాబా పెక్కులు పేర్కొనెను. గ్రంథవిస్తరణ భీతిచే విడువఁబడినవి.

♦ "ఏమీ! నిన్నుపేక్షింతునా?" అను గ్రంథమున బాబాభక్తుల అనుభవములు విపులముగఁ బేర్కొనఁబడినవి. సోదరభక్తులగు పాఠకులు ఆగ్రంథమును జదివి ఆనందింతురు గాక!

♦ ఈ శీర్షిక క్రింద 'సాయిసుధ'- (All India Sai Samaj, Mylapore, Madras- 4) మాసపత్రికయందు 1957 సంవత్సరము నుండి ప్రచురింపబడుచున్నది. పాఠకులు ఆపత్రిక చదువ ప్రార్థితులు.

---

# బాబా-సర్వసమత్వము

"సకల భూతములందున సముఁడ - లేఁడు
ప్రియుఁడుగానియు సాకు నప్రియుఁడుఁగాని;
ఎవరు నన్ను భక్తిని భజియింతు రందుఱ
వారు నాయందు; నేనుందు వారియందు.

కడు విచిత్రింబుసుమ్మి జగంబు విధము;
వీరలెల్ల నాబిడ్డల; వీరినెల్ల
సమతఁ గనువాఁడ; కాని, ముష్కరులు నగుచుఁ
బొలియుదురు కొందఱే నేమి సలుపఁగలను?

మిత్తి వాకిలిఁజొచ్చుచు మిడిసి యొరులఁ
జంప వీరలు జతనముల్ సలుపుచుందు;
రిట్టి చెయ్వుల నన్ను నొవ్వించుచున్న
మిన్నకుందుదు- సాక్షినై మెలఁగుచుందు.

త్యాజ్యమేనియు లేక గ్రాహ్యంబుగాని
మది విచారించి నిశ్చయింపనగు; దాన,
నల్పసుఖ వర్జనమున ననల్పమైన
దుఃఖమునుబాసి సుమతి సంతుష్టినొందు.

మొఱకుజాలరి యిడియెడి యెఱనుగఱచి
ప్రాణములు గోలుపోయెడి మీనుకరణి
క్షణికమాత్రి విషయముల ననుభవించి
కాలబద్ధుఁడై మనుజుండు కూలుచుండు.

సగము మేను బట్టి సర్పంబు మింగినఁ
గప్ప మనికి కాళి నప్పళించు,
జగతి నాయు విట్లు సమయుచున్నను విష
యముల మూఢబుద్ధి యాశఁ జేయు.

శాశ్వతుఁడు విశ్వకర్త విశ్వంభరుండు
దైవ మొకఁడ; సర్వసమర్థుఁడై వెలుఁగ;
దైవ ప్రతినిధుల్ గల రెల్లతావులందు,
వారలం దగ్రిసరుఁడనై వరలుచుందు.

నేను షడ్గ్యైశ్వర్యుఁడను నా నెలవు 'శిర్డి'
ఎల్ల విశ్వమునను వసియించియుందు;
నరయ వేలకలేండ్లు వయస్సు నాకు,
దీవెనలఁ బఱపుటయే మదీయవృత్తి,
ఎవ్వ రేమి కోరిన నదియొల్ల నిత్తు.

కోరిన కోరికలను సమ
కూరుతు నాశ్రితున, కెఱఁగికొని, యిట నేఁజే
కూరపఁగోరిన దానిని
గోరఁగ ననుడాయు ననెడికోరిక- బిడ్డా!"

అని, దయామయుఁడగు ప్రభుం డానతిచ్చె
ఇహపర సుఖంబుఁ బడయు నీ తిచ్చయేని
శరణు సేయుము జడమతీ! సాయినాథు
సంసరణ మయిత్రిఁ గందువు సాయికరుణ.

తన కభిముఖమై శరణము
గను జీవిని ప్రభువుసాయి కరుణఁబఱపి య
త్యనురక్తిని నాకర్షిం
చును జడలోహమును దివియు చుంబకము క్రియన్.

జాతిరూప వయో భాగ్య సంచయమున
నీతఁడుత్తముఁ డధముఁడౌ నీతఁ డితఁడు
శ్లాఘనీయుండు నీతఁ డశ్లాఘ్యుఁడనుచు
నెంచఁబోఁడు సాయి యనుగ్రహించువేళ.

భూతకోట్యాంతరిక భావభోక్తయై త
దంతరాత్మయౌ సాయీ సుధాంబుదంబు
ఖదిరమియ్యది యిది చంపకంబటంచు
వృష్టిసమయంబునందు భావించునేమి?

సకలభూతములను సాయి సముండునై
పఱగుచున్నఁ దత్కృపావలోక
నమున భక్తజనులు రమియింతురు పరమా
నందుఁడైన సాయినాథునందు.

అన్యరక్ష లేశమైననులేక క్షీ
రాది భోజ్యవస్తులందఁ బోక
స్నేహదృష్టిమాత్ర జీవింపవే కచ్ఛ
ప ప్రసవము లటుల భక్తుఁడలరు.

ఆకసంబు శూన్యంబైన నగుసుగాక
వారివాహ సుధాంశు రూపములఁ జేసి
చాతక చకోర సుదృఢ విశ్వాసమున నె
యెల్ల వాంఛితములను బూరించుఁగాదె!

అఖిల వాఙ్మనముల కెందు నందరాని
సాయిభగవానుఁ డవ్విధి సంశ్రితులను
నిరత మేడుగడై నిజకరుణఁ బఱపి
యమిత శాశ్వతానందామృతమున నింపు.

జయము! వేంకుశగురునకు జయము! జయము!!
జయము! ద్వారకామాయికి, జయము! జయము!!
జయము! శ్రీసాయి కరుణకు, జయము! జయము!!
జయము! భక్తులెల్లరకును, జయము! జయము!!

క్షితి సకలమత సమ్మత మతస్థాపన
సద్ధితాచరణ - శ్రీసాయి కరుణ,
సర్వమానవ హిత సౌభ్రాతృభావ వి
స్తార క్రియా గుణ - సాయికరుణ,
క్షాంతిప్రశాంతి విశ్వాస చతుర్విధ
సాధనోపకరణ సాయికరుణ,
ఇహపర స్థిరసుఖ విహితోప జీవనో
పాయ విస్తరణ - శ్రీసాయికరుణ,

సంసృతాబ్ధి సంతరణ - శ్రీసాయికరుణ,
చటుల కలిమలహరణ - శ్రీసాయికరుణ,
సాత్త్వికప్రేమకారణ - సాయికరుణ,
సతత జనసముద్ధరణ - శ్రీసాయికరుణ.

శ్రీసాయి కరుణ సత్కృతి
నాసక్తిఁ బఠించు భక్తులందఱ కాయు
శ్శ్రీ సంప త్సుఖ శాంతులు
వాసిగఁ బ్రాపించు సాయిబాబా కరుణన్.

చేతనాఽచేతనాత్మక సృష్ట వస్తు
సమితి వెలిని లోపల నెల్ల సమతఁబొలుచు
సచ్చిదానంద సద్గురు సాయినాథ
చరణ సరసిజయుగళంబు శరణు- శరణు.

అజ్ఞానభయద వాతాహతి వెలుపల
లోపల మిగుల కల్లోలపఱుప,
సాహసోత్తుంగ విమోహ తరంగముల్
దరుల మనస్థైర్య తరులఁగూల్ప,
పటు కామ కోపాది చటుల నక్రచయంబు
స్వైరవర్తనముల శాంతిఁజెఱుప,
ద్వంద్వరూపక భేదభావంబులను ఘను
లిందందుఁద్రిప్పుచు డిందుసేయ,

చెడు తలంపులౌ మీనముల్ చిందులాడ
ఘోర సంసార జలధిని గుటకలిడుచు
వనరు జీవిని దరిజేర్చి మనుపఁజాలు
సర్వసులభ సంతరణ- శ్రీసాయికరుణ.

నిరతంబుగా నినుగాక యన్యమును ధ్యానింపంగc బోనీకు మీ 'కరుణా సత్కృతి' స్వీయ భక్తహృదయా గారంబులనిల్పి, సాదరబుద్ధిగా బఠియించువారలకు నిత్యశ్రీలc జేకూర్పు; నీ చరణాబ్జంబులcబట్టి వేడెదc బరేశా! సాయినాథప్రభూ!

అఖిలభారత సాయిసంఘాధినేత
యైన నరసింహగురు నాజ్ఞ ననుసరించి
సక్తి ని వికారవత్సర శ్రావణంపు
బహుళపాడ్యమీ తిథి సౌమ్యవాసరమున
**సాయికరుణ** సత్కృతిని నీ చరణపీఠి
నప్పనము సేతుc గొనcగదే! అప్ప! సాయి!

నీవు పలికించు పలుకుల
నేవియొ నా యోపినంత నిట్లc బలికితి నే
నేవెరవు నెఱుcగ; నీపద
సేవకుcడగ; శాంతినిడవె! చిన్మయ! సాయీ!

*శ్రీ సాయీ కరుణ*

చతుర్థలహరి

సమాప్తము.

---

# వినతి - శరణాగతి

పరతంత్రుఁడను సాయిబాబ! నిన్నెఱఁ
[illegible] యత్నములు సఫలము గానేర!
బంధనములను ద్రెంచు పాటవమొప్పఁగ
సంసారమున నిట్టటు లేను [illegible]
బాహ్యసృతు నను ప్రలోభపుం [illegible]చుండఁగ,
లోకవాసనలు పెల్లుగ నేఁచసాగె;
మోహబంధముల నిర్మూలించి మించి
ఐహిక కాంక్షల నఖిల మడంచి.
వెలుపలిదృష్టిని వెస మగిడించి
తెలివిఁగూరిచి, లోని దృష్టిసారించి,
అంచితప్రేమ నహర్నిశ లెంచు
కొంచెపువాన జుగుప్స హత్తించి,
స్వార్థ ప్రయోజనాసక్తి మాయించి
వ్యర్థ లౌకిక భోగ పరతలఁద్రెంచి,
ఓరిమి విశ్వాస మొనరగిలించి
పారమార్థిక శాంతి భాగ్యమొందించి,
ప్రార్థ నీయావ్యయ పదమిడి, జనన
సార్థకతను గూర్పఁజాలు నీ కరుణా!

* * * * * *

ఇతర శరణ్య మే నెఱుఁగను సామి!
పతితపావన సాయిబాబ! నన్నోమి,
ప్రేమ, నీశాంతిశోభిత పరానంద
ధామముఁ జేర్పు;- వందనము! ముకుంద!!

# హారతి



శ్రీరామ సాయీ! సిద్ధావతారా! శ్రితజన మందారా!
ద్వారకమాయీ భవన విహారా! భవభయ పరిహారా!॥ శ్రీరామ॥
హారతి- కర్పూరహారతి- మంగళహారతి నర్పింతు
కారుణ్యమున జీవగణములఁ బ్రోతువు- కరములజోడింతు॥ శ్రీ॥
నీ బిడ్డలము మేము నీపాదరజమున- నిశ్చింతవ్రాలెదము
బాబా! యాసల పాల్పడఁజేయక- పరమపదం బిడుము॥ శ్రీ॥
ఎవరెవరెటు లాశ్రయింతురొ వారల- నీవటు తేలుదువు
వివరింప నీకీర్తి విస్తృతాద్భుతము- విశ్వైక బంధుఁడవు॥ శ్రీ॥
నీనామ పోతంబు నిశ్చయముగ భవ- నీరధి దాటించు
దీనజనంబుల దిక్కవు సాయీ! దేవా! కరుణించు॥ శ్రీ॥
సగుణబ్రహ్మంబుగ జగతినిఁబొడమితి- సాయి! శ్రీహరివీవు
అగణిత నిగమాగమములు శాస్త్రములు-సత్యము నిన్నెఱుఁగలేవు॥ శ్రీ॥
శరణాగత దీన సంరక్షకుఁడవను శపథము నిలఁబెట్టుము
పరమేశ! శ్రీసాయి! వరదాభయ కరముఁ-బఱపి నన్జేపట్టుము॥ శ్రీ॥
నీదివ్యపదసేవ నిరుపమ భాగ్యమ్ము-నిరతంబు మాకీయుము
సాదరముగ హనుమచాతకముజ సాయీ-జలదాంబు లానింపుము॥ శ్రీ॥
నీరాజనంబిదె నీకిత్తు శ్రీసాయి!- నిఖిల జగదాధార!
ద్వారకమాయీ బాబాసాయీ!-భవభయ పరిహార!॥ శ్రీరామ॥

ఓమ్

శ్రీ సాయీ!

# స్వబోధ

ఎఱుఁగఁగలేరురా! బాబామర్మం-బెంతవారలైన,
మా-యాబాతత్త్వం బెంతవారలుగాని,
కొందఱుశివుడటంగ- కొందఱు విష్ణుగ-
సామంతుఁడనఁగ - పలుకరా! ఎ॥
కొందఱు లోభిగ- కొందఱు భోగిగ-
జ్ఞానియనుచుఁ గొందఱు దలచిరిరా! ఎ॥
కొందఱు యోగిగఁ గొందఱు త్యాగిగఁ
గొందఱు సాధనుకొందురురా! ఎ॥
కొందఱు గురుఁడు స-ద్గురుఁడని కొందఱు
కొందఱీశుఁడని కొలుతురురా! ఎ॥
శ్రీ సాయిప్రభు సిద్ధస్థితి నే
కొందఱో సత్యము గుర్తించిరిరా! ఎ॥
ఎవరెవరేగతి నెంతురో యాయా
ఫల మవ్వారికిఁ గలుగునురా! ఎ॥
ఇందఱ పలుకుల నెంచి భ్రమింపక
హితమతి హనుమా! ఎఱుగుమురా! ఎ॥
స। తత్కృతమతి హనుమా! ఎఱుగుమురా!

శ్రీ సాయీ కథలు
సర్వము సమాప్తము.

శ్రీసాయినాథార్పణమస్తు!
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు!
ఓమ్
తత్ - సత్.



నేనుకృతకృత్యుఁడను, ధన్యుఁడేనయ్యెదు;. హితసముద్ధృతిఁగనిరి నాపితరులెల్ల
సాయినాథుండు. నిజభక్తసహితుఁడగుచుఁ; జేరి నాకుటీరమున వసించుకతన. .
శ్రీ సాయీభక్త చరిత్ర పరిచరణుఁడు,., రచయిత..

# సవరణ

| పుట—పంక్తి. | | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|

## విజ్ఞప్తి

| | | | |
|---|---|---|---|
| 2. | 14 | పెట్టుదువా? | పెట్టుదువా? |
| 11. | 13 | భిన్న సంశయాః | ఛిన్న సంశయాః |
| 12. | 17 | చరియుంచు | చరించు |
| 13. | 15 | జానమావృతము | జ్ఞానమావృతము |
| 41. | 13 | వాసుదేవు | వాసుదేవు |
| 15. | 4 | వసైవు | వస్తువు |
| ,, | 11 | నానాబోధల | బాబాబోధల |
| ,, | 14 | నూద్రుఁడు | శూద్రుఁడు |
| ,, | 21 | జన్న ముల | జన్మముల |
| 18. | 9 | నసుస్తించుట | నసుష్ఠించుట |
| 27. | 1 | మృత్యువాత | మృత్యువువాఁత |
| 29. | 3 | శవములు | వశములు |
| 35. | 22 | హితకర్మము | హితకరము |
| 43. | 2 | నీపాంతఁబో | నీపాంతఁజో |
| 44. | 1 | భూతభవిష | భూతభవిష్య |
| 45. | 20 | నాగురుఁడు | నాగురుండు |
| 50. | 17 | యదార్థంబు | యథార్థంబు |
| 53. | 21 | ఉపకరములు | ఉపకరణములు |
| 57. | 21 | రక్షించుగాతయని | రక్షించుగాతమని |

# ఉపక్రమణిక శుద్ధి

| పుట–పంక్తి. | | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 9- | 12 | గాజా | [illegible] |
| 11- | 21 | ప్రాణిసేవ | ప్రాణసేవ |
| 21- | 1 | నిన్ను | నన్ను |
| 22- | 7 | జూచి | చూచి |
| 33- | 18 | మొఱుఁగ | మొఱుఁగు |
| 56- | 18 | తగదు | తగుదు |
| 73- | 4 | ప్రభావముగుడు | ప్రభావముగును |
| 79- | 20 | రూపాలు | రూపాయలు |
| 84- | 10 | కృత | కృప |
| 86- | 14 | పలుపరాదు | పలుకరాదు |
| 96- | 5 | సన్యాసిర్యై | సన్న్యాసిర్యైన |
| 100- | 14 | నిశ్వరునకు | నిశ్వదునకు |
| 102- | 7 | కలవు | సెలవు |
| 103- | 5 | చెప్పటిని | చెప్పుటకని |
| 129- | 3 | కరుణించెను | కరుణించెనుగ |
| 157- | 14 | చెందు | తెందు, |





శ్రీ సాయిలీలా ప్రచురణము. 6.

# ఏమీ నిన్ను పేక్షింతునా?

(శ్రీ సాయిబాబా జీవితచరిత్ర-భక్తుల అనుభవములు)
(వచన కావ్యము, మొదటిభాగము)

భక్తులారా!

అఖిలభారత సాయి సంఘాధ్యక్షుండు పూజ్య శ్రీ బి. వి. నరసింహస్వామిగారు శ్రీమలకొర్చి పలువురుబాబాభక్తులను స్వయముగదర్శించి పెక్కువిషయములు సేకరించి రచించిన 'Life of Sai Baba' అను గ్రంథమును, హేమాద్రిపంత్ (అన్నాసాహెబ్ దభోల్కర్) మహారాష్ట్రభాషలో రచించిన శ్రీ సాయి సచ్చరిత్రకు శ్రీ వి. వి. గుణాజిరచించిన ఆంగ్లానువాదమును, దాసగణూమహారాజు రచించిన 'భక్తసారామృతము' అను గ్రంథమును ఇతరసోదరభక్తులచే రచింపబడి యిప్పటికి వెలువడిన గ్రంథములను ఆధారముచేసికొని, "శ్రీ సాయిబాబా జీవితచరిత్ర- భక్తుల అనుభవములు" "ఏమీ, నిన్ను పేక్షింతునా?"- అను పేర వచనకావ్యముగ రచించినాండను. మొదటిభాగము 350 పుటలుండును. ఇందు 150 పుటలు శ్రీసాయిబాబా జీవితచరిత్రయు, తక్కిన 200 పుటలలో 1. నానాసాహెబ్ చందోర్కరు. 2. కాశీనాథగోవింద ఉపాసనీ (ఉపాసనీబాబా) 3. దాసగణూమహారాజు. 4. భగత్ మహాల్సాపతి. 5. జి. ఆర్. దభోల్కరు (అన్నాసాహెబ్ దభోల్కరు)- హేమాద్రిపంతు. 6. కాకా దీక్షిత్ (H.S. దీక్షిత్) 7. Prof. G.G. నార్కే. 8. S.B.ధుమాల్

9. S. B. నాన్నే వహాన్సన్. అను భాగ్యశాలుల అనుభవ
ములు కలవు.

శ్రీ సాయీప్రభువు భాసిల్లుచున్న సత్ప్రభము, సిద్ధసం
దన అంకితసంతతిని ఏవిధముగ ఎట్లు రక్షించుచున్నారో యిందు
విశదముగా తెలుపబడినది. తక్కిన భక్తుల చరిత్రములు, 2, 3
భాగములలో రచింపబడినవి ఉదాహరణలు వగైరాలు సోదరీ
సోదరభక్తులు లోగడ శ్రీసాయీనామసుధ, శ్రీసాయీకరుణ
గ్రంథ ముద్రణములకు ప్రకటించిన శ్రీసాయీ భాగ్యములు
ఈగ్రంథముద్రణమునందును ప్రకటించి ఏమి, ఎన్ని పంపెదరా?
అను నీకృతిని త్వరలో ఆంధ్రలోకమున వెలువడుభాగ్యము
గల్పింతురని ప్రార్థించువాడను.

ఈగ్రంథములు ఆంధ్రదేశములోని బాబా పూజామంది
రములకు భక్తసమాజములకు ప్రోత్సహించు సోదరభక్తులకు వారు
తెలిపినవారికి ఉచితముగ అందించవలయునని సంకల్పము.
ఈకృతిరూపమగు శ్రీసాయీప్రభువు సేవయందు తమకు సాధ్య
మగువిధమున చేయూతనిచ్చి యిప్పింతురని ప్రార్థించువాడను.
పదిరూపాయలు తగ్గని సాయముచేసిన దాతలపేర్లు గ్రంథమున
పోషకులుగ ప్రకటింపబడును. రు 8/- తగ్గని సాయముచేసిన
వారికి ఒకప్రతి పంపబడును. తమకుసాధ్యమగువిధమున తోడ్పడి
శ్రీసాయీకరుణకు పాత్రులగుదురని ఆశించువాడను.
శ్రీసాయీనాథుడు తనబిడ్డలనెల్లరను రక్షించుగాత!

ఓమ్ శ్రీసాయీ!

శ్రీ సాయీకుటీరము,
చిన్నగంజాము. P.O
గుంటూరు జిల్లా

ఇట్లు
భక్తజన విధేయుడు,
బాపట్ల హనుమంతరావు.

## ఈరచయితచే రచింపఁబడి ముద్రితములైన గ్రంథములు.

1. శ్రీమద్భగవద్గీతామృతము. భగవద్గీతశ్లోకములు- తెనుగుపద్యములు
2. ప్రబోధసుధాకరము. (శ్రీశంకరాచార్యకృతికి ఆంధ్రీకృతి)
3. ఆశ్చర్యచూడామణి. (శ్రీరామచరిత్ర నాటకము)
(శక్తిభద్రకవి రచిత సంస్కృతనాటకమునకు ఆంధ్రానువాదము)

## (శ్రీ) సాయీలీలా ప్రచురణములు. (ముద్రితములు)

1. శ్రీ సాయీబాబాపూజాస్తవములు. (పునర్ముద్రణముకావలయును 0-8-0
2. శ్రీకృష్ణకర్ణామృతము. (భక్తలీలాశుక సంస్కృతకృతికి తెనుగు గీతములు) 1-0-0
3. శ్రీ సాయీమననము (3 సర్గములు) 1-0-0
4. శ్రీ ఆపదుద్ధారక శతకము (శ్రీరామకథాత్మకము) 0-8-0
5. శ్రీ సాయీకరుణ 2-0-0

## ముద్రణము కావలసినవి.

6. శ్రీ వేంకటేశ్వర సుప్రభాత గీతములు.
7. సాయీబాబాకూడ దేవుఁడేనా? ఉన్నదేవుళ్ళుచాలకనా?
(సందేహనివృత్తి)
8. ఏమీ, విన్నుపేక్షింతునా? (శ్రీసాయీబాబా చరిత్ర భక్తుల అనుభవములు) మూడుభాగములు.
(మొదటిభాగము- ముద్రణమునకు సిద్ధముగనున్నది)
9. ప్రేమామృతము.
(నారద భక్తిసూత్రములు- టీక- తెనుగుపద్యములు- వివరణ గీతమాలిక)
10. శ్రీ సాయీ కబీరు సూక్తులు- సాఖీలు- తెనుగుద్విపద)
11. శ్రీ సాయీలీలామృతము- 3 భాగములు-
(గాణూదాసకృత మహారాష్ట్రకృతికి తెనుగు ద్విపద)
12. శ్రీ సాయీబాబా చరిత్ర- (బుఱ్ఱకథ)
13. పుండరీకుని చరిత్రము (పండరిస్థల మాహాత్మ్యము)